487. C. 13.

విద్యానిలయ కుసుమాంజలి 1

# నాట్యాంబుజము

---

పురాణం సూరిశాస్త్రి



విద్యానిలయము
బందరు

బెజవాడ ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్ (లిమిటెడ్) యందు
క. కోదండరామయ్యచే ముద్రింపబడియె.

1923

# అవతారిక

తెలుఁగుతల్లి యడుఁగుఁదమ్ములకు విధేయుఁడనై నేను సమర్పించు తొలికానుక "నాట్యాంబుజ" మను నీచిన్నిపుస్తకమై యున్నది. నే నింతదనుక తెలుఁగుపత్రికలలో ప్రచురించినవ్యాసములు, విమర్శనములు, కొన్నితావుల నిచ్చిన యుపన్యాసములు, సంభాషణలలో వెలిబుచ్చిన అభిప్రాయములు వీనిలో నాటకకళనుగూర్చినవాని నిందు బొందుపఱచియున్నాను. ఇట్టివే కావ్యములగూర్చిన నాయనుభవములు "కావ్యాంబుజ" మను మరియొకపుస్తకములో ప్రచురించుచున్నాను. ఈరెంటియందును ఆధునికకావ్యనాటకకళలందు ఆంధ్రులొనర్చు ప్రయత్నములు విమర్శింపబడియున్నవి. ఈకళలపోషణార్థము శక్తియుక్తులను సమర్పించుచు నాంధ్రలోకమునకు నుపకారమొనర్చు నాసోదరదేశసేవకుల సత్ప్రయత్నముల సవిమర్శగ నెంచుటయె యీపుస్తకముల యుద్దేశ్యము.

"నాట్యాంబుజము" కళయం దభిమానముచే గూర్చబడిన వ్యాసమాలికగాని నాట్యశాస్త్రపు నిగ్గుతేల్చు "నాట్యానుశాసనము" కాదు. ఇదియు నవతికాలమున ప్రచురించి యాంధ్రనాటకకళాపోషకుల సంస్కారాభివృద్ధికి శాస్త్రీయమైనమార్గముల జూప యత్నించుచున్నాను.

ఈవ్యాసములలో నటులు, కవులు మున్నగువారి నామముల నేకవచనప్రయోగమున వాడియున్నాను. వాక్య

పారశ్యముకొఱకును, ప్రసిద్ధార్థమునను, ప్రేమ పెంపునను నిట్టి ప్రయోగక్రమ మవలంబించితిని. నా విమర్శకనియమములలో గుణసమృద్ధిచే నుత్సాహమిచ్చుచు నెవ్వియో యొకటి రెండు లోపములుగల కవులను, నటులను, విషయములను గైకొని, నా ప్రపంచానుభవము, శాస్త్రపరిచయము, కళాపరిజ్ఞానము ననుసరించి వీలైనంతవఱకు సమభావముతో విమర్శించుటే ముఖ్యాదర్శమై యున్నది. అయినను నెక్కడనైన, నేరికైన, నేవిధమైన సంశయ మేర్పడినను మన్నింప వేడుచున్నాను.

ఆంధ్రనాటకసమాజములలో కొన్నిటిమాత్రమే నేను చూచియున్నాను. నేను చూడని నటులు, నాటకము లెన్నేని కలవు. నా యనుభవము ననుసరించి యీపొత్తము కూర్పబడినది. ఈపద్ధతిలో నాంధ్రదేశపు నలుదెసలనుండి నాలుగైదు పుస్తకము లిట్టివి వెలువడినగాని ఆంధ్రనాట్యరంగము సంపూర్ణముగ తెలియనేరదు. ఇందులో జేర్పబడని పెద్దనటులందఱు పరిచయానుభవములు లేనందున విడచితినని మన్నింపవలెను.

నాపుస్తకములు తెలుగుదేశమున విజ్ఞాన మభివృద్ధి చేయుతలంపుతో మాత్రమే ప్రచురింపబడుచున్నవి. నా సోదరులు ఈప్రయత్నములో తగిన సలహాలందించి నా జీవితమునకు కృతార్థత నొనగూర్ప వేడుచున్నాను.

విద్యానిలయము. —పురాణం సూరిశాస్త్రి.

---

# విషయసూచిక

## మొదటి దళము (నాటకానుభవములు).



## రెండవ దళము (ఆంధ్రనాటకములు)



## మూడవ దళము (నాటకసమాజములు)



## నాల్గవ దళము (ప్రసిద్ధనటులు)

# విషయసూచిక

మొదటిదశము: నాటకానుభవములు

## మొదటిదళము

# నాటకానుభవములు

చిన్నతనములో నాటకములను పాటకచేరీలను దర్శించు వీలు కలుగకుండెను. నా యుపనయనసందర్భమ్మున కూచిపూడి భాగవతులచే నాడింపబడిన ప్రహ్లాదనాటకము, రామనాటకము నా ప్రథమానుభవముల నేర్పరచెను. బాల్యమైజమున వీని జరకాల మనుకరించుచుంటిమి. సుమారు పదేండ్లవయసున వలందపాలెముకంపెనీవారి స్టేజినాటకము "శశిరేఖాపరిణయము" చూడగలిగితిని. కూచిపూడి భాగవతులు బాడిదచెక్కనగలను, కిరీటభుజకీర్తులను, మొగలాయితరహాదుస్తులను, హరితాళవర్ణమును విరివిగా నుపయోగించుచుండిరి. నాటకము ముగిసిన తెల్లవారి రంగమంతయు నద్దపుపెంకులతో నిండియుండెను. హాంగులోని జనమంతయు పాత్రసంభాషణము, కీర్తనలు అందుకొని గందరగోళముగ బాడుచుండిరి. హాస్యగాడు ఎవ్వరియో వల్లించిన వాక్యములతో కొందర నానందింపజేయుచుండెను. స్త్రీవేషము ప్రవేశించునపుడు తెరయొకటిపట్టి కాగడాలమీద గుగ్గిలము జిలికించి భామను తళుక్కున బ్రకటించుచుండిరి. ఈ భాగవతములో మిక్కిలి వికృతముగ నాకు తోచినపట్టు రాజుచేసిన ప్రతిచేష్టను, అభినయమును మంత్రి నిరర్థకముగ ననుకరించుచుండుటయే. వీధి భాగవతములందలి యంగవిన్యాసము, అభినయరీతులు నే నెప్పు డెరుగకుంటిని. మా

నాయన్న నాటకపు మధ్యాహ్నముల నటులకు పద్యములను, దరువులను, చదువవలసిన రాగముల నిర్ణయించుచుండెను. అప్పుడు వారు తలచుచుండిన రాగములు చాలవరకు కర్నాటక సంగీత రీతులవేయని మాత్రము జ్ఞాపకమున్నది. శ్రీరాగము ప్రధానముగానుండెను. నరసింహమూర్తి వేసినవాడు ఆదినము ఉపవాసముండెను. ఆకాలములో గ్రామములోని పెద్దమనుష్యులనేకులు భాగవతమందలి రసాభినయముల నెక్కువ ప్రోత్సహించుచుండిరి.

వలందపాలెపు కంపెనీ చెన్నుగిరిపేటలో నొకపందిరిలో నుండెను. ఎదుట తెల్లని సైనుతెరలోపల చిత్రములులేని గుడ్డపీలికల రంగపక్షములు, వికృతముగ భీకరముగ డాబురంగులతో జిత్రింపబడిన తెరలు యీపందిరిలో నమర్చబడి యుండెను. అప్పటికి బందరులో రామానాయుడుపేట హిందూథియేటర్, గొడుగుపేటలోని ఛత్రపూర్ జగన్మోహన్‌థియేటర్ ప్రసిద్ధములై హైందవపురాణ గాథలను గద్యములలో నాడుచుండిరి. కాని వీరి గద్యావస్థ నేను చూచియుండలేదు. వలందపాలెపువారి శశిరేఖాపరిణయము ఆనాటి నాట్యవైఖరుల సామాన్యలక్షణములు ప్రతిబింబించునని నమ్ముచున్నాను. ముందు గజాననదర్శనము, సరస్వతీప్రసన్నము, సూత్రధారునకు కలిగెను. తాంబురాశృతితో తెలుగు కీర్తనలు, అప్పుడప్పుడు హిందూస్థానికీర్తనలు పాడబడుచుండెను. రాక్షసపాత్రములు చినాలిరంగు పూసుకొని, జెడలు వ్రేలాడ, వలవల కేకలిడుచు, నాపేటలోని నిద్రాయత్తులెల్ల రులికిపడు

నట్లుగా బొబ్బలిడుచుండిరి. గద్యము పట్టిపట్టి ప్రత్యేకరంగోచ్చారణాఘణుతులతో నుపన్యసింపబడెను. ఈనాటకములో హాస్యగాడు వేపమండ నొకదానిని నెత్తికి తగిలించుకొని యసందర్భపు వాక్యములతో నార్యుల నవ్వింప జూచుచుండెను. వైర్ వర్కు విశేషము వాడబడెను.

1898 లో గడ్డిపూడిభాగవతులు మావాకిట దాష్టీక పంతులు నాటకమును, రెడ్డికథను ప్రదర్శించిరి. వీరిలో కొందరిప్పుడప్పుడు యాచనార్థము బందరువచ్చి మాయింటివారికి జాతీయములు చెప్పిపోవుచుండిరి. కూచిపూడి భాగవతులు, అభినయ సమయసంకేతముల పాటించుటకు, తమ ముఖ నేత్రహస్తముల, నేవిధి కష్టించి యలవరచిరో, అటులనే పగటిభాగవతులు, ఈప్రాంతముల మొగలాయీకాలపు ప్రభుత్వవర్గమును, జనసామాన్యమును యథారూపముగ ననుకరించుటలో బాటుపడిరి. తరువాతి స్టేజినాటకముల హాస్యాభినేతలు జాతీయములు జెప్పయత్నించినను, వీరి హాస్యసందర్భములు కాలోచితముగ నున్నను, హాస్యవాక్యములందెక్కువ స్వాతంత్ర్య సమయస్ఫూర్తు లుండినను, జాతీయానుకరణమందు నవీనహాస్యగాండ్రకు ప్రత్యేకశిక్ష లేదు. పగటిభాగవతులు ప్రదర్శించినపట్లు, అధునాతనసంఘ పరిస్థితులకు సంబంధించినవి కాకపోయినను, ఆయా జాతి మానవులకు నాయా వృత్తులలో నుండువారికి నైజమైనవనియే చెప్పవచ్చును. జిల్లా సీమలలో పగటిభాగవతుల జాతీయానుకరణ మీనాడు కాలదోష మనుభవించినను, తెలుగుదేశపు మెట్టజిల్లాలలోను

హైదరబాదు ప్రాంతములలోను నిప్పటికిని వర్తించు ప్రజాజీవనమున కివి యథార్థరూపచిత్రములని భావింపదగును. పగటిభాగవతుల దుస్తులును, పాత్రౌచిత్యమును, స్వరాభ్యాసమును, ఈనాటి స్టేజిజాతీయములు సమీపించలేకున్నవి. ఈపగటిభాగవతములు పూర్వము బ్రాహ్మణనటులచే నభినయింపబడెను. మానాయనచిన్నతనములో నిందు తాడేపల్లి విస్సయ్య మిక్కిలి పేరొందియుండి బందరులోని పెద్దఅధికారుల ప్రాపకమనుభవించుచుండెను. నేను చూచిన మేళముకూడ బ్రాహ్మణులదే. ఇటీవల బ్రాహ్మణులు జాతీయనాటకాభినయ శిక్షాభ్యాసములను వదలినట్లు కనుపించుచున్నది. ఈనాడు పగటిభాగవతము గొల్లలు, మాలలు, మున్నగు వీధాదిదుర్ల యాధీనమున జేరి ప్రతిభాసంపత్తి చెడియున్నది. ఇరువదియేండ్ల క్రిందటివరకు అభినయశాస్త్రసంకేతముల నభ్యసించి, భావరాగతాళముల యలంకారపరిజ్ఞానముతో, కూచిపూడిభాగవతులీప్రాంతమున నుత్తమరసాభినయముల జేయుచుండిరి. పగటిభాగవతులు ప్రత్యేకశిక్షనొంది నాఘిక జాతీయస్వరూపమును బ్రదర్శించుచుండిరి.

ఆకాలములో తోలుబొమ్మలు, దొమ్మరవాండ్రు, విప్రవినోదులు, భట్రాజులు, విశేషముగ వచ్చుచుండిరి. బయస్కోపులు తోలుబొమ్మలను చంపినవి. దొమ్మరవాండ్రు సర్కసుకంపెనీల డేరాడ్రెస్సుడేలుల కీల్గినవి. విప్రవినోదుల స్థానమును నవీనమాజిక్కు, మెస్మరిజములు, ఆక్రమించినవి. ఆకాలములో పల్లెటూళ్లయందు, సామాన్యపట్టణములందును

జంగముకథలు చెప్పు తందనాలవాండ్రు అన్నికులముల పెద్దలచే గౌరవింపబడుచు, మిక్కిలి యుత్సాహముతో, నభినయ కౌశలముతో, సమయస్ఫూర్తితో, వేషసౌష్ఠవముతో నాంధ్ర మరాటీగాథలను జెప్పి మెప్పించుచుండిరి. వీరి కథాప్రసంగము చాలవరకు భాణముల పోలిక నడచుచుండెను. ఆంధ్రుల నాటకాంకురము కొట్టి జంగముకథాబీజములనుండి ఉత్పన్నమై నదనుటకు సందేహము లేదు. బుంజలవాండ్రు, సుద్దులవాండ్రు, కొన్ని కులపురాణములను, తెలుగు సీమల గ్రామదేవతల కథలను, రసపుష్టిగల చిక్కని తెలుగుపలుకులతో, ముచ్చటగ శకకళ లుట్టిపడ జెప్పుచుండిరి. వీరందరు క్రమముగ పెద్దలగు రసజ్ఞుల యాదరణబాసి, కష్టజీవులగు పామరుల నిద్రావిలుంఠి తసిళ్లోవినోదముల కుపచరించి హీనదశయందున్నారు. 25 యేండ్ల క్రింద, బందరులో కవితాప్రదర్శనములు తరచుగ లేకుండెను. పంతులవారి మేడలో తిరుపతి వెంకటేశ్వరుల శతావధానమునకు నేను పోయియుంటినిగాని పెనసల్లు పంచిపెట్టుట, శాలువలు కప్పన పండిత విగ్రహములు సభాస్తారులై కూర్చుండుటయు మాత్రమే నే నప్పటికి తెలిసికొనగలిగిన విషయము. పెండ్లిండ్లకాలములో మాత్రము భట్రాజు లనేకులు గ్రామమునకు వచ్చుచుండిరి. వీరు వసుచరిత్రలోని పద్యములను, రాయన భాస్కరుని త్యాగసంకీర్తనము, తలలు మార్చిన స్తుతిపద్యములను, చక్కని శ్రీరాగశోభితమగు పల్లెటి తెలుగుపురాణ శైలిలో పద్దెములు జదివి, దాన కుతూహల మేర్పరచుచుండిరి. భట్రాజు లిప్పుడు వినోదమునకైన గానరాకున్నారు. బాల

కవులు, ఆశుకవులు, అవధానచతురులు, జంటకవుల గీతమా లికలు, దేశమునం దమేయపరిధవంబుల నల్లికొన, తెలుగు దేశపు నైజకళితాభినయములు వింతలై రూపుమాసినవి. ని

ధార్వాడకంపెనీ బందరుకు రావడము నేనెరుగను. వీ ఆదర్శమున బందరులో మూడు నాలుగు కంపెనీలు వెలసినవట. వీని తొల్లిటిరూపముల నేనెరుగను. నాదెళ్ల పురుషోత్తముగారు. మల్లాది అచ్యుతరామశాస్త్రిలుగారు మొదలైన తెలుగుకవులు గద్యకీర్తన శ్లోకమయముగ, నాటకములువ్రాసి ఆడించుచుం డిరి. ఈనాటకముల గద్యవైఖరి నిటీవల చూచినాను. అప్పటి ప్రోజునాటకములు అభినయమునకు యెక్కువ అవకాశమిచ్చు చుండెననుటకు సంశయములేదు. బందరులో నాటకసమాజ ములచే యువకులకు గలిగిన నష్టములు నా కొక సంభాషణవలన తెలిసినవి. ఒకనాడు మానాయన పెందలకడ రాత్రిభోజనము చేయుచు, బండికట్టింపుమని యాజ్ఞాపించెను. మాతాత "యెక్క డకు పోయెద"వని అడిగిరి. "నాటకమునకు" అనగా "ఊళ్లోవాళ్ళ పిల్లలు చదువుసంధ్యమాని నగానట్రా యెత్తుకవచ్చి నాటకా లా డడము! వాళ్ళవాళ్ళు ఘోషించడము! మీవంటి ఉద్యోగస్థులు ఆనాటకాలు చూచి మెచ్చుకొనడంవల్ల, వాళ్ళుచేసేపని మంచిది అన్నట్టె అర్థమవుతుందిగదా! కాదా?" అని మాతాతగా రాక్షే పించిరి. అప్పటికే బందరులో ప్రధానపౌరుడుగనుండిన మాతం డ్రి మిన్నక తలవాల్చి "బండి అక్కరలే" దని చెప్పునెను.

1899-1900 లో గుంటూరు ఫస్టుకంపెనీ బందరువచ్చి ప్రదర్శించిన నాటకములలో వడ్డాది సుబ్బారాయుడుగారి

వేణీసంహారము, వీరేశలింగముగారి శకుంతల, కృష్ణమాచార్యులుగారి సారంగధర, చిత్రనళీయములు, జనరంజకములై బరగి యిచ్చటి నాటకపుకంపెనీలకు హృద్యమట్టు సమన్వితమైన నూతనాభినయరీతులు నలవరచినవి. వీని నాటకము నొకదాని నేను చూడగలిగితిని. దినవహి కృష్ణమూర్తియను నాతడు రాజమందిరమునుండి వచ్చి గొడుగుపేట కంపెనీవారికి వేణీసంహారము నేర్పుచుండెను. గుంటూరు కంపెనీవారిలో విద్యాన్న, హాస్యమునకు గోపాలరావు, శాస్త్రులు, ప్రసాదరావు మిక్కిలి పేరొందియుండిరి. గుంటూరువారు హిందుస్తానీతోడి, ఫలు. కాఫీ, మొదలయిన రాగములను, హార్మోనియమైను, మద్దెలను, బందరులో ప్రవేశపెట్టిరి. చిత్రములు కట్టిన సీనరీ, పోని జూచియు వీరి తరువాత బందరువచ్చిన పార్శీకంపెనీల వలన యిచ్చటివా రవలంబించిరి. మాగంటి సుబ్బారావు హరిశ్చంద్రపాత్రమును నభినయింప నొకమారును, యెడ్వర్డు పట్టాభిషేక సమయములో బుట్టయ్యపేటవారి శకుంతలను, లక్ష్మణస్వామిగారి షుమేరుసింగు నొకమారును, లింగమూర్తికి విద్యార్థులు పతక మొసంగిన చిత్రనళీయము మాత్రమే మెట్రిక్యులేషను ప్యాసగుసరికి నేను చూచిన నాటకములు.

మదరాసులో నంతగా ఒకటి రెండు పార్శీనాటకములను బి. యే. పరీక్ష దాటులోపల జూచియుంటిని. బి. యే. దాటినవెనుక బందరులో రికామిగా నుండిన సమయములో యిచ్చట నాటకములను చాలా చూచియు, గుంటూరులో

సెకండుకంపెనీ పేరు కనకరత్నంగారిదానితో విశేషసాంగత్య ముండియు, నాటకకళాభినయముల సందర్భములను తెలుసుకొనఁగలిగితిని. అప్పటికి దేశములో జాతీయభావము లంకురించి, చిలకమర్తి లక్ష్మీనరసింహము, తిరుపతి వేంకటేశ్వరులు రచించిన భారతభాగవతగాథల పద్యనాటకములు అభివృద్ధిలోనికి వచ్చెను. వీనికితోడు ఈవన లక్ష్మణస్వామిగారు బందరులో ప్రతాపరుద్రీయము, రణప్రతాప మొదలగు నాటకముల నభినయించుచుండిరి. చరిత్రనాటకములలో అత్తపోరు బిడ్డమీద తీర్చినట్లుగా మహమ్మదీయులపై ద్వేషమూనుట నాఁటి దొల్లిటినుండియు ననహ్యముగనే దోచుచుండెను. గుంటూరు సెకండుకంపెనీలో ప్రసిద్ధులై యుండిన పెద్ద చిన్న లక్ష్మీకాంతములు, మల్లాది గోవిందశాస్త్రి, మొనమాడ్రి శీనయ్య, యడవల్లి సూర్యనారాయణ, బందరులో దేవరకొండ సుబ్బారావు, పామర్తి సంజీవరావు మొదలగు నటుల స్నేహ మా కాలములో నేర్పడి, నాటకములం దెక్కువ యభిరుచియు, విమర్శకశక్తియు నేర్పరచినవి. ఈకాలమందే తెలుగుసారస్వతమం దభిరుచియు, తెలుగులో శాస్త్రవిషయములఁగూర్చి పుస్తకములు వ్రాయుటయు నారంభించితిని.

1911-1915 చెన్నపురిలో రసాయనశాస్త్ర మభ్యసించుచు నాంధ్రసారస్వత ప్రయత్నములలో బాల్గొనుచుండిన, కాలములో తమిళ, కర్ణాటక, పారశీక నాటకములను, బళ్లారి, రాజమండ్రి మున్నగు ప్రదేశముల ప్రసిద్ధాంధ్రనాటక సమా

జములవారియాటలను, బయస్కోపులో జూపబడిన జగద్వి ఖ్యాతనటుల అభినయములను, కొన్ని ఆంగ్లనాటకములను, అన్ని కత్రులసంగీతకీర్తులను అనుభవించియుంటిని. ఇటీవల బందరులో నద్దియో యొకనాటకసమాజమున కెల్లప్పుడు సంబంధినై యుంటయేగాక హిందూదేశమం దెల్లెడ గల వివిధభాషల నాటకప్రదర్శనములు చూడగలిగితిని.

నేను నటుడను కాను. కవిని గాను. సంగీతమం దావంత యేనియు నాలాపించలేను. నాట్యరంగముల జిత్రించు నేర్పరి నికాను. కాని కావ్యసంగీతాభినయముల రసస్వరూపమును, సరసముగ ననుభవించు విమర్శకవిచక్షణ మొదటినుండియు నా కెట్టులో అలవడినది. నవలలు, నాటకములు, పద్యకావ్యములు విశేషముగ జదివియు చిత్రప్రపంచమందలి భావప్రకటనము మనసార గ్రోలియు, నుత్తమనాట్యసంగీత విద్యాప్రదర్శనంబు లనేకముల జూచియు, నాటకములందలి మంచి చెడ్డలు గుర్తించు వివేక మొప్పుచుంటిని. రసలక్ష్యములచే కన్న, గ్రంథావలోకనముచే కన్న, ప్రపంచమును నవరస భరితమైన అవస్థలలో జక్కగ బరికించి చూచుటవలన నాకు కావ్యనాటకకళాలక్షణములు విస్పష్టముగ బోధపడినవి. కళలన్నిటియందును సమానమైన ఆదరణాభిమానములు వానిలోని యందచందములారయు విజ్ఞానానుభవములు నా విద్యాభ్యాసకాలాంతమునకు జక్కగ కుదిరినవి. "నీవు యింత చక్కని విమర్శసూత్రము లెక్కడ చదువుకొన్నావు?" అని చెన్నపురిలో నుండగా నిప్పటి తెలుగు కవులలో వన్నెగాంచిన

కొండ్రు రడిగిరి. "అన్నిరకాల మనుష్యుల జీవితాంశములను లక్ష్యములో, సానుభూతితో విచారించుట వలనను ప్రకృతిని కనులు తెరచుకొనిచూచి అందలి రసభావములను లోతుగ ననుభవించుటచేతను కళారహస్యముల గుర్తింపగలిగితిని. ప్రకృతియే నేనుపయోగించెడి యలంకార లక్షణము."

కాలేజీలలో గావ్యనాటక విమర్శనమునకు ఉత్తమ గణ్యత నొందుచు, నుపాధ్యాయుల మెప్పు వడయుచుంటిని. బి. యే. లో నుండగా సంస్కృత నాటకములందలి స్వభావాదర్శ గుణముల గూర్చి వ్రాసిన ఆంగ్లవ్యాసము (The Real & Ideal in Sanskrit Drama) పండిత మాలూరు రంగాచార్ల గారిచే మిక్కిలి ప్రశంసింపబడినది. సారస్వత శిల్పములం దెట్లో అటులనే నాటక విమర్శనమందు లబ్ధమైన మహావిమర్శకుల నెల్లర జదువుచుంటిని. తరువాత సందర్భవశమున వ్రాయబడిన రూపకాభినయవిమర్శనములలో గొన్నిటి నిందు పొందుపరచియున్నాను.

1915 డిశంబరులో బందరుపురమందు కానుకొలను వెంకట్రామయ్యగారిచే నెలకొల్పబడిన ఆంధ్రనాటక ప్రోత్సాహక సంఘపు పోటీపరీక్షలు జరిగినవి. ఆ వెనుక నీ సంఘమునకు నేను కార్యదర్శినై రెండుసంవత్సరములు దీనివ్యవహారములు నాటకపరిషత్తను పేరుతో జరుపుచుంటిని. గుంటూరు, నెల్లూరు, విశాఖపట్టణము మొదలైన తావు లనేకములందు నాటకపరీక్షల గురించియు నాటకసంస్కరణమును గూర్చియు నుపన్యాసముల నిచ్చుచుంటిని. నాటకాభిలాషు లనేకులచే

నాటకాభినయములగూర్చి విమర్శనలు చెప్పించి కృష్ణాపత్రికలో ప్రచురింపజేసితిమి. మరియు నాటకసాహిత్యవిషయముల జర్పించు నుపన్యాసములన్ను, సభలను, బందరులోను, యితర తావులను జరిపించి వీనిలో ప్రముఖులగువారల కొందర గౌరవించుచుంటిమి. నాయాజమాన్యమున బందరులోను, నెల్లూరులో పోటీపరీక్షలు రెండు మూడు జరిగినవి. కాని పోటీపరీక్షలవలన మాత్సర్యమునకవకాశము లేకపోలేదు. నాటకసమాజముల పెద్దలెంతి వివేకౌన్నత్యములుగలవారయ్యును, సామాజికులలో పెక్కురు సామాన్య సంస్కారులగుటచేతను, పరీక్షాసమయమున కొందరు నటులు అదివరకెవ్వరు జూచి తలచియుండని ప్రతిభావిర్భావమున విస్తరించుటచేతను, పరీక్షాధికారులు వేషభాషాభినయసంగీతముల కేర్పరచిన గణనపద్ధతులలో నన్నిటియందు సమానసౌకర్యముగల సామాన్యనటునకు మొత్తముమీద నేదో ఒకదానియందు విశేషలక్షణముండి మిగిలినవానిలో జాలకుండిన నటనాయకులకన్న యెక్కువ ఫలితము వచ్చుటచేతను, పర్యవసానము అపజితుల కాశాభంగముగనుండుటచేతను పోటీపరీక్షలు విరోధముల కాకరమై పరిణమించెను. చిరకాలము నాయనుంగుమిత్రులగు కొందరతో నీకారణమున నౌదాసీన్యమేర్పడెను. ఈపని బాగుండలేదని నాసంబంధము 1918 లో వదలుకొంటిని. నాటకపరిషత్తుకార్యదర్శినై యున్నకాలములో "ఆంధ్రనాటకనామావళి" అను చిన్నిపొత్తమున నప్పటికచ్చులోనున్న నాటకాములను విభజించి ప్రాంత

రసోత్పత్తుల భేదమును సహేతుకముగ నేర్పరచియుంటిని. మరియు ననేక పెద్దల రావించి యుపన్యాస పరంపరలతో నాంధ్రనాటక సాహిత్యసంధర్భముల బందరుపౌరుల కందించుచుంటిని.

నేను సభ్యుడనైయుండిన "చిత్రకళాభివర్ధనీ" సంఘము సామాన్యనాటకసమాజములకన్న కొత్తదారులు త్రొక్కనేరక కాలధర్మ మొందినది. దివవహి కృష్ణమూర్తి వచ్చిన కాలములో నయ్యంకి శ్రీరాము లను యువకునితో కొండ నాటకములందు అభినయింప నిచ్చగించితిని. కాని సంగీతములేమిచే నాటకాభినయమున కుపయోగింపక చదువులలో బాగుపడ గలిగితిని. 1901 లో నేను, న్యాపతి మాధవరావుగారు, వేమూరి చిన్నయారావుగారు మొదలగు బాలుర మొక ఆంగ్లనాటకాభినయ సమాజ మేర్పరచితిమి. ఇందులో గొడుగుపేటలో నిమిత్తులనేకులుచేరి చంద్రహాస, మృచ్ఛకటిక మొదలైన నాటకము లభినయించుచు వచ్చిరి. ఈసమాజమే క్రమముగా చిత్రకళాభివర్ధని యైనది. ఇది కార్యజటిత్వమును పొంది యావల ముత్తరాజు సుబ్బరాయుని పేర మొలకెత్తి ముద్రారాక్షసాది నాటకముల ప్రదర్శించినది.

కూచిపూడి భాగవతములు 1900–1915 లో అనగంతి జనాదరణలేక కృంగుచుండెను. ఈవెనుక విద్యాధికుల కభినయసాంప్రదాయములందు అభిమాన మెక్కువ వికసించినది. స్టేజినాటకములు కొంతకాలము పద్యములతోను, మట్లతోను, హోరున హార్మనీమోతలిడ, తపలాప్రబోధమున వీనుల

తల్లడిల్లు తమకాల మనుభవించినవి. 1900-1908 లో కృష్ణ
మాచార్యులగారి నాటకములు అఘులులో నుండెను. 1909-
1916 వరకు భారతనాటకములు, రసపుత్రగాథలు వాడుకలో
ప్రబలియుండెను. ఇంతవరకు తెలుగుజిల్లాలలోని నాటకసమా
జములు ఆయాగ్రామములందలి యువకుల యుత్సాహ
సహాయములచే చిన్నవిగ బయలుదేరి క్రమముగ కొంచెము
ధనార్జనము సేయుచు శాశ్వతభవనములను రంగపరికరములను
సంపాదించుకొనుచుండెను. కొన్నితావుల నాటకములతో సం
బంధములేని ధనికులు నాటకశాలలను వేయించి యద్దెల కిచ్చు
చుండిరి. స్వకీయభవనములుగల సమాజముల శాలలను ఊరి
లోని తక్కుడుకంపెని లద్దెకుతీసుకొని ఆడుచుండిరి. నాటక
సమాజములో తొలుదొల్త సభ్యు లర్థప్రతిఫల మపేక్షింపక
తమసొత్తునే వ్యయపరచి నడిపించుచుండిరి. బళ్లారి కంపెనీలు
ప్రప్రథమమున జీతగాండ్రగు వేషధారుల నుపయోగించు
పద్ధతి యేర్పరచినవి. 1912 ప్రాంతముల రాజమహేంద్ర
వరములో గున్నేశ్వరరావు, నాగేశ్వరరావు గార్ల నాటక
సమాజము వర్తకవ్యవహారలక్షణములతో నారంభించినది.
విశాలమైన నాటకభవనము, ప్రకృతి నతిశయించు రంగస్థ
లము, దివ్యమైన దుస్తులు, నానాప్రాంతములనుండి మంచి
వేతనములిచ్చి తెప్పించిన నటవర్గము, పార్శీపద్ధతులలో బొం
బాయి, కలకత్తా పురములందలి యార్థికనాట్యశాలల ననుస
రించు శిక్షాపద్ధతులు గున్నేశ్వరరావుగారిచే నాంధ్రదేశ
మున ప్రవేశపెట్టబడినవి. వీరిమార్గ మవలంబించి మైలవరం

పాశ్చాత్యకంపెనీలు బెజవాడలోను, దుగ్గిరాల, తెనాలి, ఏలూరు మొదలగు తావులందును పెద్దనాటకవ్యాపారములు వెలసినవి. ఈసంస్థలు ఉత్తరసర్కారులలోని మంచినటుల నందర నాకర్షించుచు, స్వతంత్రనాటకసమాజములకు, పాత్ర దారిద్ర్య మేర్పరచినవి. కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాలు జలవాహినీసౌకర్యమున పంటకుదురులై, సుభిక్షముగనుంటచే నిచ్చటి జను లన్నసమృద్ధిగలిగి బాలురకు విద్యాసంస్కారమీయ గలిగి యున్నారు. అందుచేత బళ్లారి, ఉడిపిసీమలలోవలె నాటక కంపెనీలకు బాలస్త్రీవేషగాండ్రు దొరుకుట దుర్లభమగుచున్నది. దొరకిన కొద్దిమందిని నాటకవ్యాపారసంస్థ లీడ్చుకొనిపోవుచున్నవి. ఇట్టి పెద్దకంపెనీల శిక్షవలనగాని యాంధ్రనాటక పద్ధతులు కళాపరిణామ మొందనేరవని యెడపల్లి సూర్యనారాయణ మొదలగు ప్రసిద్ధనటులు చెప్పుచున్నారు. నిజమే! ఏదో యితరవ్యాపారములందు దినమంతయు పొట్టకూటికై పాటు పడుచు కళాభిలాషచే నొకింతకాలము అభినయాభ్యాసమునకు వినియోగించెడి నాటకాభిమానులచేతిలో తెలుగునాటకములు పదును దేరజాలవు. వ్యాపారనాటకము లొసంగు నిరంతరశిక్షావిధానమునగాని నటు లారితేరరు. కాని ఈ వ్యాపారనాటకసంస్థలందు వేలకొలది మూలధనము వెచ్చింపబడి సమాజపోషణమునకు విశేషద్రవ్య మవసరమగుటచే ప్రజారంజకమగురీతి నాటకములనాడి జనసామాన్యమును మెప్పించి ద్రవ్య మార్జించవలసిన యగత్య మేర్పడినది. ఈనాటకసంస్థాపకులు వ్యాపారధీరత నొప్పియు, నాటకాభినయకళాకోవి

దులు గాంవారగుటచే, వీరి నాటకాదర్శములు బొంబాయి, కలకత్తా పురముల నాటకవ్యాపారరీతుల ననుసరించి జనించుటచే రంగుటింగుల జనసమ్మోహమును మెప్పింపవలయుటచే, నీపెద్దకంపెనీలు నటులకు నిత్యప్రత్యేకశిక్ష నొసంగుచున్నను, మంచి నటుల నొకవో గూర్చినను, విజాతీయ సంగీతపద్ధతుల కాంధ్రభాషను లోబరచి నాటకసాహితీ వినాశన మొనర్చి యున్నారు. తెలుగుపలుకుల తేటపదనులు సైజసంగీతలావణ్య మొప్పుచు భక్తిశృంగారకరుణారసవాహక సామర్థ్యమున ప్రపంచములోని బాసలన్నింటి మించి యున్నవి. ఇట్టి సుకుమారాంధ్రపదసౌష్ఠవము, వ్యాపార నాటక సమాజముల తపలాదరువులకు, బెదరి బొప్పికట్టి యున్నది. తెలుగుబాస బాపట్ల కాంతయ్యగారి లయప్రస్తరణోత్సాహదంభత్వమున సొంపుపెంపుల వదలి చిక్కియున్నది. సీనరీసొగసు, నటులసామర్థ్యము, రంగరచనాకౌశల్యము, హంగుబలము, మొదలగు నంగసమృద్ధిచే తళుకులాడెడి వ్యాపారనాటకము లీప్రాంతముల ప్రేక్షకుల మానస మాకర్షించి జనసామాన్యమునకు వ్యాపారనాటకరీతులే యభినయాదర్శము లను భ్రాంతి కలిగించినవి. 1914-1922లో మనప్రాంతముల నాటకము లన్నియు, పైవానిపద్ధతుల నవలంబించుకొనుచుండెను. పోటీపరీక్ష లెల్లెడల వ్యాపించి, నాటక విమర్శనము పరిఢవిల్లిన, 1915-18 లో నాటకాభినయలక్షణములు కొంతవర కూహింపబడినవి. సంగీత మభినయమున శవకాశ మొసంగదనియు, నాటకములలో సంగీతమును, హార్మనీ

మున్నగు దుష్కరోపవాద్యములను తగ్గించి పార్శ్వపట్ల యొత్తిడిచే తెలుగుభాష నలుగకుండ కాపాడవలెననియు, పండిత జనాభిప్రాయము ప్రబలుచుండెను. కాని నాటకముల ఆదరణ రసజ్ఞులను, కళాకౌశల విజ్ఞాతలను అగు విద్యార్థులవలన గలుగక, టింగురంగుల నాలకించెడి యాంసస్కారుల ప్రోత్సాహమున జరుగుచున్నది. నాటక మనగానే ఒబ్బుతోపని; ద్రవ్యసంపాదన ముండినగాని, నాటకసమాజములు నిలువనేరవు. విద్యార్థికులు, ఉద్యోగిజనములు నాటకకళను పోషింపని వ్యవస్థలో, నాటక సమాజములు జీవనాధారమునకు పామర జనానందకరముగ వర్తించుటొకటేతప్ప కానేరదు.

గుంటూరు, బందరు మొదలగు పురములలో సంగీత సాహిత్యములందు శిక్షవడసిన స్వాతంత్ర్యజీవనోపాధుల నొప్పు పెద్దమనుష్యు లనేకు లభినయకుతూహలులమేర్పడ నాదర్శ పరిణామమున నభినయింప నుద్దేశించి నాటకసమాజముల నెలకొల్పిరి. కాని వీనిలో బాల స్త్రీ వేషధారులు లభించకుండుట చేతను, ఈ పాత్రములు లేనిది నాటకములు జనరంజకములు గాకపోవుటచేతను, సామాజికులు స్వకీయావృత్తులందు నిరతులై తమనాట్యవిధుల సక్రమముగా నెరవేర్పనందునను, యుద్యోగిభరితమైన నాటకప్రయత్నములు క్రమముగా జచ్చుచున్నవి. బళ్లారికంపెనీలు, చెన్నపురి సుగుణవిలాససభ, తెనాలి కంపెనీలు, కొంతవరకు వ్యవహారిక పద్ధతులమీద నడుపబడి, ప్రధానపాత్రములు రసజ్ఞులగు స్వతంత్ర విద్యార్థికులచే నడుపబడుచున్నవి. ఎట్లయినను, మొదటినుండియు,

పెద్దవర్తకశాఖా నిర్మాణమందుగాని, రాజ్యధూర్వహణమునుగాని, చిరకాలమునుండి తెరిపిద్దు లేకుండిన, ఆంధ్రులు పారశీక మహారాష్ట్రులవలె విపుల సంస్థాపనల నిర్వహింపజాలకున్నారు. ఆంధ్రదేశమంతటను ఆదర్శప్రాయమైన విద్యాసంస్థాపనముగాని, గ్రంథభాండారముగాని, నాటకశాలగాని నిర్మింప నవకాశములు గన్పట్టవు. స్వకీయసామర్థ్యముచే నేర్పడు నల్పసంస్థల సమాదర్శప్రవర్తనముచే, నాంధ్రులు తమ సంకల్పముల నీడేర్చుకొనవచ్చును. సమస్త విషయములలో నిట్టి స్థితియే గోచరించుచున్నది. పై వ్యాసములలో స్వానుభవమున దెలిపెడి నానారాష్ట్రనాటకలక్షణములవలన నాంధ్రులే నాటకకళయందు ఆదర్శనామాహ్వయమును జేరియున్నారని విశదమగును. ఆంధ్రనాటకరంగమున వలయు మార్పులను ముందు సూచించెదము.

---

## రెండవ దళము

# ఆంధ్ర నాటకములు

(గ్రంథాలయ సర్వస్వము 1916)

మనుష్యునకు స్మృతియును జ్ఞాపకశక్తి యేనాడు కలిగెనో, ఆనాడే నాటకము లారంభమైనవి అని చెప్పవచ్చును. స్మృతివలన వెనుక జరిగిన సంగతులు మనోగతములై వలయు నప్పుడెల్ల గోచరించును. దీనివలననే మనుష్యుడు తన పరిస్థితుల వలనచే కలుగనోపని రాగద్వేషములను బుద్ధిపూర్వకముగ దెచ్చిపెట్టుకొని, వాని నిత మనుభవింపకయే అనుభవించెడి వానివలెనే కనుపడుచుండును. కోపము లేకయే కోపముండిన వానివలె నగుపడుట, భయము, శోకము, హాస్యము, తృప్తి, మొదలగు మనోచేష్టలను ఆవేశించి యభినయించుటయే నాట్యము. "అవస్థానుకృతిః నాట్యం." తాను పుట్టినప్పు డేడ్చుట నాట్యముకాదు. పుట్టనప్పుడు పుట్టినవానివలె నాచరించుటయే నాటకారంభము. మనుష్యుని యవస్థల ననుకరించుటయే గాక జంతుచేష్టల నభినయించుటయు వానికూతల ననుకరించుటకూడ నాట్యమనబడుచున్నది.

ఇట్టి యుత్పత్తిగల నాట్యము మనుష్యుని మనోవికాసము ననుసరించి యనేకరూపముల దాల్చినది. మన

ఆంధ్రదేశములో గొల్లగంతులు, చెంచుఆటలు, జంగము కథలు, పంబలసుద్దులు, తోలుబొమ్మలు. పగటిభాగవతములు, జాతీయములు, నృత్యనృత్తమయములగు భాగవత కలాపములు, సురుచిర భావపూరితములయి మానవనృత్తుల దలుకుటద్దములవలె ప్రతిఫలింపజేయు నాటకములు మున్నగు పరిణామముల జెందియున్నది. ఇందులో ఏది ముందు? ఏది వెనుక? నవరసములతోగూడి మనుష్యుని మనోవ్యాపారములను, గాఢాలోచనలను, సుఖదుఃఖములను, ప్రజ్ఞావిజయములను, విధిబలిమియు ననేకకథాసందర్భములలో నతి చమత్కారముగను, సంతోషదాయకముగను జూపట్టు నాటకరాజము నేతెరవున తొల్లిటి కోతిగంతులనుండి పరిణమించినవి! ఈపరిణామము, ఈనాటకవిన్యాసము మనయాంధ్రమున నాత్మప్రేరణచే కలిగినదా? లేక సంస్కృతాంగ్లేయపారసికాది వాఙ్మయముల సంపర్కమున నుదయించినదా?

హిందూదేశమునకు ఇతరదేశములకు నొక గొప్ప భేదమగుపడుచున్నది. ఇతరదేశములలో నొక్కొక్కకాలమున నొక్కొక్కరీతి రుచులు భావములు నడచుచుండి వాని కనుగుణమగు శిల్పము, చిత్రములు, ప్రబంధములు, నాటకములు వెలసి యావల నశి నశించి వాకుకలో దప్పపోవును. వాని తావున నభినవభావగర్భితములై విలసద్రసపూరితములైన నూతనకల్పనము లేర్పడియుండును. పాతవి చచ్చి క్రొత్తవి యుండును. కాని క్రొత్తవానియందు పాతకల్పనల పరిణామస్థితియు ఇంకను ముందు రానున్నవాని బీజములును

గోచరించును. అందుచే ఒక కల్పనచూచినంతనె దానికాల నిర్ణయము చేయవచ్చును. హిందూదేశమున నిట్టి యాధారములేదు. కాలావస్థలచే నూతనకల్పనలు యేర్పడుచు వచ్చినవి. సంపర్కముచే క్రొత్తపోకడలు జరిగినవి. కాని ప్రాతవి నశించలేదు. వేదయుగమందే యాచారములు ఏకల్పనాకృతులు ఎట్టిమనస్తులు ఏట్టినిబంధనలు హిందూదేశము నావరించియుండెనో, రామాయణకాలమున నెవ్వి వర్తించెనో, ద్వాపరమున నేవి ప్రబలుచుండెనో, కలియుగమున నానాశకములలో యవన మ్లేచ్ఛ ఆంగ్లేయాదిజాతుల సంపర్కమున నేమనోవికారములేర్పడియెనో, అవియన్నియు నింకనుయావనముతో, నిండారు చెలివితో నేనాడు వెలుగుచున్నవి, వాడుకలోనున్నవి. అభిజ్ఞానశాకుంతల మెట్టిరుచితో నాదరింపబడుచున్నదో సంబల సూక్తులుకూడ నట్టి జనసమ్మతమునే బొందుచున్నవి.

ఇట్టి కలగోలుగంపదశలో, ఇట్టి బీకరివకిరియావస్థలో నాటకక్రమమును నిరూపించుటకు "వటవృక్షన్యాయము" అనుతాత్కాలికమార్గ మేర్పడియున్నది. దీనియాధారముననే సర్ విలియం హెర్‌షెల్ అనునాతడు విశ్వవిన్యాసచరిత్రమును వెలిబుచ్చగలిగెను. దీనిప్రభావముననే సర్ హెన్రీమెయిను అనువారు సాంఘికధర్మవిన్యాసమును చిత్రింపగలిగెను. ఈ న్యాయమును ఆంధ్రసంస్కృతనాటకముల విమర్శన కుపయోగించినచో వాని తుదిమొదలులు, విన్యాసక్రమము కొంతవరకు తెలియగలదు. సంస్కృతనాటకాలంకారికు లంగీకరించు దశవిధరూపకములు వాస్తవమున నాటకవిన్యాసములోని వివిధ

సోపానములనియు, ఆంధ్రరూపకములగు జంగమకథలు మున్నగునవి యభినవనాటకముల పూర్వరూపములే యనియు, నివియన్నియు కలిసియుండుటచే "ఇది బీజము, ఇది పరిణామము" అని చెప్పజాలకున్నానేగాని వాస్తవముగ హిందూదేశవాఙ్మయమందు ఇతరదేశముల సాహిత్యమందువలెనే పరిణామసిద్ధాంతము వర్తించుననియు నొక్కి వక్కాణింపగలను.

పటవృత్తన్యాయమును, పరిణామసిద్ధాంతమును ఆంధ్రరూపకములపై బ్రయోగించి, భావవిమర్శనజేసి లోతుకు దిగినచో నేను మూడవపేరాలో ఇచ్చిన విన్యాసము ననుసరించియే ఆంధ్రనాటకములు పరిణమించినవని స్పష్టమగును. ఇందు క్రమముగ నెవరో చేసినారని, అననాగని చెప్పునది తానే చేయుట కలుగుచున్నది. కోతులలో, జంతులలో, దయ్యములలో చేయుచేష్టలు క్రమముగ జరిగి మానవవ్యక్తులకును వ్యాపారములకును నిలువ తావిచ్చినవి. ఏకవ్యక్తి భావముదయించి యొక్కొక్క రసము వన్నెకెక్కినపుడు "రసముల ననుసరించెడి యంగవిక్షేపణము" వదలి "అర్థము" నాశ్రయించినది. ఇదియు వదలి ఆయావస్థలలో నరుడేరీతి నడుచునో దానినే యభినయింపు వాడుక లేర్పడినవి. ఇతివృత్తములలో గూడ నమ్మజాలని పురాణగాథలు కాలక్రమమున వదలి యంతకన్న విశ్వసనీయమైన చరిత్రాంశములును, వీనికన్నను ప్రత్యక్షమైన సాంఘిక విషయములును నాటకములలో జేరుచున్నవి. ఆంధ్రనాటకము రాను రాను సాంఘిక వ్యావహారికగాథల నంగీకరించి నాటకపరిణామమును సమీపించుచున్నదని చెప్పవచ్చును

ఆంధ్రదేశమునకు గంజాముజిల్లాలోని శ్రీకాకుళము వద్దనున్న నాగావళినదిని యుత్తరసరిహద్దుగ నంగీకరింప వచ్చును. దక్షిణమున నాంధ్రము కాంచీపురము పాలారు నదులవరకు ఆక్రమించియున్నది. చెన్నపురినుండి బళ్లారివరకునుబోవు సరళరేఖయు నాయెడనుండి హైదరాబాదుమీదుగా జయపురమువరకు జనునదియు పశ్చిమసరిహద్దులు. ఇట్టి యాంధ్రదేశములో తెలుగునాటకముల పూర్వరూపము ప్రమాణముగ స్థాపించి యుంటిమి. కృష్ణా గోదావరి తుంగభద్ర పెన్నానదుల పల్లపుభూములు తొల్లిటినుండియు ఫలవంతములై విద్వాంసుల కునికిపట్టులై యుండెను. ఈప్రాంతములయందు భరతశాస్త్రాలంకృతములయిన రూపకములు ఆడబడుచుండెను. ఇప్పటివారలే బొబ్బిలి మొదలు కాళహస్తి పర్యంతము వ్యాపించు ఆంధ్రరాజ్యస్థానములకరిగి భరతశాస్త్రవిలాసముల జూపుచుండిరి.

తురకలు, ఆంగ్లేయులును మునుముందు సముద్రతీరములగల ముఖ్యపట్టణములనే న్యాసపరచికొని యాయాతావుల తమ రాజ్యముల స్థాపించుచు వచ్చిరి. అందుచే బందరు, రాజమండ్రి, బళ్లారి, నెల్లూరులోని ప్రజలును ఆయూరుల సమీపదేశమందలివారును ఎక్కువ నాగరికులై నూతనమార్గముల నవలంబించగల చలాకితో కూడియున్నారని శంకరనాయుడుగా రొకతావున చెప్పిరి.

1870 లో మొదలిడి, 1890 నుండి నడచిన యిరువది యైదుసంవత్సరములలో మిక్కుటముగ వ్యాపించి ఆంధ్రదేశమును నాగరికపరచిన విద్యావ్యాప్తియు, దేశాభివృద్ధియు

పూర్వవిద్వత్ స్థానములను రాజ్యసీమలను నవి మిక్కిలిగ బాగుచేసినవి. రోడ్లు, కాలువలు, రైళ్ళు, పోష్టు తెలుగు సీమల జట్టించి రాకపోకల కెంతయు వీలుకలిగించినను— విద్యాభివృద్ధియు విద్యాలయప్రతిష్ఠాపనమును నదీతీరములను పూర్వవిద్వత్ స్థానములందును ఎక్కువగ జరుగుచున్నవి. విద్యావ్యాప్తి ననుసరించియే ముద్రణాయంత్రములు వెలయు చున్నవి. ముద్రణాయంత్రవిస్తరణము ననుసరించియే గ్రంథప్రచురము జరుగుచున్నది. అభివృద్ధి యాంధ్రదేశమంతట నున్నది. కాని కొన్ని తావులయందు మిక్కుటముగను మరి కొన్నిట నల్పముగను జరుగుచున్నది. పోష్టాఫీసు పనిచేయు చున్నదే కాని యొకతావున ప్రచురించు పుస్తకములు మరి యొకతావున రుచించుచున్నట్లు గోచరించదు. విద్యావ్యాప్తి యచ్చటచ్చటి ప్రచురములవలననే జరుగును గాని యన్యమైన వానిచే జరుగదు.

గడచిన 25 సంవత్సరములలో నాంధ్రదేశమునకు గలిగిన విద్యాసంస్కారమును, అందుచే న్నాటకరంగమునకు గలిగిన మార్పులను భావభేదములను విమర్శించినచో నీపాతిక సంవత్సరములను మూడుకాలములుగ విభజింపవచ్చును.

మొదటి 10 సంవత్సరముల ప్రథమ కాలమునందు (అనగా 1891 - 1901) ఆంగ్లులకు ఆంధ్రమునం దభిమానము లేక యుండెను. మన ప్రబంధములు బూతులనియు, మన శాస్త్రములు కల్లలనియు, మన యాచారము లమానుషేయములనియు నేర్చుకొనవలసినది, ప్రేమింపవలసిన దెల్ల యాంగ్లేయమే యను

నభిప్రాయము జనసామాన్యమున వ్యాపించియుండెను. ఈ కాలములో వ్రాయబడిన నాటకములు చాలభాగము దేశవాళిక్కి ననుసరించి పూర్వరూపకములుగ నుండెను. నూతన పద్ధతుల ననుసరించినవి సంస్కృతనాటకముల భాషాంతరీకరణములుగ నుండెను. సంఘములోని యాచారములను నిరాఘాటముగ నిర్దయతో వెగడు ఫార్సులు వెలువడుచుండెను. ఆంగ్లేయనాటకముల ననుసరించి కొందరు వ్రాయుచుండిరి. నిజముగ నాంధ్రమైనది ఎక్కడను గానరాకుండెను.

విక్టోరియారాజ్ఞి మృతినొందె. ఆమెతో నాంగ్లేయ ప్రభుత్వప్రశాంతరుచులు అస్తమించెను. 1901 మొదలు 1906 వరకు జరిగిన 5 సం॥ముల ద్వితీయకాలములో హిందూదేశమం దనేకవిధమైన శంక సమస్తవిషయములందు కలిగెను. మన కేవిధమైన నాగరికత, శాస్త్రములు, మర్యాదలు, శిల్పాది కళలు ఉన్నవి? మనము మనుష్యులమేనా? పశుప్రాయులమా! మన ప్రభువులు మనకన్న ఎక్కువకాదా? మన ఐశ్వర్యమే వారి సొంతమను మాట నిజమా? మన అభివృద్ధి మన స్వాధీనముననే యున్నదా? అను శంకలు కలుగసాగెను. ఈకాలములో వంగా మహారాష్ట్రభాషలను కొందరు ఆంధ్రు లభ్యసించిరి. అచ్చటి విద్వాంసులు హిందూవిద్యలను గురించి యందలి భావగాంభీర్యమును రసపుష్టిని వెల్లడింపసాగిరి. ఈకాలములో కొన్ని చరిత్రనాటకములును కొన్ని ప్రబంధాత్మకములయిన గాథలు నాటకములుగను ప్రచురింపబడుచుండెను.

1906 తో మూడవకాలము ప్రారంభ మగుచున్నది. మన మంచిచెడ్డలు మనచేతిలోనె యున్నవనియు మన సంఘ మభివృద్ధిలోనికి రాదలంచినయెడల సంఘసంస్కరణముకన్న సంఘములో. పూర్వచరిత్రలను విద్యలను ఆచారములను మరల బ్రతికించి వాని వెలుగున నూతనమార్గముల నరయ వలయుననియు ప్రజలకు దోచినది. చక్కని ప్రబంధము లన్నియు నాటకములుగ మార్చబడినవి. వీరరసమును బుట్టించు భారతకథలు మిక్కుటముగ నాటకములలో జేరినవి. దేశచరిత్రల ననుసరించియు బంగాలీ మరాటీ హిందీ భాషల లోని నవలల ననుసరించియు చరిత్రాత్మకములయిన నాటకము లనేకములు బయలువెడలినవి. దేశములో జరుగువృత్తాంతములు నాటకములుగ వ్రాయబడుచున్నవి. ఈపదిసంవత్సరములలో నూతనపద్ధతులు వచ్చినవిగదా యని పూర్వగాథలు పూర్వపు వీధిభాగవతపు ఫణితిలో నాటకములు మానలేదు. ఈదిగువ పట్టీవలన నేజాతినాటకము లెన్ని బయలువెడలినది తెలియగలదు.

(1906—1915.)

| ఇతివృత్తము. | క్రొత్తరకపుస్టేజి నాటకములు. | ప్రాతరకపు వీధిభాగవతములు. | మొత్తము. |
|---|---|---|---|
| పురాణగాథలు | 48 | 3 | 51 |
| భారత కథలు | 38 | 2 | 40 |
| రామాయణకథలు | 32 | 5 | 37 |

| | | | |
|---|---|---|---|
| కృష్ణకథలు | 20 | 3 | 23 |
| హరిశ్చంద్రలు | 15 | 5 | 20 |
| శాకుంతలలు | 8 | 5 | 13 |
| భోజప్రబంధములు | 5 | 0 | 5 |
| తెలుగుప్రబంధముల ననుసరించినవి | 14 | 1 | 15 |
| సంస్కృతములోనివి | 20 | 0 | 20 |
| ఇంగ్లీషులోనివి | 14 | 0 | 14 |
| పార్సీలోనివి | 8 | 0 | 8 |
| ప్రజారంజకములు | 53 | 13 | 66 |
| ప్రహసనములు | 16 | 0 | 16 |
| చరిత్రలు | 38 | 0 | 38 |
| సాంఘిక విషయములు | 54 | 0 | 54 |
| ఎందులోను చేరనివి | 5 | 5 | 10 |
| మొత్తము | 388 | 42 | 430 |

ప్రాతనాటకము లనునవి చాలభాగము మదరాసులో ప్రచురింపబడి చాకలపేట తిరువట్టూరు మొదలగు తావుల నివసించుచు పంగనామాలుపెట్టి రేఖలాబండ్లపై పరుగిడు "వీటుకారు"లచే నుపయోగింపబడుచున్నవి. ఇందులో కొన్ని చిత్తూరు, కార్వేటినగరం, కాళహస్తి, అమ్మనబ్రోలు మొదలయిన తావులగూడ వాడబడుచున్నవి. ఈ ప్రాతనాటకము లన్నియు పురాణగాథలు, ప్రజారంజకములగు కథలు కల్గియున్నవి. నాటకవిషయములలో చెన్నపురిది మిక్కిలి యనాథస్థితి.

నూతననాటకములలో కర్నూలు, అనంతపురము నుంచి 3 నాటకములు ప్రచురింపబడినవి. కడపజిల్లాలో ఏమీ కనుపించవు. కృష్ణా గోదావరి విశాఖపట్నం జిల్లాలతో పాటు బళ్లారికూడ సర్వవిషయములందు నాటకాభివృద్ధిని చేసియున్నది. ఫార్సులు చాలభాగము పల్లెటూళ్ళలో పోరాడి కాని, రాగద్వేషములు ప్రబలినమీద కాని వ్రాయునట్టి యున్నవి. సాంఘికవిషయమైన నాటకములు చాలభాగము మన సంఘములోని దురాచారముల గూర్చియు సంఘసంస్కరణప్రయత్నములను గూర్చియు వ్రాయబడినవి. పురాణగాథలలో ప్రహ్లాద వామనచరిత్రలు, పౌరాణిక వివాహములు, అవతారకథలు చేరియున్నవి. రామాయణకథలలో తరుచుగ సీతాకళ్యాణము, పాదుకాపట్టాభిషేకము వచ్చును. వీనివెనుక ఉత్తరరామాయణకథలు, అరుదుగ రామప్రస్థానము, యుద్ధము, సంపూర్ణరామాయణము. భారతనాటకములలో విరాటపర్వము, సుభద్రావిజయము, శశిరేఖాపరిణయము ఎక్కువ వాడుకలోనున్నవి. కృష్ణగాథలలో రుక్మిణీకళ్యాణము సర్వసాధారణము. దీనివెనుక శ్యమంతకమణికథ, పారిజాతాపహరణము, కుచేలోపాఖ్యానము యథాక్రమముగ ప్రజారంజకములని తోచుచున్నవి. ప్రజారంజకములగు నాటకములు సామాన్యముగ శృంగారరసముతో గూడి యేకారణముచేతనో విషాదభావమును కలిగింపునవిగ నున్నవి. ఇందు సారంగధర, తారాశశాంకవిజయము, బిల్హణీయము, ఉషాపరిణయము, సావిత్రికథలు, చంద్రమతీ కథలు,

దమయంతి, చంద్రకాంత, చంద్రహాస, స్త్రీసాహసము మున్నగునవి యథాక్రమముగా గౌరవింపబడుచున్నవి. తెలుగు ప్రబంధములలో నాటకముగ రచియింపబడి పేరొందినది మనుచరిత్ర. దీనివెనుక హరిశ్చంద్ర, శాకుంతల, వైజయంతీవిలాసము, పారిజాతాపహరణము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నములు వచ్చుచున్నవి. ప్రజారంజకములగు గాథలలో చాలభాగము ప్రబంధముల ననుసరించినవేగాని, వానిజనరంజకము మనుచరిత్రవలె కవియందలి గౌరవమువలన నేర్పడినదికాదు. ఆకథలు దేశములో ప్రాకి ప్రబంధకర్తలచే గైకొనబడినట్లె నాటకకవులచేగూడ స్వీకరింపబడినవి.

1905 వ సంవత్సరములో మొత్తముమీద 10 నాటకములు ప్రచురించబడెను. 1891-1905 లోపల నూఱునాటకములకన్న నెక్కువ వెలువడలేదు. ఇందులో 70 నాటకములకు పైగా ప్రాతఫణితిచే. దీనిచే గడచిన 10 సంవత్సరములలో వెనుకటి 15 సంవత్సరములలోకన్న నాల్గురెట్లు గ్రంథములు వెలువడినవనియు, ప్రాతనాటకములసంఖ్య 11 వీసములనుండి $1\frac{1}{3}$ వీసమునకు పడిపోయినదనియు తేలుచున్నది. ఇట్లు పడిపోవుటచే అభినవనాటకములు మదరాసు, దక్షిణనెల్లూరు, పల్నాడు, పాకనాడు, తిరుపతిసీమల వొచ్చినవని యెంతమాత్రము తలపకూడదు.

హైదరాబాదులోను మరికొన్ని తావులను కులవృద్ధలకథలను డ్రామాగా వ్రాయువాడుక కలదు. చిక్కయ్య, లక్ష్మీనరసింహస్వామియాజులు, శివరామబ్రహ్మం, రామమోహనరాయి

మొదలగువారి జీవితములు రూపకములుగ జేయబడినవి. వాని రుచి నేనెఱుగను.

కడచిన పది సంవత్సరములలో

| | |
|---|---|
| 1906లో-20 | 1911—59 |
| 1907—20 | 1912—49 |
| 1908—29 | 1913—60 |
| 1909—44 | 1914—56 |
| 1910—42 | 1915—49 |

నాటకములు ప్రచురింపబడినవి. నాటకప్రచురములకును సంవత్సరసంఖ్యకును సంబంధములేదు. కాని ఆంధ్రదేశములోని ముద్రాయంత్రముల సంఖ్యగాని నాటకసమాజముల సంఖ్యగాని దొరకినయెడల ఆ సంఖ్యలకును నాటకప్రచురములకును గణితనిబద్ధమైన సంబంధము గోచరింపవచ్చును.

తెలుగుదేశమున ఎన్ని నాటకసమాజము లున్నదియు అవి యేనాటకము లాడునది తెలిసినయెడల ఆంధ్రులనాటకాభిరుచుల దెలుపు మ్యాపులనే గీయవచ్చును. ఇట్టిమ్యాపులను మాసంఘమువారు ప్రచురించు క్యాటలాగులతోబాటు వెలిబుచ్చ నుద్దేశించియున్నాము. ఇండస్ట్రియల్ మ్యాపును జూచినచో నేదేశమున కేవిధమైన వస్తువులు కావలసియుండునో తెలియును. అటులనే ఆంధ్రదేశమందలి నానాప్రాంతములలోని నాటకకంపెనీలు, ఆడే ఆటలు, వాని ప్రదర్శనాక్రమములు దెలిపెడి మ్యాపు లుండినచో మనము సులభముగ నచ్చటి ప్రజల రుచులను గుర్తెరిగి పనిచేయగలుగుదుము.

ఆంధ్రదేశములోని కృష్ణా గుంటూరు గోదావరి జిల్లాలలో అభినవ ప్రదర్శనారీతుల దెచ్చిపెట్టినది ధార్వాడకంపెనీ. ఇది షుమారు 25 సంవత్సరములక్రింద ఈదేశము వచ్చి యుప్పటివారినేత్రముల భ్రమింపజేసెను. ఇది మొదలుగనే ఊరూర కంపెనీలు వెలసెను. పెద్దమనుష్యుల పిల్లలు యిండ్లలోనుండి నగలెత్తుకుపోయి తమ విద్యాభ్యాసంగము విడి నాటకముల పాలైరి. అప్పటి నాటకములలో సినలు తక్కువ. తీగెపనులు ఎక్కువ. సూత్రధారుల సంస్కృతపు శ్లోకములు, గజానని స్తుతిస్, రాక్షసులు "పలపలపలా" అని గంతుక దినిగిపోవునట్లు కేకలువేయుట, హాస్యగాడు లోకోక్తుల గుమ్మరించుటయు అప్పటిప్రకారములు. నాటకములు సామాన్యముగ వచనములోనుండెను. ఆ వెనుక వచనము కీర్తనలు కలిసియుండెను.

ఇంతలో బళ్లారికంపెనీవారు పార్సీనాటకముల వలన ప్రదర్శనారీతుల గరచి చెన్నపురికరిగిరి. నిరర్గళముగ చేసియు తమనాటకముల విరివిగ నాడసాగిరి. వీరి నాటకములలో పద్యములు, కీర్తనలు విస్తారముగనుండి నాట్యనృత్యములతో ధగధగలాడుచుండెను. ఈస్థితి తెలుగుదేశమంతట వ్యాపింపసాగెను. ఎక్కడచూచిన నాటకములు వ్రాయువారు! పార్సీమట్లు, పద్యాలు నిండిపోయినవి. ఈవిధముగ కొంతకాలము సాగినది. నాటకములలో చేరినవారు చాలమంది యువకతులుగనుండి ఇండ్లను, ఒళ్ళును గుల్లచేసియుండుటచే నాటకపు కంపెనీల కొకవిధమగు కళంక మేర్పడినది. పూర్వము రంభా నృత్యము చేసినవారు యిప్పుడు ముసలులయినారు. ఇప్పుడు

వారితావునకు చేరువారు కానరాకున్నారు. దేశము సుభిక్షముగ నుంటచే మనజిల్లాలలో నాడువేషము ధరించువారును బాలురును దొరకకున్నారు. దొరకినవారు ఒకచో నిలువక ఇచ్ఛవచ్చినరీతి సంచరించుచున్నారు. ఇందుచే నాటకకంపెనీలు దుర్దశ చెందియున్నవి.

కొన్నితావులలో విద్యార్థులు నాటకసమాజముల నిలిపి యందు సాంప్రదాయపరులగు బాలురనే చేర్చి, వారినీతి నియమముల కాపాడుచు, నాటకప్రదర్శకుల కొకనూతన గౌరవమును దెచ్చుచున్నారు. ఇట్టి ప్రయత్నములు ప్రముఖముగా నెల్లూరు, రాజమండ్రి, బళ్లారి, బందరు పురములలో జరుగుచున్నవి.

విద్యార్థులు నాటకములందు పాత్రములు గైకొనుటచే నవి రసయుక్తముగను, అంగదోషములులేకుండను. ప్రదర్శింపబడుటయేకాక వారి ప్రదర్శనములు పాత్రౌచిత్యముల గూర్చిన యుపన్యాసములని చెప్పనోపును. వీరలు పిల్లవాండ్రు దొరకనికారణమునను, చెడుదురను భయమునను స్త్రీపాత్ర పిల్లలపాత్ర యెక్కువగ లేని నాటకము నభిలషించుచున్నారు. విద్వాంసు లేర్పఱచిన కంపెనీలలో అనేక హేతువులచే నరిత్రాత్మకమైన నాటకములు, సాంఘిక ప్రహసనములు ఆదరింపబడుచున్నవి. ఇట్టివే మిగుల దేశోపకారకములైన నాటకములు. ఆంధ్రమున నాటకవిమర్శనము లేదు. అందుకు తగిన పరిభాష యేర్పడలేదు. విమర్శములు వ్రాయువారు పాశ్చాత్య విమర్శకుల సిద్ధాంతము లవలంబించిరి. హిందూదేశపు ప్రత్యేక

భావమును మన ప్రాచీన సంస్కారములను, రుచులను గుర్తెఱుగక నాటకములను దెగడుచున్నారు. ఆంధ్రకవులకు ప్రాచ్యపాశ్చాత్య నాటకలక్షణములపరిజ్ఞానమేర్పడి జాతీయ సాంప్రదాయములను గుర్తించి ఆధునిక జీవితార్థములతో సమన్వయ పరుపగల శక్తియేర్పడినగాని మన నాటకములు బాగుపడనేరవు. విమర్శకులుకూడ నిటులనే యుభయ సాంప్రదాయాభిజ్ఞులై నాటక సంస్కరణమునకు దారి చూపుచుండవలయును.

---

# విషయసూచిక

**మూడవదళము: నాటకసమాజములు**

# మూడవ దళము

# నాటక సమాజములు

## చెన్నపురి సుగుణవిలాససభ

చెన్నపురిసాంఘికజీవనములో పెద్దపాయాల నభిల షించువారు, కాస్మొపోలిటన్‌క్లబ్బులో చేరి తమయాశల సిద్ధిజేసి కొనుచుందురు. ఆటలలో రుచిగలవారు యునైటెడ్‌క్లబ్బు, యస్. ఐ. ఎ., యం. సి. సి. మొదలైనవానిలో జేరుచుందురు. సంగీతమందు ఆసక్తిగలవారు మైలాపూరు, తిరువళిక్కేణి, ముత్యాలపేటలలో గాయకసంఘములను యేర్పరచుకొని యున్నారు. హాస్యకథలు జరిపించు సంఘములు కొన్ని కలవు. సుగుణవిలాససభలో, యిన్నిలక్షణములు చేరియున్నవి. చెన్న పురిలోని రసజ్ఞులగు విద్వాంసులు, కళాపోషకులగుధనికులు కూడి, కలసిపనిచేయునది సుగుణవిలాససభయే.

సుగుణవిలాస సభలో తెలుగు, ఇంగ్లీషు, అరవము, కొన్ని సమయములలో సంస్కృతము–ఈభాషలలోనాటకములు నడిపించు ప్రత్యేకశాఖ లున్నవి. ఈసభవారి నాటకములు,ప్రధానముగా సభాసభ్యుల వినోదము కొరకేర్పడి పైసంపాదన కంత ప్రాముఖ్యత లేదు. నాటకప్రచారము షేక్సుపియరు ఉత్సవము లవారములోను, దేవీనవరాత్రములు, శ్రీరామనవమి, కృష్ణాష్టమి, గణపతిపూజ, క్రిష్టమసు శలవులలో జరుగుచు నా యాపట్ల ఖర్చంతయు కొందరుధనికులచే భరింపబడును. అందు

చేత సుగుణవిలాస సభవారి నాటక ప్రయత్నములకు ద్రవ్యా టంకములు గలుగక, సరళముగ నడచుచుండెను. సభ్యులు వారివారి హాయా యెట్టిదైనను, సభాకార్యనిర్వహణమందు హెచ్చుతగ్గు లెంచక అందరు పూనికతో, కట్టుతో కలిసి యేపనినైనను జేయ సంసిద్ధులై యుందురు. నటులుకూడ యివ్విధమైన సమభావమునే అన్ని పాత్రముల యెడ జూపుచుందురు. నటులలో కొద్దిమంది జీతగాండ్రున్నను, చాలమంది వేతనము కన్న సభాసభ్యతవలన గలుగు సద్యోగాభివృద్ధినే, గమనించి ఊరకే పని చేయుచుందురు. సుగుణవిలాససభ స్వతంత్రజీవనముగల పెద్దమనుష్యుల నాటకసమాజమైనను, యిందలి కట్టుదిట్టములు, శిక్షాక్రమము, వ్యాపారనాటకసమాజముల పద్ధతులను మించియున్నవి.

'బళ్ళారిసీమలో గానకుతూహలమొప్ప గాలిపాటకులు సరసవినోదినీసభవారి పార్శీశిత్తు, తెలుగువట్లను పాడుకొనుచుందురు. మన జిల్లాలలో రాత్రివేళ నొంటరిగా దిరుగు తెరువరులు 'ఖలులైనాడు' 'అల్లుడారమ్మని' 'జాగయ్యనను కొట్టునోగురుండని' కొండలయుండ, చింతామణిలోని పద్యాలు, కొన్ని మైలవరం కీర్తనలు, పాడుకొనుచు నిశాసంచారభీతిని పోగొట్టుకొనచుందురు. అసగా తెలుగుజిల్లాలలోని సంగీతాభిలాషుల ప్రథమసాధనభరతలక్షణ మొప్పని నాటకసారస్వతములో దేలుచుండెను. వధుర, తంజావూరు మొదలైన అరవ జిల్లాల పిల్లవాండ్రు సంగీతవిద్యాస మెరుగుపడగమున్న ఉత్తమగీతములను, కృతులను, రాగములను, పల్లవులను పాటకచేరీలలో

తాము విన్నవాటిని అనుకరింప యత్నించుచుందురు. దక్షిణాది జనసామాన్యపు గానాదర్శములు తెలుగువారికన్న యిటీవల వరకు చాల విశుద్ధముగు నుత్తమగానలక్షణములతో నుండె ననుట సామాన్యానుభవము. దక్షిణాది దేవాలయముల నాశ్రయించి సంగీతకళాపరిశోధనమొనర్చు మహాగాయకుల ఆదర్శములే అచ్చటి జనసామాన్యము ననుసరించుచున్నవి. అందుచేత విశుద్ధమైన దక్షిణాది స్మార్తవైష్ణవకులజులతో నిండియున్న సుగుణవిలాససభవారి సంగీతాదర్శములు తెలుగునటుల గానసాంప్రదాయములకన్న యెన్నోరెట్లు సరసముగను, శ్రావ్యముగను, లక్షణసమన్వితముగను యేర్పడియున్నవి.

దక్షిణజిల్లాలలో సంచరించువారొకవిశేష మనుభవింతురు. పాఠశాలవద్ది గుంపులుగా వీటికేగు బాలురలో పెక్కుమంది లలితకోమల సుందరాకారములనొప్పుచు, బొద్దుగను, అందమగు స్త్రీరూపమునను, కనుపడుచుందురు. ఇదినేను చూచినంతలో దక్షిణాది బ్రాహ్మణబాలుర సామాన్యలక్షణమైయున్నది. అదేయీడుగల తెలుగుబాలురు సన్నగా పొడుగుగా, స్వతంత్రపురుషలక్షణములతో నగుపడుచుందురు. పెద్దయెదిగినతరువాతకూడ దాక్షిణాత్యుల శరీర మెక్కువ కోమల సౌందర్యతేజస్సులను జూపుచు, తెలుగువారిదేహములు బలవీర్యపాటవంబును పరిమాణగాంభీర్యమును కలిగియుందురు. ఇది సామాన్యలక్షణము. ఈ హేతువుచేత దక్షిణాదినాటకసమాజములకు తెలుగువారికేర్పడని స్త్రీవేషసౌకర్యము గలిగియున్నది. సుగుణవిలాససభవారి ఆంగ్లాంధ్రతమిళనాటక

ముల నాయికాస్వరూపలావణ్యముల నందికొనజాలు స్త్రీవేషధారు లాంధ్రదేశములో లేరనియే చెప్పవచ్చును.

ఈసభవారి నానాశాఖల సూత్రధారులు ధనికులై, విద్యాధికులై, చెన్నపురియు, భారతభూమియు, నొసంగగల నాటకకళాప్రసిద్ధస్వరూపములను జూచి విమర్శింపగల యవకాశము లొప్పియున్నారు. సంబంధమొదలియారు, భవానందం పిళ్లై, మొదలగువారు సామాన్యులు కారు. సంగీతపరిజ్ఞానము, నాట్యశాస్త్రలక్షణానుభవము, కావ్యాలంకారపరిచయము, విమర్శకజ్ఞానము కల వీరలు తమకు ఆజ్ఞానువర్తులగు నైచ్ఛిక నటవర్గముతో, విపులమగు ధనసహాయముతో జనసామాన్యమును రంజింపజేసి డబ్బుసంపాదించుటకుగాక కులవిద్యాధికార ధన సంస్కారము లొప్ప తమసభ్యుల వినోదముకొరకు రచించి యభ్యసించిన నాట్యవైఖరులు మనరాజధానికెల్ల నాదర్శప్రాయముగ నుండుటకు సందేహము లేదు.

సుగుణవిలాస సభవారి సీఁగీ కర్ణాటక సమాజముల సీనరీనిగాని, బొంబాయి యింపీరియల్ నాటకమండలివారి దానినిగాని, కలకత్తా ఆల్ఫ్రెడ్డు కరింతియను రంగవైభవములగాని, సిలోను కంపెనీల యంత్రసమృద్ధినిగాని యొప్పకున్నది. సుగుణవిలాససభ నాటకాభినయములం దెట్టి సాధుసంస్కార మగుపడుచుండునో, అట్టి లలితరామణీయకమే వీరిసీనరీయం దగుపడును. వెజ్జీరంగుల వింతతళుకు లీరంగమున గానరావు. దుస్తులు పాత్రోచితమగు రీతులలో సవిమర్శగ చక్కని సంస్కార మేర్పడినట్లు గూర్పబడినవి. ఈనాటకములో హార్మ

ని కేవలము శృతికొరకే సన్నని సరసనోత్రిల సామము, నటులపాటలతో ఫిడేలువినాదము మిళితమై యుండును. ఫిడేలే ప్రధానానుకరణమని చెప్పవచ్చును. కథాసందర్భములో సంగీతము అభినయమునకును రసప్రకటనమునకును ఉచితమైనంతవరకు సన్నని లేత వాణములో నుపయోగింపబడుచున్నది. మధ్యమధ్య హాస్యపు పట్లలోను, నారదుడు మొదలగు గాయకమూర్తు లేతెంచినపుడును, సుగుణవిలాససభవారి ప్రధాన గాయకులు తమ గానవిద్యానైపుణ్యమును విస్తరించి జూపుదురు. ఈవిషయములో కర్ణాటకులు కూడ నటులనే ప్రవర్తించుచున్నారు. కథా సందర్భమును బట్టి శృతి, గానవైఖరి, సీనరీ, దుస్తులు, పటప్రవర్తనము, అభినయవిశేషము గూర్పబడి అన్నియు నారంగములోని ప్రధానరసభావముల నుద్దీపించు మేళవింపులో కలిసి కరిగి యొక్కటై, మిక్కిలి ప్రశాంతముగను, రమ్యముగను, రసవాహకముగను ఉండును.

సుగుణవిలాససభవారి షేక్సుపియరునాటకము నైదారు చూచియున్నాను. లీలావతీసులోచనై, అల్లీఅర్జునా అను తమిళనాటకములను, స్వారోచిషమనుసంభవము, రామరాజ్యవినాశనము, చిత్రనళీయము తెలుగునను జూచియున్నాను. అన్నిటిలో అభినయము ప్రధానాంశమై, సరసప్రశాంతరానుభూతిక మెంచదగినవిషయమై, పాత్రౌచిత్య మెన్నదగినదై యున్నది. అందరుపాత్రధారులు, తమతమ భాగములను కూడికతో నిర్వహించినందునను, వేషభాషగీతాభినయముల కుచితమైన సరసావకాశనియమము లేర్పడుటచేతను, శాంతి

రుచులకీసరీ, యౌచిత్యమొప్ప దుస్తులు గల్పించినందునను, శీఘ్రాకర్షములలో నివి యన్నియు చక్కగ మేళవించి, యొకసుందరాకార చిత్రప్రదర్శనము, చక్కని కాంబినేషనుతో గూర్చినందునను సుగుణవిలాససభవారి నాటకము లాదర్శప్రాయములై యున్నవి. ఈసభలోగాని, మైలవరం, గున్నేశ్వరరావు. మోతే, రామవిలాస్, బళ్ళారి నాటకసమాజములలోగాని, మన చింకిరి బందరునాటకాలలో నగుపడునట్టి స్వకయాభినయప్రభావముగల నటులు, గాయకశిఖామణులు కనుపడరు. కాని వారిలోని సర్వాంగసౌష్ఠవము, మేళవింపు మనయందగుపడమిచే సీ నాటకములు వికృతముగ, భీభత్సముగ. నసహ్యముగ నున్నవి

చెన్నపురినాటకము లభివర్ణించుటలో అచ్చటి ప్రజాదర్శములు సరసమని చెప్పియుంటిని. ఇది నిజమే. జనసామాన్యుల నాట్యాదర్శము లట్టివే. సుగుణవిలాససభ చెన్నపురి ప్రజావర్గపు నాటకసమాజముకాదు. అవివేకీయున్నవి. అది చెన్నపురిలోని [illegible] విద్వాంసులమండలియై ప్రజాజీవితము నేవిధమునైనను మూర్తింపలేకున్నది.

బళ్ళారి. మైలవరం, రాజమండ్రి నాటకసమాజములు

వీరందరు తెలుగుపలుకుల నైజసత్వ మెఱుంగక పార్సీమట్లువింతవిరచనల నాంధ్రభాషకు జేర్చి, పార్సీనటుల లైముకై టుపోజుల నాశ్రయించి తెలుగుదేశములో పార్సీనాటకములకేతు తేర్చరచినవారలు. జనసామాన్యమును మెప్పించుకొరకట్టి పద్ధతుల

నవలంబించితిమని వారనుకొనవచ్చును. కాని మన మేది జనులకు నేర్పినమో అదియే వారియభిరుచుల కూర్పై యగును. జనులు విశ్రాంతికొరకు, వినోదముకొరకు నాటకములకేగుచుందురు. నటు లెట్టి తులలవరుచుదురో వానిలోనే జనులు సంతసించెదరు. పాశ్చ్యనాటక పద్ధతులు, ముచు, మొకలు బళ్లారినాటకములలో ప్రారంభించి యీవల రాజమందిరము, బెజవాడ సంస్థలలో విక్రుతవైశిత్యమును పొందినవి. కీర్తనలతో గూడిన గద్యనాటకముల స్థానమును గద్యపద్య గీతమయములగు పాత్రతరహా బళ్ళారి నాటకము లాక్రమించెను, కేవలపద్యము యమైన పట్టాకప్రు భారతనాటకము లాకప్రిక్కను ఆశ్రియించినవి. తిరువాత, వితప్పల తుంపుమట్లలో, తప్పలా మోత్రి లి ఘమఘుక్కలలో, హార్మనీ పెట్టెలుగా, నిరంతరము వీనుల శ్రమపెట్టు మైలవరం, రాజమండ్రి నాటకవైఖరు లేర్పడినవి. ఇవియే నేటికిని, యసంఖ్యాక ప్రేక్షకుల పరమాదర్శమై యున్నవి. పండిత విమర్శక జనంబులీ విధమగు నాటకముల నభినందింపకున్నారు. పద్యము, గీతము, సంగీతము తగ్గించి, అభినయమున కెక్కువ వవకాశమిచ్చు నాటకములు, నటులు నీనాడు గౌరవస్థాన మాక్రమించుచున్నారు. బళ్లారి, రాజమండ్రి, మైలవరం కంపెనీల నాట్యలక్షణ ప్రభావ మస్తమించినదని చెప్పవచ్చును. వీరినాటకము లనేకములు చూచియున్నాను.

## కర్ణాటనాటకములు

బెంగుళూరులో ముందటేడు నివసించుకాలములో కర్ణాటకనాటకములను సవిమర్శముగ జూడగలిగితిని. కర్ణాటకము అరవముకన్న అందమైనభాష. ప్రౌఢవాక్యములలోకన్న, విరసంభాషణములోకన్న, పసిపిల్లల ముద్దుపలుకులలో కన్నడ కస్తూరి పరిమళించుచున్నది. కర్ణాటకుల పద్యగీతములు తెలుగులోని మార్గన మెప్పుకుంటచే ఏవు వీలైనపుడెల్ల సుప్రసిద్ధమగు తెలుగుపద్యములను, పాటలను, లలితమగు సంస్కృత శ్లోకములను నిర్మోకముగ జేర్చుకొని తమనాటకముల ప్రజారంజకముగను పండితజనాదరణీయముగను, ఔచితీసంపన్నముగను జేయుచున్నారు. కర్ణాటక నాట్యరంగమునకు ఉడిపి, కొంకణదేశముల చక్కని మేల్మివన్నెలబాలు రెందరోకూడి నృత్యముచే ప్రసిద్ధ, కృష్ణలీలలమన్నగు కథలకెంతయు హంగు నేర్పరచుచున్నారు. ఇది కర్ణాటకుల మొదటియదృష్టము. రెండవది మైసూరురాజ్యములో పెక్కుగాంధర్వులు నివసించుచు పోతన, గోపన, త్యాగరాజాదుల కావ్యసౌందర్యమును కర్ణాటకుల కెరుగ దెలుపుచుందురు. ఇందుచే నాంధ్రభాషలోని పదపన్యలాలిత్యము చాలవరకు పెంపుసు కన్నడలో చేరియున్నది. మూడవలాభము మైసూరు స్వాతంత్ర్యరాజ్యమగుటయే. నాలుకోకమారైన భూపాలకుని నిండోలగపుచందము లారాష్ట్రములోని జనులు చూడగలిగియున్నారు. రాజసభలు, మంత్రులు, చమూపతులు మొదలు పాటకపుజనమువరకుగల

వివిధతరగతుల జను లెట్టిమర్యాదలతో మెలంగవలయునో మహిసూరు కర్ణాటకులు తమ నిత్యజీవనములో శిక్ష నొందుచుందురు. అందుచేత వీరినాటకము లుత్తమగుణాభినయమునకు సహజముగను, ఉదారముగను ప్రవర్తించుచుండును. నాల్గవది మహిసూరులో హైదరబాదునందు వెలసెనే పెక్కుమంది జాగీరుదారులు, భాగ్యవంతులగు వీరశైవులు కలరు. వీరు నాటకసమాజములకు వలయు మూలధనమును వెచ్చించి, సొనువగు దుస్తులను, రమ్యమగు రంగసామాగ్రిని జేకూర్చి కర్ణాటకనాట్యరంగము బొంబాయి, కలకత్తాల వ్యాపార నాట్యాలయములతో తుల్యముగ వెలిగించియున్నారు. అయిదవ ప్రసంగతి మైసూరులో సమస్త శాస్త్రములు, నాటకసంకేతకలు, అందలి రసభావములతో తెరిగిన పండితవర్యు లనేకులున్నారు. వీరిశిక్షణచేతను రాజ్యాధికారుల సహృత్రితవిమర్శకరసజ్ఞతను సంతృప్తిపరచవలసియు కర్ణాటకనాటకములు, సీనరి, దుస్తులు, సంగీతము, వేషభాషాభినయములు, సందర్భపరి మనస్కారమున నేర్పరుచుకొనుటయే గాక, కథాసందర్భమును బట్టియు, పాత్రలక్షణములబట్టియు వీనినుపయోగించు నియమము లలవరచికొనియున్నారు. ఇన్ని సౌభాగ్యము లేకమై వెలసినందున కర్ణాటకనాటకములు, దక్షిణదేశములో నెల్ల సర్వాంగసౌష్ఠవ మొప్పియున్నవని చెప్పవచ్చును.

మైసూరు రత్నావళీనాటకసమాజమువారు దసరా మహోత్సవ సందర్భమున లంకాదహనమూడ జూచితిని.

వరదాచారి హరిశ్చంద్రపాత్ర మిప్పు డభినయించుటలేదు. హిరణ్యకశిప భూమికను పండితమాన్యముగ నిర్వహించు ప్రహ్లాదనాటకము నాదురదృష్టమున చూడనైతిని. లంకా దహనములో వరదాచారి రావణుడై యభినయించెను. మాగంటి సుబ్బారావుగారి పోలికను, అంతకన్న ననువగు లక్షణములతో, వరదాచారి నలుబదియేండ్లు గడచిన పెద్ద మహారాజువలె నగుపడుచుండెను. నగరాజరావుహిరణ్య కశిపవేషమునందుకన్న యెక్కువ భువనైకనాథ దర్పముచు, ఉచితమగు నాత్మనిగ్రహములో వరదాచారి ముఖమునం దమరియుండెను. రసాభినయమందును, భావవ్యాఖ్యానమం దును వరదాచారి ముఖముద్రలు నగరాజరావుతో పోల్ప దగినవికావు. మైసూరు నాయకులందరు మనయాంధ్రనట శేఖరుల తరువాతివారనే చెప్పవచ్చును. కాని యేవేషమున కెట్టినటు డుచితమో అట్టివారోకచో జేరిన సర్వాంగసహ కారసౌందర్యము మైసూరువారి కబ్బియున్నది. వరదాచారి సంగీతనిపుణుడయ్యును నాటకోచితమైనరీతిగా పాడుచు, పెద్ద పద్యములను, గీతములను, సమాసఘటితవాక్యములను, ఉచ్చ రించునపుడు నిత్యసంభాషణవైఖరులలో సహజసౌందర్య మొ ప్పించుచుండును. వరదాచారి పెద్దవాడై, సంసార విపర్యయ ముల తాకిడిదాకినపాత్రయమున నేనుచూచినను, నటునకుండ దగిన సర్వాంగశిక్షయు ఔచితీవిచక్షణయు జూపు నేర్పరిగా దోచెను.

మహారాజాకంపెనీవారి మృచ్ఛకటికా ప్రదర్శనములలో గాయకశిఖామణియగు చిక్కరామారావు చారుదత్తపాత్ర నభినయించెను. చిక్కరామారావు కొంచె మెరుపుగ పలుచని ఒంటితో చాలవరకు హరినాగభూషణముగారిని పోలి యుండును. గాత్రవైఖరులు, అభినయము కూడ నాగభూషణముగారివలెనే యుండును. ఈకంపెనీలో గోపాలరావ్ అను నతడు శకారపాత్రమును, మహానైపుణ్యమొప్ప నిర్వహించెను. అతనికనుకనే రాజప్రాసాదముల సత్యవర్తనము లెరిగినవాడు కనుకనే, యిట్టి నిరుపమపాత్రసాదృశ్య మొందగలిగెనని యూహించితిమి. పాశ్చాత్యవిమర్శకుల యభిప్రాయములో "మృచ్ఛకటిక" హైందవనాటకము లన్నిటిలో మేటి గౌరవ మొందియున్నది. ఇందులో శకారపాత్ర మతివిచిత్రమైనది. శకారుని వైభవము "భగినీభగ భాగ్యభవము." రాజరికము లేని రాచపోకడలు, సంపదలేని డంబము, ధైర్యమెఱుగని దుడుకుతనము, శీలమెరుంగని యధికారము, ధర్మమేర్పడని పెద్దరికము, నిలుకడలేని యుత్సాహము, నీతిలేని తంత్రము, పిరికితనము, క్రౌర్యము, నైచ్యము, వలపుపాడ లరయని మోహావర్తనము, రాజనామకులకుండనోపెడి దుర్గుణములన్నియు రాశీభూతమైయొప్ప, శకారుడు హైందవనాటకములకే కాక, నాట్యప్రపంచరంగమునకూడ మహావిచిత్రమైన పాత్రముగ నెంచ దగును. వీనిగుణరూపములతో సంపూర్ణసాదృశ్యమొంది, శకారసహజమగు రసభావవైఖరుల నతిరమ్యముగ నిర్వహించిన రాచబిడ్డ మిక్కిలి మెచ్చదగియున్నాడు.

బెంగుళూరు దొడ్డణ్ణహాలులో సామ్రాజ్యలక్ష్మీనాటక సమాజమువారు రత్నావళిని ప్రదర్శించిరి. ఇందు వత్సరాజ భూమికధరించిన నాగేశ్వరరావు మైసూరు వరదాచారివద్ద నాట్యశిక్ష నొందినవాడు. ఈతని విగ్రహపుష్టిని మిదివరకే ప్రశంసించియున్నాము. నాటకములో పాటకచేరీలుసలుపు దొరలవాటీతనికబ్బినది. గాత్రము గాంభీర్యమైనది కాకపోయినను, సన్ననిగానశిక్షలో మనోహరముగ నుండును. అభినయ మంతగా భావించదగదు. ఈతనితో రత్నావళివేషమూనిన సుందరి యాపాత్రలక్షణము చక్కగానభినయించె ననుకొంటిని.

సీ-హట్టి, విశ్వగుణాదర్శ నాటకసమాజముల, కృష్ణలీలను చూచితిని. సరిహట్టిలో గానహాస్య ములవడిన హాస్యనటుడొకడు విచిత్రమగు వినోదము లేర్పరచుచుండెను విశ్వగుణాదర్శలో కృష్ణలీలకుజూపిన సీనరీ మహాద్భుతముగ నుండెను. అందలి కృష్ణబాలకుడు నిజముగ శ్రీకృష్ణుడో యనునట్లు ముగ్ధమనోహరుడై, చేతపొందనై లేనగవు మొలకలై, చెప్పనలవిగాని యభినయ మొనర్చెను. బొంబాయిలో నాగరుబజారువెనుక గుజరాతీల కృష్ణాలయ మొకటి యున్నది. ఇది బొంబాయి గుజరాతీల ప్రధానదేవస్థానము. ఒం దొక జయపురపు శిల్పిచే తెల్లరాతిలో చెక్కబడి కొంచెము వస్త్రాలంకార మమర్చియున్న గోపాలవిగ్రహ మున్నది. బొంబాయి భాగ్యము, జయపురపు శిల్పము చేరి యమర్చిన యీ కృష్ణవిగ్రహము విశ్వగుణాదర్శలోని బాలునిజూచి చెక్కబడినదో, లేక కృత్రిమశిలాకృష్ణవిగ్రహపు పోలుపున

భగవంతుఁడా బాలుని గల్పించెనో చెప్పఁజాలము. కాని యీడియూ ముత్తెముమీఁద, బాలకృష్ణుని లేతిముద్దు గొలికించు సాధన లేరెంచే? ఆ బాలుఁడు అవిగ్రహము. వనితో రాధవేషము దాల్చిన గంగమ్మ సుకుమారకోమలసౌందర్య మొప్పుచు, బాలునితో గ్రీడించు నిష్కళంక ప్రణయానుభూతుల నభినయించి, రాధ కప్పుడమియుండున్న కృష్ణసంగమదోషమును వారించి, మాతృసమముగ, సోదరసహజముగ నిర్మల ప్రణయతత్త్వము నద్బోధించియున్నది గొబ్బిళంపెనీవారి యాటలు రెండుచూచితిని. వీనిలో ప్రహ్లాదనాటకమున నుపయోగించిన సరి హిందూస్థానీకృతులను కంపెనీవారు కృష్ణలీల నుపయోగించినదానితో సమానముగ నుండెను. వాసుదేవనను స్త్రీవేషధారి సర్వసమర్థుఁడని చెప్పవచ్చును. ఇందలి నారదుఁడు కడునేర్పరి.

కర్ణాటకనాటకములలో గానశిక్ష యెక్కువగ నున్నను, సరసముగ నుచితముగ, సర్వాంగసుందరముగ నభినయించుచుందురు. శిక్ష, అంగసౌకర్యమువలన నేర్పడు సరసలాలిత్యములే తప్ప తెలుగుదేశములోని ప్రధాననాయకు లవలంబించు భావాభినయములు కర్ణాటకనాట్యరంగమున నింకను చేరలేదు.

అరవనాటకములు.

మనరాజధాని ఆంగ్లేయుల వర్తకసౌకర్యముకొరకు కేర్పడియున్నది. చెన్నపురి నిలచియుండుపట్టు తమిళదేశపు సాంప్ర

దాయములకును సంబంధించియుండలేదు. తెలుగునకును అంతక లేదు. కన్నడమునుకాదు. తురకమునుకాదు. ఏభాష, యేనాగరికత, యేశీలము, యేసద్గుణము, చెన్నపురికూముకంపు నవన యింప నీస్థలము నాశ్రయించియుండలేదు. మదరాసుప్రభుత్వపురాజధాని మధురలోనుండినగాని, రాజమండిరములోనుండినగాని, దాని నాశ్రయించెడి విద్యాలయములు, పత్రికా రాజములు, పండితమండలి, విద్యార్థివర్గము ఆప్రాంతముల నాగరికతను, శిల్పమును, కావ్యనాటకములను, అచ్చటి జాతీయసంప్రదాయముల కనుకూలముగ పెంచియుందురు. చెన్నపురిలో నానాగోత్రముల నానాభాషల పలుసంప్రదాయముల యుద్యోగులు తమజాతీయతనెల్ల మఱచి, ఆంగ్లప్రసాదమున జీవించుచు ప్రజాసంఘమునకు దూరముగనున్నారు. బందరు, రాజమండ్రి, విజయనగరము, తిరుచునాపల్లి, మధుర, కుంభకోణము మొదలైన అచ్చపు పుటుకగల పట్టణములలో విద్యాధికులకును, ప్రజలకును పరస్పరసంబంధము లున్నవి. ఈవిషయము గామూవతారము, వీరేశలింగము, వెంకటప్పయ్య, రఘునాథరావు, శేషయ్యశాస్త్రి, సుందరరామన్ మొదలగువారి ప్రజాహితజీవనమువలనను ప్రజలకు వారియందున్న యనురాగము వలనను స్పష్టమగును. చెన్నపురిలో తురక మెఱుగని లబ్బసాహెబులు, పూడిస్తిని యును తెలుగునేమటులు, కులగోత్రములనెఱుంగజాలని మొదలియార్లు, పుదుప్పేటమాలవాండ్రు, సంకరదొరలు ఇంకెన్నో. 'ఈదేశము ఈభాష' అని చెప్పజాలని సాంకర్యప్రజాసంఘము జనసమష్టి నేర్పఱచుచున్నది. విరికిని

యుద్యోగాపేక్షచే నానాదేశసమాగతులై తాత్కాలికముగ చెన్నపురిలో నివసించు విద్యార్థులకును విశేషసంబంధము లేదు. అందుచేత చెన్నపురిప్రజల యభిరుచులు విద్యాసంస్కారమునకును, కాలప్రవాహమునకును భిన్నముగనుండుట యొకవింత కాదు.

చెన్నపురిప్రజలు తొలుదొలుత పారశీకనాటకముల రంగుటింగులను, గానవైఖరులను జూచి నాటకలక్షణములను తెలుసుకొనుచుండిరి. తరువాత బాలామణి మున్నగు తమిళనటుల రంగమర్యాద లలవఱచుకొనిరి. చెన్నపురి తెలుగుకోమట్లు, నాయుడ్లు బళ్ళారినాటకసమాజములరీతుల కచ్చెరువందుచు నదియే నాటకపరమావధిగ నెంచుచుండిరి. బళ్ళారివారు తెలుగు, కన్నడము, మహారాష్ట్రము, తురకము, కొన్నిపట్టుల అఱవము ఈపంచముఖముల మాతృభాషను మాటాడుజనులు. ఆంధ్ర, కర్నాటక, నిజాం, కొంకణసంప్రదాయములుకలియు కూడలి బళ్ళారి. ఇట్టి బళ్ళారివాస్తవ్యుల నాటకశిక్షయెప్పుడి చెన్నపురివారు లెంతవఱకు ఆంధ్రజాతీయత నెఱుగగలరో చెప్ప నవసరములేదు. చెన్నపురి యఱవకంపెనీలుకొన్ని భాగవత, హరికథా, నాటకచ్చేరి, రంగూన్ భోగంపాటకి, హాస్య, ఇంగ్లీషు, తెలుగు, తమిళ్, తుఱకం, బయస్కోపు, గ్రామఫోను, బాల్ డాన్సు పోకి లన్నిటిని ప్రపంచములోని సాంకర్యమంతను నెత్తిమొత్తి దానిలో నీతినియమాలు లేకుండ కలిపి ముద్దచేసి చౌచౌ ఆట పసందులతో చెన్నపురిప్రజల నానందపఱచుచుండిరి. ఈలోపుగా సినీమాకంపెనీలు పాశ్చాత్యవిటదుర్నీతిని, సిగ్గు

లేని వలపును, ప్రజకు నేర్పుచు. వర్ధనార్థ వెరైటీ వినోదములకు లోబడిన తెల్లదొరసానులు స్టేజిముద్దులు నేర్పి పోవుచుందురు. చెన్నపురిప్రజల నాటకగుణభిజ్ఞానము ఇన్ని విధములగు కల్తీ సంప్రదాయముల మొత్తమై యున్నది. ఏనాడో కర్మముచాలని శుద్ధాంధ్రకర్ణాటక నాటకసమాజములు చెన్నపురి కొల్లవెట్టుదమని గాత్రతో వచ్చి మెప్పించజాలక, పైబట్టలమ్ముకొని పోవుచ వుటనాడ తలపెట్టినుదుండెను.

చెన్నపురి శుద్ధజాతీయసత్వము లేని సంకరభూమిలో నేర్పడి, విద్యాధనాధికారములకాలవాలమై యుండ నేర్పడుట ఆంధ్రులకును, తమిళులకును, కర్ణాటకులకును, అనర్థదాయకమై యున్నది. రాజ్యస్థానము నాగరికతకు కుదురనియు, నచ్చటిజనుల మెప్పించి పేరుపొందుట వడగునవలెననియు కొందరకేర్పడు భ్రాంతి శుద్ధశాస్త్రగ నున్నది. శుద్ధజాతీయ సత్వము లేర్పడియున్న తమిళాంధ్ర కర్ణాటకులు తమ ప్రతిభాసంపత్తులను తమదేశములో ప్రకాశింపజేయగలరు కాని, సాంకర్యరాశియైన చెన్నపురిలో వన్నెకెక్కజాలరు. "పలనాటికి మాటికి పోవనేటికిన్" అను శ్రీనాథవచనమును "నవ్యశోభాగ్యభర"మగు "చెన్నప్పపురము"నకు వర్తింపజేయుటయే యుచితమైన పని. చెన్నపురిప్రజల విపరీతరుచుల సంతృప్తిపరచ జూచుటలో మన కళాభ్యాసము మట్టిగలిసిపోవుననుట నిశ్చయము.

తిరువల్లిక్కేణిలో, తిరువట్టీశ్వరం ముకేట (మరిక్కె) యొత్తిడిలో నొక కూత్తుకొట్టై (నాటకశాల) యున్నది. అందు నొవరో అమ్మాళ్, ఇంకెవరో బాయి, స్త్రీ వేషమును ధరించి, యెవరో పిళ్ళై రాజా పార్టు ఆడుననియు. శ్యామన్న హాస్యమో, నడరాజాశారి (నటరాజాచారి) కళ్లిక్ పాట్లో వేయుదురని బొంకుతప్పుల అలంకరించిన రెండెడ్ల బండియొక టముటమూయింతురు. చెన్నపురి గోడలన్నిట వెస్టుపుండుకో వారి రంగు ముద్రలతో పరిధాననాయకుల నామములును, ఆల్లీ అర్జునన్, కోవిలన్, సవారాం, వల్లీ, శ్రీయాళ్ మొదలైన తమిళనాటక నామములను, వీనన్నిమారులు Tamiza శబ్దములోని సుందరార్థకమగు (L Z A) కారమును వాడుచు నతికించి యుండును. రాత్రి పదిగంటలగుసరికి కూత్తుకొట్టై, మగ్గుచల్లి నరంగు, పాండల వేశ్యానయములతోడను, నింతరము "అవనై పమ్ము నప్పైశ్వ అడేచివంద్రే" అనుమోసగొండి ఛంకములాడు మదరాసు చిల్లరజనముతోడను, యెవరోకొందరు దారితప్పి వచ్చిన పెద్దమనుష్యుల తోడను. పెక్కులు నానాకారయ్యల తోడను నిండియారవనాటక ప్రేక్షణ కుతూహలమగు పరిషత్తు కూడియుండును. హాలులో యీలలు, కేకలు, బొబ్బలింతలు, నాణాకారుల సద్దుకుబడాయి, పౌరుల దెబ్బలాటలు, వేశ్యాంగనల యార్థికసమస్యలు. పాలికయ్యముల యూసడింపులు, వెత్తిలపాకు, సోడా, బిస్కత్తు విక్రేతల బాలమయూకాల్లానరవములు మొదలగు కర్ణదుర్భరఘోషతరంగముల రతో కే

డుచున్నను. పిత్తమెత్తిన విటతండమొకటియే నాచిన్నపురి పరిషదాందోళన మొనగించి కొట్టము గిట సైదాపేటపట్టు రుమాళ్ల పూవిల్లు తెలివి నొలికింపుచుందురు.

ఇంతలో గణగణమను నాటకారంభసూచన ఘాకల కల మపనయింప బుట్టశాస్త్రిపు హార్మోనియిష్టూ, వంకరమెడ తిపలాకాడు, కంటిమెడి పొక్కాయి కతికించిన నెక్టయి,బడాయి తో రంగముఖ మలంకరించి, పాప మావాద్యపరికరములమీద కండెలాలమున, చేతిసత్తువను ప్రస్తరింప మొదలిడునంతలో రంగస్థలమునుండి కొన్ని తాళములు మ్రోగుచు, పలుపురు పాడుచు, అరవశబ్దములకు పాశ్చీపిరుపుతగిలించిన తోటుప్రిత్తుం పులతో నొక గీతికాఘోష ముప్పతిల్లును. ఇదిగ్రాయిన వెనుక రాజాపాట్లవేషగాడు పూసముస్తుల నింపి కాలుపుతో "నాకోర మీసం రంగసామికోట్రి ముప్పవుసరు," అనుపట్టి గాజ్యము దో ద్యూతితోటుప్రిపాటుతో ప్రవేశించి, ఘంటిచూపుల మేళ డంబములతో నొకతమిళపాటనెత్తికొని సుమారుగంటసేపు అరవ నాటక — పాటకచేరి — బాలుడాన్సు — భాగవతమును అలా పించును. ఇందులో మధ్యమధ్య రంగాంతరంగమున తాళము లూగించు పిన్నాటగాండ్రు పాటచరణము లందుకొని గూయు చు, నాయకుని యులసటదీర్చుచుందురు. ఇంతలో హార్మనీ వాడా వేశమును పట్టజాలక, యొలుగెత్తి మిన్నుజూచుచు, కాళ్ల తో తిత్తిసూత్రములదన్నుచు, చేతుల నుద్వేగమున సారించు చు, పెద్దగా పాడదొడగును. రంగస్థలమంతయు తాళములతో, లుగాత్రముల పాటమొత్తములతో, హార్మని దెబ్బలతో, తప

లావాడు బీడికాల్చుకొనుటకు నిష్క్రమించిన వెల్తియగుపడకుండ జేయు ప్రేక్షకుల కరతాళకోలాహలముతో, తెలిసిన పాటగనుక స్వరాభ్యాసమలవరచుకొను బాలగాయకుల వంత పాటలతో అన్నియు జేరిన తమిళసౌందర్యముతో కూత్తుకొట్టె జుమ్మని నెగిరిపోవుచుండును. మొదటిసీను ఆఖరైనది.

ఎండిపోయిన పల్లమొగపు కనుబొమ్మలోదపని వలపుకత్తె ముంగురులు కత్తిరించి, బహ్మాక్రాసింగు తీసి, ముగ్గులరికెన పింతమోముతో, గుండ్రనికన్నులతో, వస్త్రతూకాపోషణంబున నుప్పొంగు చేతచన్నులతో నాటుకోటరత్నాభరణముల వింతకాంతులతో, మిడిసిపడుచు, వికవికలాడుచు, యౌగసౌష్ఠవమొనగూడని, ఘనాభావపరిపీనతతో, తనకంటె చక్కని చెలికత్తె లాశ్రయింప కథానాయిక ప్రవేశించుచున్నది. నీలమేఘముల కనుమలోయలలో వెలుగొందు, తటిల్లతిక లెట్టి సురుచిరాశాబంధముల గ్రీష్మతాపోపహతుల కేర్పరచుచున్నవో, అట్టి యాశాతరంగము లానాయికాప్రవేశమున జూపరుల కొదవియుండెనన నేమివింత? కూత్తుకొట్టాయిలోని యెందరి హృదయమర్మములు తల్లడిల్లుచున్నవో! ఎందరిమానసములు జల్లుమని త్వరాయుతనాడీపరిచారమున నూగుచున్నవో! ఎందరు తమయాశాభంగముల నీనాటి నాటకసమయమున దీర్చదలచిరో! స్టేజియంతయు పూలచెండ్లె విసురు పాటలతో, మాలికాసమర్పణముతో, ప్రేక్షకుల స్వాగత సంతోష కరతాళములతో, అయిష్టుల యీలకూతలతో

నోకవారు చెలరేగెను. ఇంతలో పిట్టుమూలను కూర్చుండి పీ
బూది యోలదిన బోడిమెడకు బంగారు రుద్రాక్షకట్టిననల్లని
బొజ్జశెట్టిరెయొకడు కొంగుచెంగునుండి స్వర్ణపతక మొకదాని
తీసి తెరప్రక్క వేచియున్న పట్టురుమాలు యువకునిచే నాయుమ
కతికింపజేసె. నాయికానందవంసనము గోకశేరనగవృత్తో
నందికొనును. నాయిక ఆకుది, అబల. నాయిక పాట యెంతసన్న
ముగ నుండినను, నాయకుని స్వరగాంభీర్య మున్నిదగుటచే,
పిన్నాటపా సహాయ మెక్కువగ వలసియుండను. మూడవ
సీనులో నాయికానాయకుల సమావేశ సంభాషణములు
జరుగవలసియున్నవి. కథాసందర్భములో నిదియే ప్రథమస
మావేశమైనను, తొలుచూపు వింతచురుకులు అభినయింపవల
సినను, నాయికానాయకుల చిరవర్ధితపరిచయము దాచుకొను
ట కష్టమేకదా! నాయకుడు కోరమీసము నెగదువ్వుచు
వెకిలిచూపుల చిరునవ్వుతో వలపువార్తల నందించుచుండు
ను. నాయికపాత్ర గుంప్రకటనముకన్న నిజకులవ్యాపార
ప్రకర్షణమే ప్రధానముగనెంచి, ముదురుసాని ముచ్చటలీను
నిర్లజ్జాభినయముతో చెన్నపురి నాట్యపరిషత్తును, అందరికన్న
నాయకుని దనియింపజేయును. పార్శ్వముల్లో తెరవున ముక్తపా
దార్థ గ్రహణపద్ధతులతో కొన్ని సంభాషణములాడి, యువతీ
యువకులు రంగపక్షములలోనికి, సర్కసు దొమ్మరుల పరుగిం
తల ననుకరించుచు, ప్రేక్షకుల సమ్మోహితావలోకనములపై
నాలుగు ప్రసన్నదృష్టుల జికిలించి యంతర్హితులగుదురు.
ప్రేక్షకు లంతటితో సంతసింపక, యీలకూతలతో దుస్సహ

ముగా నరచి మూడునాల్గు పర్యాయము లానాయిక యొక్క స్మితావలోకనమును, వెకిలివలపులను, పిలిపించి యనుభవింతురు. నవ్వులు, చూపులు కన్న కోమలాంగి సర్కసుపరుగులే చెన్నపురిరసికుల బట్టరాని సంతసముతో నింపుచున్నవి. ఈ మూడుసీనులు, మధ్య జేరిన రెండుహాస్యపుపట్లు మొదటియంకమును ముగించుచున్నవి.

రెండవయంకపు రెండవసీనులో నాయికకు మతిభ్రాంతి కలిగించవలసిన దొంగయూ, తాగుబోతో ప్రవేశించుచున్నాడు. నటరాజాచారి కల్లస్‌పార్టు వేస్తాడంటే చెన్నపట్నపు రసికమండలియంతయు గుమ్మికరించుకొని, కొట్టాయిలో దూరును. నల్లనిమసిపూసిన పెనాదికోతిమొగములో తెల్లని లోతుకన్నులు మత్తుతరంగములసీదుచు తళుకులాడ దొంగ తెరచాటునుండి గుడారములోదూకిన పులివలె బ్రవేశించు రంగమధ్యమున జేరి నిలువబడును. మోపెడేసి జరీచుట్టిన పూలదండలు, పూలగుత్తులు తెచ్చి ప్రేక్షకు లీమనాదివాని నలంకరింతురు. బనప్పకంకణాలు, ఉంగరాలు, గొలుసులు, రూపాయలు పెండ్లిపీటలమీద జదివించినట్లు దుర్మదాంతార రంగమధ్యమున దారిదోచెడి యూహతో నిలువబడిన యీకొండయొదుకలవాని కర్పింతురు. ఈముచ్చటంతయు తెర వెనుక కల్లనుగారు గానఘణతు లవలంబించి,

"నాన్మొనులిల్లా దే వ్యాపార కారే
ఎంగళ్ మున్నార్ గాళ్ళలంకు బేకే."

అని కొంతతరి పాడి రాగ మాలాపించ దొడగును. తరువాత,

"యాభైయారు దేశములలోన అందమైన నెల్లూరిలో
దొంగలకంతా రాజానయ్యా నేనే
ఊరుఊరూ తిరిగివస్తి, కడపట నెల్లూరొస్తి
కొల్లగొట్టి వస్తినయ్యా నేనే."

అను వైఖరిలో కొంతవర కభినయ కౌశల మేర్పరచి, దొంగపాటలు విను వేడుక నాపజాలక గుమ్యుగా రసికవర్గంబు తలంపెరిగి తెమ్మాంగుదారు లవలంబించి,

"దొంగాను నేను దొంగాను నేను దొంగాను సామీ!
పక్కాదొంగాను సామీ! రాజాదొంగాను సామీ!
ఈ పాతకచ్చేరిసందులోన పదకం దొంగిలిస్తి సామీ! పదకం
దొంగిలిస్తి
కాల్దొంగనూ అరదొంగనూ ముక్కాల్దొంగనూ సామీ!
ముక్కాల్దొంగనూ
నిండార్దొంగనే సామీ! రాజాదొంగనే."

అనేకరీతిగ తమిళదడబిడలతో రాళ్ళు రువ్వినపగిది పాడుచు, ఆడుచు, గంతులిడుచు, చరణములు విరచి, పల్లవిస్వరకల్పనల విపరీత లయప్రస్తర వైఖరుల విస్తరించుచు, రాగము విసరుచు, తపలావాని లయప్రచారభంగములలో విసిగించి మోసపుచ్చుచు, పలుకని మొద్దుపెట్టెను ప్రాణము విసిగి హార్మోనీవాడు నిర్విణ్ణుడై వదలి పాటపల్లవినందుకొన ప్రేక్షకు లలవిగాని కల్లతత్వపూరితులై కాలుచేతుల మోదుచుండ రంగము

లోని నటవర్గమంతయు తాళవినాదముతో పిన్నాటతరంగముల తో దొంగనాయకుని గానవిన్యాసమందికొని ఛందులాడ భావరాగతాళముల మహోన్నత్తవిలయసంఘట్టన మేర్పడి కడలి కరుళ్లవలె పొర్లి, విరిగి, పాకి,ప్రాకినడచి, గెంతి, బహు భంగుల తాండవింప చెన్నైనివాసుల నాటకాదర్శపరిణామ ము లాకొండయేనాడిపాటలో సిద్ధించి మహావైభవంబున జెలరేగు కథాసందర్భ మనేకఘటియలు నడచినవెనుక నేను గుననిన నాయకురాలు దారితప్పి "అడవిలోకి వచ్చిందయ్యా." కల్లనుగా రాపెను చూచినంతలో మోహించి "అడవిలోన నిన్నుచూచి ప్లిప్లో ప్లిప్లో, నా మనసంతా కొటకలాడె ప్లిప్లో ప్లిప్లో" అని వెకిలిగంతులతో నాపతివ్రతాశిరోమణిని సంబోధింప దొడగును. వేసింది కల్లను వేషమే, తాసిల్లినది నిర్జనభీకరారణ్యమధ్యముందే, నాయిక ధరించినది రాణీపార్టు వేష మే; అభినయింప వలసినది పతివ్రతాలక్షణమే. కాని నల్లమసి, తెల్లపౌడర్లు, చిరానుభూతపరిచయము సెట్లుమరుపింపగలవు! జన నాంతర సౌహృదంబు తెరుగకుండుట మానవనైజమేకాని ప్రస్తుత జాతకములోని యవస్థ లింతలో భూమికావలంబన నిమిత్తమున నమసంటునా? దొంగ పతివ్రత రెండు మూడు చూపుతళుకులలో పరస్పరాభినందన మొనర్చుకొని నిర్లితసం భాషణల నందికొనుచుందురు. దొంగకు నాయికకు "తర్క" మారంభించును. తర్కమనగా శృంగారసంభాషణమని అర్థము.

**అరవవాళ్ళ వలపు పలుకులు—తర్జుమా:—**

దొం—కన్నోక్కనాడై (ఇ)క్కారి భల్ జోక్కనాడై (ఇ)క్కాకి
 సోలకుళ్ళ వాడి సొగసుగ నా మిరుప్పం.

**నాయిక**—ఛీ, ఛీ! సిరాప్పా!

దొం—సిర్కాన్నివాడీ!

సం—ఏండా త్తలై క్కాన్నై ఎగిరి గుదిక్కరాయ్ ఎట్టిల్ కట్ట
 వరాదే!

దొం—హాప్పా! సిర్కాన్నివాడ!

ఈవిధమైన శృంగారాలాపము కొంతతరి జరిగి ఇద్దరూ తమతమ గానకౌశల్యమేర్పడ కేకిలిచేష్టలనూ, మోటవలపులను చూపుకొని యాడుచుండగా ప్రేక్షకులలో గొందరు మరియొక నాటకములో తమకందముగా దోచిన కొన్ని యసందర్భపు దుశ్శీల గీతముల బాడ గీపెట్టుచుందురు. డబ్బుపుచ్చుకొని యాడు వారికి సభికుల నానందపరచుటయే విధిగాని ఏకకథైన నేమి? ఎందలి నాట్యగీతములైన నేమి? పాటనుండి పాట, తాళాన్ని పట్టి తాళం, రాగంనుంచి రాగం ఈరీతిగా శరపరంపరలుగా కల్లన్, రాణిలగంతుపొంపులతో కాలము గడుపుదురు. గిట్టని వాళ్ళు వీధిలోని కంకరనెల్ల కొట్టాయి రేకులపై గుమ్మరించిన నేమి, దొంగపాటకు రేకుచప్పు డడ్డమగునా? పాట్లలోని శృంగారసంభాషణము భావగీతికా పాగల్భ్యమూని ఆశుకవిత్వమై అప్పుడల్లిన క్రొత్త గీతాలతో పొంగిపొరలిపోవుచు వచ్చివలపుకు కుర్లింగి,

"అంజీగలాసుతా రేణ్ అరగలాసు వైను తరేన్
గోధూమరొట్టి తరేణ్ ఎక్కూడావందాల్ కట్టీ తరేన్
కోయాంబత్తూరు లేడి! ఒరుబీడీయురుందత్తాడీ!"

మొదలగు లొల్లాయి మర్యాదలలో విజృంభించి నిజప్రీభావము ప్పొంగ నభినయించు రెండవయంకపు రెండవసీను నగకట్టులో టానాకారయ్య లిప్తములేకున్నను స్వకార్యనిర్వాహణ నియతులై బిగులావి "వేళయతిక్రమించె నిక నాటనాపు" డని యాదేశించి నాటకుల బ్రతిమాలుచును, డబ్బిచ్చి తిట్టుచి సరసులకు నడుమ నాయెదుటి తెర వ్రాలించెదరు.

చెన్నపురి పౌరులానందించి వేలకొలది ధనము చదివించెడి సామాన్యనాటక మర్యాదలెరింగింప పైవర్ణన మొనర్చితిని. అల్లరిలేని యరవనాటకము లందైనను యిట్టినాటక—పాటకచ్చేరి—బాల్ డాన్సు—కల్లకపాట్లు—భాగవతము ప్రేక్షకులు నటులతో పాటు చరణములందుకొని గీపెట్టుటయు నటులందరు ఆతరుణమం దభినయించు పాత్రముల సంభాషణము ననుకరించి హంగుగావించుచు వీధిభాగవతముల వైఖరిలో గోలగా నభినయించుటయే అరవనాటకముల సామాన్యలక్షణములై యున్నవి. అరవకంపెనీలలో స్త్రీవేషములుగాను వేశ్యావనితలు రంగూనుతరహాల నతిక్రమించి జుట్టుబొట్టు, రంగుటింగులను కుదుర్చి చెన్నపురిలోని ప్రజలకు షోకులందు మార్గదర్శములుగ నెంచబడుట కడుశోచనీయము. వీరి పచ్చిశృంగారము, నాయకుల చిలిపిచేష్టలు, అరవనాటకమున కెంతయు భంగకరముగ నున్నవి. అరవనాటకములను సు

మూడు పదిపండ్రెండు ఆటలను నేను చూచియున్నాను. కన్న య్యా, బాలామణి మొదలైన కంపెనీలు ద్రవ్యబలముచే విశేషమగు సీనరీ, రంగపరికరములు, సంపాదించి వెలగుమన్నను దుస్తులు వేయుటలోగాని, కథాంశమును విమర్శించి భావానుకూలముగ నభినయించుటలోగాని, పాత్రోచితమగు దుస్తు లమర్చుటలోగాని, గద్యపద్యగీతముల నుండవలసిన నియమముల నేర్పరచుటలోగాని యెట్టివిచక్షణ, నాటకసంప్రదాయాభిజ్ఞత నుపయోగించుటలేదు.

సింహళపు నాటకములు.

కొలంబోలో మద్రాసాఫీసుకు ఎదురుగ నొక నాటకశాలయున్నది. అందులో నొకసమాజమువారు (కొలంబోలోనికంతయు నదియేమంచిదట) విక్రమరాజసింహుడు సింహళమును జయించిన గాథ నాటకముగ రచించి యాడిరి. ఈకథలో యాత్రనివాసములు, వారియాత్రికావిద్య, యింక ననేకరమ్యతమములగుసీనులు చూపవలసివచ్చినవి. వీరిస్టేజి ఎక్కువ వెడల్పుగలది కాదు. కాకపోయినను రంగపరిసాధనము హిందూదేశములోని యొచ్చటివానికన్నను నెక్కువ పరిష్కృతిసిద్ధముగను, రమ్యముగను, సాధువుగను నున్నది. బొంబాయిపార్సీకంపెనీలలో తెరల నుపయోగించెడి రంగుమెరుపులీనుచు రంగమునందు తళుకుబెళుకులెక్కువయుండి పార్సీనటుల బొబ్బలింతలకును, డ్రెస్సు, డౌలులకునూ అనుగుణ్యముగ నుండును. కలకత్తాకంపెనీలలో నిబూ వలెనే కథాంశమునకు సందర్భించనివాని కొన్ని సీనులను జూపు వేడుకలతో కాలదోషము వాటిల్లువానిని జూపి మిరమి

రలాడించుచున్నారు. కొలంబోకంపెనీయొక్క సీనరీ కథాకాలమునకును కథాంశమునకును జక్కగ ననుకూలించునట్లు సవిమర్శకముగ గంటి కింపగురీతుల లేతగరుకురంగులతో చిత్రింపబడియున్నది. దూరము నుండి చూచునపుడు వాస్తవప్రకృతియునట్లు తోచుచుండెను. చెన్నపురి, కలకత్తాలలో నింగ్లాండునుండి వచ్చిన నాలుగు అయిదు నాటకసమాజముల రంగపటకరముల జూచియున్నాను. అవియు నిటులనే యుండును. యక్షిణి మొదలగు సందర్భములందు మహాద్భుతమైన యంత్రసిద్ధి చూపబడినది. సీనరీకి అనగుణ్యమగు వర్ణముల దుస్తులు చారిత్రపరిజ్ఞానముతో గూర్పబడియున్నవి. ఏరంగమునకు ఆ రంగపు సీనరీతో సమన్వయమొంది, వర్ణశ్రుతిమేళవింపుల నొంపొనులతో గలయునట్లు దుస్తు లమర్పబడెను. ఇందుచేత ప్రతిరంగము నాటకములో ప్రతిక్షణము రంగమంతయు పటలీదేశపు లోకవిఖ్యాతచిత్రకారుల భావచిత్రములవలె నగుపడుచుండును. నాట్యరంగమునకు చిత్రసిద్ధికలుగ నొక కొలంబోలో తప్ప వే రెక్కడను చూడజాలకుంటిని.

సింగలీభాష ప్రాకృతజనితమై తెలుగు, సంస్కృతము, పారసీకము మూటిలోనియందము లతికించినట్లు విన సొంపుగా నుండును. కథాంశములో గద్యమే ఎక్కువకాని యచ్చటచ్చటసులలితమైన గీతము లమర్పబడి స్వాదుగ రంగరసముతో మిళితమగునట్లు చల్లగ పాడబడుచుండెను. కథాంశపు వెలితిపట్ల హాస్యరంగములుండి గానవిస్తారమున నానందింపజేయుచుండెను. సింగలీలనాటకాభిరుచులు మనదేశములో నేరకంటెను

మృదువుగ, సరసముగ, నుచితముగ నగుపడుచున్నవి. ఆట మొత్తముమీద మూడుగంటలకన్న ఎక్కువపట్టలేదు.

బొంబాయి నాటకములు.

బొంబాయిలో యింపీరియల్ పార్శీమండలి, జెకూంటువీల, బాలివాల, బాలగంధర్వ నాటకసమాజముల ఆటలను చూచియున్నాను. పార్శీ, గుజరాతీ, మరాటీభాషల నాట్యవైఖరు లింపున చూడగలిగితిని. ఇందులో గుజరాతీభాష కొంచె మింపుగనుండును. బాలగంధర్వలో సంగీతసౌకర్య మెక్కువున్నది. కొంచెము పాటకచ్చేరిపద్ధతికి చేరవచ్చును. పూర్వము బాలగంధర్వుడే పాడుచుండినపు డుండినవిఖ్యాతి ప్రస్తుతము యీసమాజమునకు జెందకున్నది. పార్శీనాటకములు తమ కుబెళుకుల దిట్టలైనను, చమేలిపార్టనందు, హాస్యరంగములందు, జూపెడి పోకుచమకులు కథాంశమునందు జూపలేకున్నారు. పార్శీనాటకములలో హరిశ్చంద్ర, భారతకథ, మున్నగు హైందవకథలే ఎక్కువ పరిశీలనతో నాడబడునట్లున్నది. వీరు షేక్స్పియర్ నాటకములను భ్రష్టుచేసి కొన్ని సందర్భపు కల్పనలందు నిరీకించి ఆంగ్లభాష యెరింగినవారికెంతయు నసహ్యాకరముగ జూపియున్నారు. నేనుచూచిన యొకశాకుంతల ప్రదర్శనములో కూడ నొకతావున హైందవ మర్యాదలకును కాళిదాస రసలాలిత్యమునకును పెద్దభంగపాటెద్దియో యొనర్చిరి. ఆపట్టు ప్రస్తుతము స్మృతివీధి దాటియున్నది కాని చూచినప్పు డొందిన మితిలేని విసుగుమాత్రము నిలచియున్నది. బొంబాయి నిక్కముగా భావసంస్కారమున కొప్పిదమగు నెలవుకాదు.

ఎంతటిభాగ్యమున్నను ఎట్టివిద్యావివర్ధకసంస్థాపన లమరియున్నను బొంబాయిలో విద్యాసంస్కార మొదవని వర్తకజాలము, పారిశ్రామిక జనబాహుళ్యము మిక్కుట మగుటచే గబోలు కలకత్తానగరమందున్న సంస్కారమును, మృదులలిత రసానుభూతియు నేర్పడక యున్నవి. నాటకసమాజముల సీనరీలు ముదురుతళుకుల వేషమందు వెలుగుచున్నవే కాని పాత్రభూషకలు రంగరంగములకు క్రొత్తవర్ణముల విలువగుడ్డలతో నమర్చబడి మెరుపుదీపికల నిండువెలుగున రాణించుచున్నవే కాని, హాయారున సంగీత తరంగము లొలుకుచుండునే గాని, సరసమైన, నాట్యకళాప్రశస్తమైన, లలితమైన రూపకవైఖరు లా శ్రీనిలయమందు గానరాకున్నవి. తెలుగునటులు కర్ణాటక, సింగల, వంగీయ నాట్యాలోకము నుండి కొన్నిరీతు లరయవచ్చును గాని బొంబాయి రంగస్థితుల చెంత జేరకుండుటయే నాయభిమతాభిప్రాయము.

### కలకత్తా

ఒకచెంప శాంతినికేతనములో భావసంపోషితమగు చిన్నినాటకరాజము లారుబయట రసమొలుక రవీంద్రనిఘాత్రివర్గ మభినయించుచుండ, నొకచెంప వంగీయ వాఙ్మయవిజృంభణము నాటకప్రపంచరహస్యముల వెల్లడించి రసవన్మార్గముల నుపదేశించుచుండ, జగద్విఖ్యాతధీమతులు నాటకముల రచించి యభినయాదర్శముల చెంత జేరుచుండ, కలకత్తాలో నాటకసమాజములు జనసామాన్యమును సంతృప్తిపరచుటకాదు చూడుట వింతయే. ఇచ్చటి సామాన్య నాటకములుకూడ సీనరీయందును, ఔచిత్యమందును, నాట్యసంస్కారమందును హిం

దూరదేశములలో వెల్ల మిన్నలని చెప్పవచ్చును. కలకత్తాలో ఆల్ఫ్రెడ్, కొరింథియన్ సమాజములు పేరొందియున్నవి. ఈపురములో మూడు నాటకములను మాత్రమే చూచియుంటిని. భరతఖండములో నివి మంచివైనను, బంగాళీభాష దుష్కరోచ్చరణ వికారదుర్విదగ్ధమై వీనుల నలయింపజాలకున్నది. వంగీయసంగీతము క్రైస్తవప్రార్థన గీతికలవైఖరిలో నాంగ్లసంపర్కమాలిన్య మనుభవించి శ్రోతగుభక్తితలపుల కుచితమయ్యెను, ప్రశాంతిభావ సంస్ఫురణ మీయనోపియు, ఆంధ్రులలలితశబ్దానుభూతగీతాభిరతుల నింపుకైన మెప్పింపకున్నది. ఏమైనను ధనసహాయము విద్యాసంస్కారము సరసవిమర్శనము నవ్యమార్గానువర్తనము, జగమునిండిన తెలివి పెంపు లొప్పెసి వంగీయనాట్యకళానుభవములు కొంతవర కాదరింపవలసియే యున్నవి.

## ఆంగ్లేయ నాటకములు.

## వెరైటీయాటలు, సినిమాలు.

ఆంగ్లేయనటులు సామాన్యముగ నిద్దరు ముగ్గురు స్త్రీపురుషులు వచ్చి హాస్యశృంగార దీపకంబులగు గానప్రధాన భాగములు నభినయించి పోవుచుందురు. వీరిదుస్తులు-పౌడర్లు-మస్తాబు-చకచక-తళతళ- భావోచితవర్ణదీపులలో నారుచు, మెరయుచు, తగ్గుచు, హెచ్చుచు, నొకవిధమైన యాలోకికానుభవము సంపాదించుచుందురు. పియానో, ఫిడేలు అను వాద్యములై, రసభావ విస్ఫూర్తినేర్పరచుచుండ, నన్నివి పిల్లి

కూత లోకబికింపున గణగణమును త్వరితగతులతో చెప్పిన నుచ్ఛస్థాయి నాక్రమింప నగుచు, శృంగారవిలాపమందలి వివిధావస్థల నతిత్వరితముగ రంజింపజేయును. మన వీథిభాగవతులు విప్రలంభరసానుభవమును మెల్లగా పదిమంది గుమిగూడి మి న్నదర పాడుగావింప మెల్ల మెల్లగ నిట్టూర్పులు, ఆశాంకురములు, ఉలికిపాట్లు, ముఖపు తెరలు, రాగము ప్రస్తరించినట్లు; తాళక్రమ మెక్కిదిగినట్లు, తగని కాలయాపనముతో జూపుచుందురు. మనసంగీతమందు, తాళప్రస్తరణమందు, యెట్టి యారోహణావరోహణ విశ్రాంతిక్రమము లున్నవో అభినయమందుకూడ నట్టివే యున్నవి. ఆంగ్లేయుల రసావేశక్రమము దైన్యనైచ్యమునుండి ప్రఫుల్లానందసంతోషవిస్ఫూర్తికి తటాలున రెండుమూడు క్షణాను యోగింపులలో మింటి తెరువున నెత్తికొనిపోవుచుండును. చల్లనిరసములో, నుదారగంభీరమగు భావములో, హృదయము న్నాల గదలించిన ట్లూగించుచున్న గానఫణితి చిమ్ములు నవ్రాలి, చిందులిడి, గంతులేసి, ధగధగ మెరసి, టపటపవిరిగి, జుమ్మునరేగి మరియొకరసపు, మరియొక భావపు, గానపరిణామములో సంక్రమించును. ఇందులో నాంగ్లపరాసు గాయకనటుల యాచార మభినందనీయమే కాని వారిశృంగారచేష్టలు, వెకిలితనములు హైందవుల జీవితాదర్శములకు భంగకరముగ నుండును. కామిడీ, లౌసీనులలో నాంగ్లేయుల నైపుణ్యము మన కలౌకికముగ గోచరించునుగాని షేక్స్పియరునాటకాదులందు మనప్రశస్తనటులు వారికి సమానులని చెప్పవచ్చును. పాత్రసాయూస్యత నేర్పరచు భూమికాధారణ

ములో నాంగ్లేయు లద్వితీయులు. సర్ మార్క్యుయానుటన్ అనువాతడు మెఱుపుమెరసినట్లు బలుపాత్రముల భూమికల తానే ధరించుచు నాటకమునంతను వేషయుక్తముగ నభినయించెను. ఇతడు రంగములో నాడునపు డొకడే యన్నిపాత్రముల ధరించిన ట్లగుపడక పదారుగు రేకపర్యాయముండిన భావముపుట్టించు వేగముతో సిద్ధప్రజ్ఞతో సంచరించుచుండుట చూచితిని.

బయస్కోపులవలన ప్రపంచములోని మహానటులజూచు భాగ్య మేర్పడినది. యంత్రవిద్యలం దెట్టి పాటవమొప్పుచున్నారో నానావిధములగు శాస్త్రపరిశోధనలం దెట్టివిపరీతసిద్ధ నొందియున్నారో నాట్యాదికళలందుకూడ నట్టి విపరీతసాఫల్యమునే పాశ్చాత్యులు సంపాదించియున్నారు. ప్యారీసుపట్టణములోని నాట్యవిద్యాలయములందు శిక్షితులగు నటులు నాలుగైదుభాషలసాహిత్యమును, సంగీతశిక్షను, దేహములోని యావయవములను యిచ్చవచ్చినరీతి శాసించు నైపుణ్యము సంపాదించి అనేకసంవత్సరములు కృషిచేసి నాట్యవిద్యాపారంగతులై యున్నారు. బయస్కోపులకు పాత్రము లేరుటలో సరిగా దేహపరిమాణమును, పోలికను, పాత్ర మొక బాహ్యస్వరూపమును ప్రకటించువానినే నియమింతురు. పందలకొలది మహానటులు ఇంగ్లాండు, ఫ్రాన్సు, అమెరికా, ఇటలీలలో దొరుకుదురుగాన నుద్దేశించిన పాత్రలక్షణము లొప్పువానినే యాపాత్రధారణమున కుపయోగించుచు దురు. తరువాత పాత్రయొక్క ముఖవైఖరి సరిగ నేర్పడునట్లు మిగిలినదుస్తులు, ఆచారములు,

చారిత్రపరిశోధనముతో, సమకాలిక చిత్రమూర్తి శిల్పసాహిత్యములతో, ఇతిహాసముల వెలుగున బరిష్కరించి యమర్చెదరు. నటులు కథాసందర్భమును, పాత్రలక్షణమును చక్కగ చదివి వ్యాఖ్యాతలయొక్కయు, విమర్శకులయొక్కయు, మహానటులయొక్కయు భావముల గుర్తించి సాభిప్రాయముగ, రసభావపూరితముగ, ఔచితీసంపత్తి సిద్ధింప నాటకములోని ప్రతివాక్యము ముఖముద్రలందు అగుపడునట్లు అభినయింతురు. పాశ్చాత్యనాటకముల సర్వాంగసంపూర్తి మనదేశములో నెవరును సమీపింపలేకున్నారు. షేక్సపియరు నాటకముల యభినయములో పన్నెకెక్కిన రాబర్టుసన్, ట్రీ, టెర్రి, సరా బరన్‌హార్టు మొదలగు నటుల ననేకులనాట్యసిద్ధి సినిమా తెఱలపై పలుసందర్భముల జూచియుంటిమి. విక్టరుహ్యూగో రచించిన, "La Miserables"; స్క్రీవెస్కీ రచించిన "Quo vadis"; Last days of Pompey; East Lyne; Kenilworth; Ivanhoe; Tarzon of Tarascon మొదలైన జగద్విఖ్యాతగద్య ప్రబంధముల గాథ లనుసరించి వ్రాయబడి లక్షలకొలది పెట్టుబడితో ఫ్రాన్సు, ఇటలీ, అమెరికా, ఇంగ్లాండులలోని మహానటుల సన్నివేశమున నిర్దుష్ట పాత్రోచితితో నాడబడిన రసభావవ్యాఖ్యాన నైఖరు లనేకము లనేకపర్యాయములు చూచియుంటిని. అందరిలో నిటాలియాదేశపునటులు మహాసమర్థులని చెప్పవచ్చును. వీరిమూకాభినయములో పాత్రస్వభావము సంపూర్తిముగ నొప్పచుండుటయేగాక ప్రబంధములలోని వాక్యము లుద్దీపితములై స్పష్టముగ నగుపడుచుండును.

బయస్కోపువలన పాశ్చాత్యుల దుర్నీతి, వెకిలితనము కొంతవరకు జనసామాన్యములో వ్యాపించుచున్నమాట నిజమే; వారములపొడుగున ననేకాంకములుగ ప్రదర్శింపబడు ధూర్తపరిశోధకగాథలు, స్త్రీల లేవదీయుటలు, సారములేని హాస్యపుగంతులు మనదేశములో జనసామాన్యమునకు మిక్కిలి హానికరమని తలపక తీరదు. కాని విశుద్ధనాటకాభినయములో, ప్రసిద్ధగాథావ్యాఖ్యానములో, జగద్విఖ్యాతనటుల యభినయ కౌశల్యము తెరుకపరచుటలో బయస్కోపు తెంతయు నుపయోగించి భారతీయుల భరతశిక్షకు నూత్నవిలక్షణపరిణామ మేర్పరచుచున్న దనుటకు సందేహములేదు. పాశ్చాత్యమహానటులచే నభినయింపబడిన జగత్ప్రసిద్ధనాటకముల ఫిలిములు ఖరీదు విపరీతము. "లామెరాబ్లా" ఫిలి మొక్క ప్రతి రెండులక్షల రూపాయిలఖరీదుండును. అద్దెకూడ చాలావేలు మొత్తమును జేయును. అయినను వానివలనవచ్చుఆదాయము మున్నుకూడ హెచ్చు. మనదేశములోని నటులకు యీనాటకకథల ప్రసిద్ధప్రబంధముల ఫిలములను చూపించి నాట్యకౌశలములో పాశ్చాత్యులొందిన నిర్దుష్టాభ్యాససిద్ధిని మనదేశీయులకెరింగించుట మిక్కిలి యావశ్యకమై యున్నది.



# విషయసూచిక

## నాల్గవదశము: ప్రసిద్ధనటులు

## నాలుగవ దళము

# ప్రసిద్ధనటులు

### ఈవెన లక్ష్మణస్వామిగారు

నవీనాంధ్రనాటకరంగమున భావప్రకటనమందు ఈవెన లక్ష్మణస్వామిగారిని మించినవారు లేరు. రసపుత్రిగాంభీర్యమును తెలుపు రాచకళల్తో విశాలగాత్రము—భావతరంగప్రవాహమున పవనసంచలితమైన సాగరముఖ మేరీతి నాట్యముచు దుముకుచు నుండునో, అటులనే పలువికాసముల జూపగల ముఖారవిందము— క్రోధాగ్నికణముల నగ్నిపర్వతములవలె రాల్చి తరువాతి వాక్యాభినయములో శరచ్చంద్రికలబోలు చల్లని కరుణాకటాక్ష దీపికల నులికించు నేత్రయుగ్మము—ఔదార్యవిరాజసముల నైజవాహకమనదగు హిందీభాషయం దసమానవాగ్ధోరణి—నాటకపాత్రముల దేశాభిమానభరితోపన్యాసముల నాట్యయోగమున రసవంతముగ బ్రకటించు నాట్యకౌశలమేగాక భారతాభ్యుదయ మెల్లవేళల నుపాసించు దేశారాధనజీవనవ్రతము—రంగవిరచనమందును, భూమికానిర్ణయమందును, నాటకాభినయమర్యాదలందును నానాదేశనాటకనియమముల బరికించిన విద్యార్థికుల కందరాని నైజమనీషయు—పలువుర నాదరోత్సాహపూరితులజేయగల దీక్షాపరత్వమును—వీరి

గుణ శతకములోని ముఖ్యాంశములై యొప్పు లక్ష్మణస్వామిగారు బందరులోని నాటకాభినయమునకే కాక జాతీయజీవనమునకు కూడ వన్నె తెచ్చిరని చెప్పుటొకవింత కానేరదు. లక్ష్మణస్వామి గారికి సంగీతములో ప్రవేశము లేనందున, పద్యగీతములున్న నాటకములందు భక్తిశృంగారరసము లొప్పునట్లను వీ రవలంబించుచుండిరి. విక్రమార్కునితో నొకకాంత, పంతమూని గెలిచిన నాటకములో రాజవేషము ధరించి గద్యములో శృంగారాభినయము జేసిరి. ఈ వేషము రాచఠీవులలో రాజమర్యాదానువర్తనములో బెంగుళూరిలోని నాగేశ్వరరావు కొక్కనికే పోల్పదగినదని చెప్పవచ్చును. లక్ష్మణస్వామిగారు గద్యనాటకముల తొల్లిటియుపాసకులలో నొకడు. భావికాలపు భావాభినయముల సూత్రధారుడు. నాటకాభినయసూత్రములలో వీరి కలవడిన నైజప్రబోధములు పరాసు, ఇటాలియను నటుల దీర్ఘశిక్షను సమీపించుచుండెను. పద్యములు, మట్లు పేటికలవిగాకున్నను సభ్యులెల్లరు వీరి హిందీప్రవచనంబుల నాకర్ణింపు వేడుకతో వీరి సంగీతలోపమును పాటింపకుండిరి.

సుమేరుసింగు సింద్యోగధర్మనిగ్రహణమున రఘునాథరావుదస్కతుతో నానందీభాయి యందిచ్చిన శాసన మనుసరించి, పీష్వానారాయణరావును వధించెను. సుమేరుసింగు రజపుత్రుడు. "హర! హర! మహాదేవ" అనుమంత్రి మహర్నిశము లుపాసించు శివభక్తుడు. దయాళువు. మొగలాయిసామ్రాజ్య సంక్షోభమును జల్లార్చి, యాసేతుహిమాచలము హైందవరాజ్యలక్ష్మీ స్వరూపమును ముద్రించిన మహారాష్ట్రపౌరుష

మున కుప్పాంగు ధీరుడు. నారాయణరావు సద్గుణసౌశీల్యసౌకుమార్యముల దలపోసి, రాగల మహోన్నతిని దివాస్వప్నముల నవలోకించి సంతసించు దేశభక్తుడు. నారాయణరావు వధ వలన మహారాష్ట్రశిబిరములో గలుగనోపెడి పోరాటములను వానిచే భరతవర్షమున కేర్పడగల విపత్పరంపరలను గుర్తించు నీతివివేకి. తనశక్తికొలది యానందీభాయి నివారింపజూచెను. కాని రాచకొలువుకు మనోదేహముల నర్పించిన సేవకు డవశ్యము ప్రభుచిత్త మనుసరింపవలయునను సేవాధర్మధూర్వహుడగుటచే నారాయణరావును వధింప నియ్యకొనెను. వధానంతరము నిర్దోషియు,గుణరాశియు, బాలకుడును, మీదుమిక్కిలిమహారాష్ట్రసామ్రాజ్యమకుటమును నగు నారాయణరావును,విష్ణుతుల్యుడగు ప్రభుని వధించిన పాపానల మాతని మానస ముడికించసాగెను. దేశమునకు, తనకులమునకు, తనయుత్తరగతులకు, తానొనగూర్చిన ఘోర విపత్తునకు బలుతెరంగుల బలవరించుచు జేయునదిలేక యాత్మహత్య గావించుకొనెను. నారాయణరావువధ నవీనచారిత్రకములోని కరుణగాథయైనచో నేశివుడో, యేసిద్ధుడో వీరరసపూర కద్దపడి ప్రతికించి యానందీబాయికి తగుప్రాయశ్చిత్త మొనర్చియుండును. కాని యిది నవీనవిషాదనాటకము. ఈనాటకములో కరుణ ప్రభుభక్తి, దైవచింత, రోషావేశము, ధీరత్వము, కోపము, భీభత్సము, భయానకము కుప్పతిప్పలుగ మందులకొట్లు తగులబడినట్లు, తోకచుక్కలు రాలినట్లు, సుడిగాలితిప్పలకు తాటియాకులు రేగినట్లు, నిమిషమున కొకయూహాగా అడుగున కొక భావముతో నుదయించి, ప్రజ్వలించి,

బళ్లారి నటమానసమును, ప్రేక్షకప్రవృత్తులను, రసభావవిపరీత పరివర్తనములతో నూగించుచు జడుసుకు కలవరించుచు తల్లడించుచు, నవ్వించుచు తేల్చుచు బహువిధంబుల నాయాసపెట్టుచుండును. ఈభావపరంపరను, విపరీతరసోద్రేకమును, మాటలబలిమిచేగాక యభినయకౌశలముచే ముఖలక్షణంబుల ముద్రించి నయనప్రచారమున బ్రకటించి నటసార్వభౌమసత్కీర్తి గడియించి యాభినయించిన లక్ష్మణస్వామిగారి నాట్యకౌశలము భారతినటు లెవ్వరును పొందలేరు. గ్రహించి గవర్నమెంటు వారాడించిన విక్టరుహ్యూగో మహాకవికృతమైన "దురదృష్టవంతుల"లో కథానాయకపాత్ర మభినయించిన "యిటాలియను" మహానటు డొకడుమాత్రము లక్ష్మణస్వామిగారి యభినయరీతి నతిక్రమించియున్నాడని చెప్పవచ్చును. చెన్నపురిసుగుణవిలాససభలో పి. సంబంధముదలియారు అనూగోపాత్రపు నీచవృత్తుల నింతటిసౌకర్యమున ముఖముద్రలచే జూపగలిగెను. కాని సంబంధమొదలియారు ఉత్తమగుణవివేచనము దిట్టి సౌకర్య మనుభవింపకున్నారు.

లక్ష్మణస్వామిగారు తా మభినయించు నాటకకథల, నుచితరీతుల బరిష్కరించి కథారసభావముల యౌచితి చెడకుండ మానసమైజ మనుసరించి యాడించుచుండెను. దుస్తుల నమర్చుటయందును, రంగపరివర్తనము లెన్నగనేర్పించుటయందును వీరు నాటకవిమర్శకుల నందర మెప్పించుచుండిరి. స్థానము వేషమునకు భావభంగ మేర్పడకుండ లక్ష్మణస్వామిగా రవలంబించిన కథాక్రమము "ముగ్గురు పఠాను"లను వ్యాసములో విశదీకరించి

యున్నను. దివానుహాముశాస్త్రివేషమును స్వీకరించి వీరు చూపిన కౌలువునడతలు మైసూరు, బరోడా మున్నగు రాజసంస్థానముల మర్యాదలలవడిన నటులకే సాధ్యమగు రీతుల నుండెను. లక్ష్మణస్వామిగారు పెద్ద చదువులదారు లెరుగకపోయినను, నిజప్రతిభచే నుత్తమ నాట్యకళాలక్షణంబుల నెఱిగిన మేటిమనిషి. గద్యనాటకములచివర నటులలోని వాడయ్యును రాగల రంగరీతుల నూహింపగల నాట్యయోగి. బందరు కావ్యకళాచతురులగు మహామేధావులచే నలంకరింప బడి, నిఖిలాంధ్రావనీనాయకమణియై వెలింగిన కాలములో, ఈవెన లక్ష్మణస్వామిగారు ఆంధ్రిలదేగాక భారతీయుల యొక్క నాట్యసామర్థ్యమును ప్రకటించు కళాపతాకమై వెలుచుండెను.

—* నెల్లూరు నాగరాజరావుగారు *—

1916వ సంవత్సరపు గ్రంధాలయమహాసభ నెల్లూరులో గూడెను. అప్పుడు నాకీమహానటుని ప్రథమపరిచయ మేర్పడినది. ఆనాడీతడెట్టి ముఖవిలాసహాసముల నొప్పుచుండెనో ఈనాటి కవియే వారిముఖమున గోచరించుచున్నవి. నటులలో ముఖకవిళికను, ఆరోగ్యమును చిరకాలము నిలుపుకొనగలవారరుదు. ఈసందర్భములో యడవల్లి సూర్యనారాయణ గారిని, నాగరాజరావుగారిని ప్రశంసింపక తప్పదు. పాదుకా పట్టాభిషేకమందు దశరదవేషమును, చిత్రనళీయములో నల పాత్రమును ధరియింపజూచితిని. ఆనాడు ఆంధ్రనాటక పరిషత్తు

వారి నెల్లూరి పరీక్షలలో నీతడే నలాభినయమునకు మెప్పు వడసెను. 1923 లో ముత్తరాజు సుబ్బారాయనిచే గూర్చబడిన నాటకములలో వీరు "పఠాను" గను, దశరథుడు గను, అవల హిరణ్యకశిపుడుగను నటించి బందరు రసజ్ఞుల కమితానంద మొసంగుటయేగాక, బందరులో కనివినని ద్రవ్య సంపాదనకు కారణమైరి.

కొంచెము బొజ్జయున్నను చామనచాయ, చిన్ని కన్నులు, ముఖసౌందర్య మొకింత కొరవడినను నాగరాజరావుగారి విగ్రహ మందమైనదనియే చెప్పవచ్చును. పఠాను ప్రవేశమైన వెనుక నిద్దరు చివరతరగతి ప్రేక్షకుల సంభాషణ మాకర్ణించితిని. "ఆయనకు సంగీతమే కొరతగాని అదికూడా ఉంటే ఈ జిల్లాలో కాదు, ఈదేశములో యిటువంటి యాక్టరు లేదు." ఇది బందరు పామరుల యభిప్రాయము. విద్యాధికులు వీని నామోదించక మానరు. వేషము వేయువరకు నాగరాజరావు అనాడు నాటకమున్న సంభ్రమముగాని దానిలో ప్రధానభారము వహింపవలసిన భావాందోళనముగాని, పార్టు చింతనము జేయు పరీక్షాభిముఖ బాల్యలక్షణముగాని, యూవంతయేనియు జూపక మందహాసములతో, మాటముచ్చటలతో కలకలలాడుచుందురు. వీరి సామాన్యప్రవర్తనము యెడవల్లి సూర్యనారాయణవంటి యాత్మగౌరవ మొప్పుచు దంభరహితముగ తనకున్నదానిలో సంపూర్ణముగ సంతసించు నుదారమార్గము లంటియుండును. పాత్రభూమికాలక్షణమును సంపూర్ణముగ నెరిగి, సత్వరముగ ధరించి, మిన్న కొకమ్మాల

కూర్చుండి పాత్రస్వభావమును తనలో తాను చింతించుకొనుచుండును. ఏ రభినయించవలసిన నాటకస్వరూపమును, అందలి రసభావ కథాప్రసంగమును చిరకాలమూహించి గద్దెనెక్కెడి యలవాటు కలవారు. నాటకము జరుగునపు డొకరితో సంభాషణాదుల జత్తవిధ్రమ మేర్పరచుకొనక విశ్రాంతిసమయములలో నైపట్టు రసావేశ మనుభవించుచుండురు. వేషవ్యవహార మంతయొందినంతనే చివాలున నాట్యయోగ ముపసంహరించి సామాన్యలలితహాసములతో మిత్రుల నెమకొనుచుందురు. పరానుభీకరభీభత్స మభినయించిన యుగ్రవస్త్రరౌక నిమేషములో సామాన్యవైఖరి దాల్చుచుండును. లక్ష్మణస్వామిగారిని 'వేషావేశకాలమందు మిమ్ముల నెమకొనిన మీరెట్లు వర్తింతు'రని నేను ప్రశ్నింపగా నాసముద్రములో నెవరినైన పొడిచినైతునని జవాబిడిరి. లక్ష్మణస్వామి నాటకరస భావముల తన్మయత్వ మొందుచుండెను. నాగరాజరావు రసభావముల శాసించు నాట్యయోగి. పాత్రముల ప్రత్యేకగుణమర్యాదల నెరింగి వాని నభినయించుటలో సర్వాంగసౌందర్య మొప్పుదారుల నడువగలప్రోడ. ముఖమునందలి కండగుంపులన్నియు వశ్యలై భావతరంగముల నర్తించుచుండ నవయవములు వయోరసానుకూలమగు భంగములవ్రేల నొల్లగ, నవి చారితముగ, నైజముగ, స్వతంత్రముగ పాత్రమర్యాదల గమనించి నాటకకథావ్యాఖ్యానవైఖరుల విస్తరించుచున్నవి.

నాగరాజరావుగారికి సంగీతపరిజ్ఞాన మున్నదికాని గాత్రమాధురి కొరంత నాదరించని లోపమొక్కటే వీరినాట్యసా

మ్రాజ్యమూర్ధాభిషేకము నడ్డగించుచున్నది. వారి నెల్లూరియా న యుచ్చనీచజనుల కొకింత వింతగా దోచకపోదు. కాని నాటకములందు రసాభినయమే, పాత్రౌచిత్యమే ప్రధానాంశముగ నెంచు సభ్యులకును, నానా ప్రాంతముల ఆంధ్రభాషోచ్చారణా వికారముల గుర్తెరిగినవారికిని, ఈలోపములు పరిగణింపదగినవిగ నగుపడవు.

నలనాటకపు మొదటిభాగము కొన్నిచిక్కులతోగూడియున్నను దమయంతీస్వయంవరపు కళ్యాణఘట్టము లాపట్ల సంతోషప్రాంతముగ జరుగుచున్నవి. రెండవభాగము శాంతిమైనను బాహుకశోకపటలితో మలినమైయున్నది. "ఈపువైభవమెన్న నదులితము" అనుచు నలుడు ప్రవేశించుపట్టున, ప్రసాదరావుగారి యడుగులపోకడ నాగరాజున కందలేదు. సూర్యనారాయణరావుపోకడలు వీరియం దగుపడవు. శృంగారరసము వెకిలిచూపుల, వంకరనగవుల, రాజవేషపుకోరమీసముల సాధనచే సులభముగ ప్రకటింపదగినది కాదు. శృంగారాభినయము సులభమని, కన్నుకొట్టి కాంతను దొంగిలింపవచ్చునని, భీభత్సరస మన్నిటిలో కష్టమని కొందర భిప్రాయపడుచున్నారు. విరశృంగారచేష్టలు, ప్రణయభావప్రకటనము ఉత్తమపాత్రముల కసహ్యమైనదిగాన, శకారుని నైజరీతుల ననుసరించును. దుష్యంతుడు—సమస్తాశాంతరాజ్యరమానాథుడు—వలచినది శాపానుగ్రహశక్తియుక్తుడగు కణ్వమహర్షిపుత్రిక. నలసార్వభౌముడు "నిర్మలనిజకథానిమిషకల్లోలినీ, క్షాలితాఖిలజగత్కల్మషుండు; వితతనవద్వయావ్యాపనానాజయ శ్రీవధూ

టేసమూశ్లిష్టభుజుడు." దమయంతి శుద్ధాంతకాంత! ఇట్టివారలకు గలుగు ప్రణయసంభాషణము ప్రథమసమావేశమున వ్యంగ్యము ర్యాదల ననుసరించి కడు జాగరూకతతో నడుపవలసియున్నది. మాటల నుచ్చరించు కాకుస్వనులచే నేత్రవికాసముకన్న, నేత్రోన్మీలనముచే భావప్రకటనముచేకన్న భావగోప్యముచే నాయికానాయకుల ప్రణయానుభవము సూచింపదగును. "ఆడు కలకల నవ్వాక, కన్నెత్తిచూడాడు" అనేయాలపాట విలసనము లుత్తమనాయకుల శృంగారానుభవనివేదనము నందుపయోగింపగూడదు. నాయికానాయకు లెంతవరకు తమభావముల దాచి యెదుటివారి యభిప్రాయముల గుర్తింపనెంచెదరు. నాగరాజరావుగారు నలపాత్రమును యుదారమహోధవ గుణజాలమును చెన్నగ బ్రకటించినను చిరునగవుకేళకులోననమున ప్రియవేష్టి బరచుచుండినను శృంగారరసోపన్యాసములగూఢ వైఖరులందు వీరు ప్రసాదరావునకు సూర్యనారాయణకు వెనుకటివారేయని చెప్పవచ్చును. తమిళనాయకులు వెకిలిచూపులకు శాకోరులని చెప్పవచ్చును. కర్ణాటనాయకుల రాచబిగిప్రకట్టులలో ప్రణయానుభవముల అంగవైకల్య మగుపడదు. కన్నడభాష కస్తూరియనదగినను గుబ్బివారల మాత్రవిన్యాసమాదు వికారహ్రస్వమొంది భక్తశృంగారరసపారవశ్యమును తెలుగంత తియ్యగా జూపకున్నది. పార్శీనటుల కార్యలీలలలో వంగీయభాషాక్షరస్వరాభాసములలో తెలుగునకుండు ప్రేమసత్వము గోచరింపదు. సింగలీభాష యొకటియో చాలవరకు తెలుగును పోలి శృంగారవాహకముగ నుండును.

మళయాళములో ననఁగున భాష నొక విజయసాధనముగ నుపయోగించుచున్నారు. పరశురామావాసముల పరిణయలేఖల ను శృంగారసంభాషణములను గొన్నిటి చూచియున్నాను. వలపుతలంపు లాపములకు నింపులో గోతలగుచున్నవి. తమిళశబ్దార్థ మాదమైనను తమిళభాష గర్భనిర్భేదమొనర్చు గడబిడ గొణ గొణమై యువతీజనంబుల నానందపరచజాలకున్నది. అరవ మధ్యాహ్నము. దీనాలాపముల దేవునకర్పించుటకు సన్నని జాలి గొంతుకతో శివాలయముల చీకటిమంటపములందు సంధ్యాప్రశాంతమున పాడబడు "తేవా" చరణములు నిర్జీవ నిరుత్సాహ వినమ్రోచ్చారణతో భక్తిదైన్యమును జూ పగలవు. కంబరామాయణములోని పద్యములు శైవసాం ప్రదాయముల మాతసూక్తులు, తమిళ భాషగొలుక్కు నైజవినయ మును ప్రకటించుచున్నవి. పరతత్త్వవిచారణలో దారి తెలియక నాశావిముక్తియై "తీర్థ స్వరం మోహా దుడుపేనాస్సిపాగర్" అను ప్రజ్ఞావిభంగమును సూచించుచు "అందజాలని పండ్లకోస ము అఱ్ఱుసాచితి" యను బుద్ధిలేమిని గాంతించుచు చాటుకవిత్రిం చిన "అప్పుడు తెలియెనె!" యను బొమ్మలోని యాంధపాంథు నకు లభించిన తెంత్రిసినాదనేతృత్వ మైనను దొరుకని నిర్విణ్ణ మానసము జూపట్టుచ నమ్రులై తమిళభక్తులు దీనాలాపముల కలవిమ్మగు నరవభావలో హృదయాంతరాళములు జల్లుమను చల్లని శాంతిగీతికల నేర్పరచియున్నారు. మిగిలిన రసము లన్ని టికి అరవభాష నిరుపయోగము. దీనిలో నాడు నాటకములు, పాడుకీర్తనలు దుస్సహాపశబ్దింశములని చెప్పవచ్చును. తెలుగే

సత్ప్రభావాలవక్రమమున రంగస్థల మవతరించిరి. లక్ష్మణస్వామి గారు యుంగువసాహేబురీతి నగుపడెను. రాఘవాచారి నటన కొంతవరకు నాగరాజరావు అభినయమందు గోచరించు చుండెను. ఆసాబీకి సభాపరాభవము జరిగినప్పుడు నాగరాజ రావు స్త్రీవంచన మెఱుఁగనిజాలక యోరమోమిడ పరాను రక్తముపొంగి నైజస్వభావమును వెల్లడించినట్లుగా సకల్ప రహితముగ నాతనికరము కరవాలమున వ్రాలి యొకింత దూసి మరల పరిస్థితులవెలుగు నంది యొరలో నాకత్తిని తోసివైచెను. ఈపట్టున నాగరాజరావుగారు ప్రకటించిన యవ్యక్తమానసనిస్సంకల్పవ్యాపారములు రసజ్ఞుల నెంతయు మెప్పించినవి. ఉషాపతితో నుద్యానమున జరిగినసమర విహారసమయములను, అప్పుడుదయించు భావపరివర్తనముల ను ముఖభావలోకనముల సత్వరవిపర్యయములతో చక్కఁగ బ్రక టించియుండిరి. రాఘవాచారి శాంతశృంగారరసముల మేటి నటుఁడు. రామదాసుభూమికను ధరించి యభినయించునపుడు రాఘవాచారి పొందిన పాత్రస్వభావసారూప్యము పరానుభూ మికలో నగుపడలేదు. సుగుణవిలాససభవారి సరసాలంకృత రంగపరిసరంబుల రామచంద్రుని సుకుమారసౌందర్యమూర్తి కెదురుగా శృంగారాభినయ మొసర్చునపుడు రాఘవాచారి మిక్కిలి చక్కఁగా దోచెగాని మూతసి బ్రాహ్మణవర్చస్సు పరానుభూమికలో మఱుఁగువడియుండలేదు. రామరాజ్యవినాశ నము తొల్లిటినుండియు ఘోరసంకల్పములతో నీర్ష్యలతో మాయాప్రవృత్తులతో నిండియుండిన కథాంశము. విషాదము,

వైరము, సమరము, సాహసము జూపు చారిత్రనాటకము, వేణీ
సంహారమందు శిబిరవాత్రియులనుండి సమరభేరీశంఖారవము
లాకాశమాక్రమింప మదాంధుడగు దుర్యోధనుడు భానుమతీ
సదనమందొనర్చిన ముద్దుచేత యెంత పరిహసింపబడినవో! రామ
రాజ్యవినాశనపు విషాదగాథాగర్భమున నొకజంట సరసల్లాప
ము లాడుకొనుటయు నంతె లక్షణవిహీనముగనే యున్నది.
మాలినీ పరిసరాశ్రమంబుల ప్రశాంతోద్యాననికుంజములందు
శకుంతలాదుష్యంతుల కొప్పునట్టి సింగారంపు తలపులు విద్యా
నగర శిబిరాంగణంబున మొలకెత్తనేరవు. రాఘవాచారి
వసంత సుమాలంకృతమైన పరిస్థితులలో కా తనువరించిన రీతి
నభినయించెను. లక్ష్మణస్వామి ఈసట్టున మహమ్మదీయ శుద్ధాం
తమొందిన పరాభవ మాషాబీతో ముచ్చటించి సమరదీక్షను
ఒంపరచుకొనెను. నాగరాజరావు విజయనగరము ప్రవే
శించినది మొదలు పఠానున కేర్పడిన హిందూరాజ్య వినాశ
సంకల్పము కాంతాసమాగమమున విడపలేదు. రామ
రాజు తనతండ్రి తనుమాట నప్పటి కెరుగకుండినను తిన్న
యింటివాసముల లెక్కించు వైచ్యము మహమ్మదీయ మతాభి
మానముతో మారొగ్గనుచు శక్తిలేమికి చేష్టారాహిత్య
ముచ్చరచి యొకవిధమగు పరాకు నేర్పరచినది. ఈపరాకును
నాటకమంతయు వ్యాపించియున్న విషాదతత్వమును మసువక
నిషిద్ధానరసములచాటున మబ్బుకమ్మిన దీపకళికలవలె, తెర
చాటు బొమ్మలాటవలె, స్వప్నవ్యాపారములవలె నాషాబీతోడి
శృంగార మొంతయో నయముగ నభినయించెను. నాగరాజ

రావుగారి నాటకకథానుభవము, ఔచితీపరిజ్ఞానము నవీననటులందరిలో ప్రసిద్ధమని జూపరు లభిప్రాయపడుటలో వింతలేదు. పఠానుని వీరభీభత్సముల నభినయించుటలో వీరు లక్ష్మణస్వామికి తీసిపోలేదు. కండ్లు చిన్నవైన నుగ్రాగ్నిలోకనజ్వాల లంకురింపజేయుచు ముఖముద్రలెల్లయు రసావహమై దోచుచుండెను. తలలేని తండ్రి మొండె మాతని భావోన్మత్తమానసవీథియం దమరినపుడు శ్రీనివాసరావుగారు,

"Is this a dagger that I see before me?
Come, let me clutch thee, I see thee not-
A dagger of the mind, a false creation,"
"Out you bloody spots!"

అను షేక్సుపియరు వాక్యముల ననువదించుచున్నపుడు జూపరుల కద్భుతమై పఠానుమతిభ్రమమొనర్చు రామరాజపిశాచము నగరాజరావుగారి పిశాచవైఖరులందు స్పష్టమగుచుండెను. లక్ష్మణస్వామిగారు మనోరంగములతిప్పి నీచస్వార్థమును ప్రకటింపలేకుండిరి. రాఘవాచారి యాత్మకథాసంకల్పమును లెస్సగ నందుకొనినను వీరభీభత్సముల బాగుగ ప్రదర్శింపలేదు. నగరాజరావుపఠాను వేషము కథాపరిమితులలో చక్కగ నిర్వహింపబడినదనియే చెప్పవచ్చును.

కృష్ణమాచార్యులుగారి పాదుకాపట్టాభిషేకమును నెల్లూరులో గ్రంథాలయసభ జరిగినపుడు నాగరాజరావుమున్నగువారభినయించిరి. ఈమధ్య బందరులో నద్దాని మరల జూచితిని. కొన్ని సందర్భము లనుకూలింపమిచే బందరుప్రదర్శనమందు

నగరాజరావుగారి యభినయసౌష్ఠవము నెల్లూరులో ఒప్పించిన రసభారమును వహింపకుండెను. అసలు ఈనాటకము ప్రదర్శనార్హమైనదికాదు. రామునిపితృవాక్యానువర్తనమందు ఆనాటి సాకేతవాసులకుగాని ఈనాటిప్రేక్షకులకుగాని యెట్టిసందేహములేదు. రాముడు తనమాటనంగీకరించునని దశరథు డెరుగును. రాముడు తిరుగబడి పితృశాసన ముల్లంఘించి కోసలరాజ్యాధిపత్యమాక్రమించునను భీతి మంథరకుగాని, కైకకుగాని యెన్నడు కలిగియుండలేదు. దశరథుడు పెద్దకొడుకుమీది మోహమున వార్ధక్యదౌర్బల్యమున తానిచ్చినవరము లుపసంహరింపడని కైక యెరుంగును. నాటకమందలి ప్రధానపాత్రములందేవిధమైన భావపరివర్తనముగాని యాంతర్యసంక్షోభముగాని పొందలేదు. కథలో యేవిధమైన భంగపాటు, భావచేష్టావైపరీత్యము, అచింతితపరివర్తనము జూపలేదు. అందుచేత సీతారామ దశరథులలో నెవరును నాటకనాయకులు కానేరరు. వలపులకుప్పయగు చక్కదనాలచిక్కయగు కైకకు మచ్చింతలేపనుట దశరథునకెట్టులో ప్రేక్షకులకుగొందరి కట్లులే యచింతితభావపరికాశముగ నగుపడవచ్చును. కాని స్త్రీబుద్ధియందలి యాశాకార్శ్యముల నెరుగనివారు లేరు. సవతితల్లి, యీడేరిన కొడుకుగలది, కలుపులచే మగని యొప్పింతునను నమ్మకముగలది కైక యిట్లుపరివర్తించుటయం దెట్టియలౌకికసందర్భము కనుపడదు. అట్లుచేయకుండుటయే సామాన్యస్త్రీస్వభావమునకు విరుద్ధమగును. విషదింతగల కైకగర్భమున సుదారభావభరితుడగు భరతు డుదయించుటయు హస్తగతమైన రాజ్య

లక్ష్మణుని భాతృవాత్సల్యమున విడనాడి రామపాదుకప్రాప్తా నిబద్ధధ్యానసుడై, జడధారియై రామునిపేర రాజ్యమేలుటయు నీనాటకములోని రెండవ యుచితాంశముగ నెంచవచ్చును. భరతుని ప్రవర్తన మలౌకికమనుట నిజమే. కాని భరతుడు కైకయందు జనించినను యిక్ష్వాకువంశములోని నిర్మలోదార గుణముల వారసుడై యున్నాడు. "యమవతామవతాంచ ధురిస్థితః" అని పేర్కొందిన దశరథుని పుత్రుడు. పుత్రకామేష్టియాగప్రసాదాంశమున రామునివలెనే జనించినవాడు. ఇట్టి జననసంప్రదాయము గొప్ప భరతుడు యింకొకవిధముగా ప్రవర్తించుటయే నైజస్వభావవిరుద్ధముగ నుండును. మంథర కుబ్జ. దాసి తన యజమాని యొక్కరితువస్తే తానుకూడ బాగుపడుదునని యాశపెట్టుకొనినది. అది కాక యీమెకు భరతునిపై మోహముండినట్లు కథలో సూచింపబడినది. స్త్రీ చిత్తమగాధమైనను మోహవల్లరి యుభయుల చేష్టాపరంపరలచే నల్లన వికసించునదై యొకరియం దెక్కువగ నుండినను రెండవపక్షపు మనోవాక్కార్మల పోషణపై నాధారపడియుండును. భరతుడు మంథర కిట్టి మోహభావ ముదయింపజేయు నాశాబంధముల గల్పించెనని నమ్మజాలము. మరియు కైక దాసియై చిన్నటినుండియు భరతుని యాదరించుచుండిన మంథర కాతనిపై మాతృభావమునకు బదులు మోహావేశమేర్పడుట దుస్సహముగను విపరీతముగను దోచక మానదు. ఇందుచేత నీనాటకములోని యందు నిజగుణానుకూలముగ కథాక్రమమున భావవిపర్య

యూ మేదియు నొందక పరివర్తించిరి. దశరథుని కైకకు వరమిచ్చుటలో నేర్పడిన నాటకబీజము రాముని వనవాసదీక్షావలంబనములో ఫలసిద్ధి బొందెను. ఆవలికథయంతయు వ్యర్థము. గంటలో నాడదగిన కథాంశమున నైదుగంటల గ్రంథవిస్తరణ మొనగుటయే కృష్ణమాచార్యులుగారి పట్టున నొనర్చిన పెద్దతప్పు. అనుచితకావ్యవిస్తారమునను, భావవైపరీత్యమును లేనందునను అచింతితావస్థలేర్పడమియు నీనాటకము లక్షణవిరుద్ధమై ప్రదర్శనానర్హమై యున్నది కలికాలపు మూనమానసులే వయసు చెల్లిన వెనుక చిన్నపెండ్లము జేసికొనుటకు సందేహించుచుండ త్రేతాయుగ ధర్మప్రవర్తకుడు, "వార్ధకే మునివృత్తీనాం" సంతతిలోనివాడు దశరథుడు చిన్నపెండ్లము చేకొనెనని గ్రహించుటనన నమ్మజాలము. భార్యలు ముగ్గురు దశరథుని చిన్నతనములో స్వీకరింపబడినవారలే. వివాహగ్రహణకాలములలో ముందు వెనుక లుండినను రాముని జననకాలమునకు అరువది వేంయేండ్లు దశరథ జాతకము నడచిన ట్లగుపడుచున్నది. "షష్టివర్షసహస్రాంతే జాతోऽయం మమ కౌశిక। దుఃఖేనోత్పాదితశ్చాయం న రామం నేతుమర్హసి." వర్షమనగా దినమని ప్రొఫసరు రంగాచారిగారి నిర్వచనమంగీకరించినను రామావతారోదయమునకు 170 సంవత్సరములయినను దశరథునకు జెల్లియుండును. ఇట్టి వయసులో చిన్నపెండ్లాముండుట యసంభవము. "అనిన మాటను దప్పుటను చితంబనిగదా దశరథుడు కాలధర్మమొందె" ననువాక్యమే నిజముగ కనుపించుచున్నది.

నగరాజరావు పఠాను వేషమును ధరించినపుడు వయోరుచుల వీనెడు తరుణయువకుడై గనుపించెను. దశరథభూమికను దాల్చినపుడతని ముఖాంగములు తురీయావస్థను బైజమగు శైథిల్యమొందియుండెను. అంగవార్ధక్యమునకు సహజపరిణామమగు మతిభ్రంశము, దీక్షాదౌర్బల్యము, చీదర, ఉపాయశూన్యత, ప్రేమాతిశయము, తొందర మొదలగు మానసిక లక్షణములన్నియు నగరాజరావుగారి యభినయమునందు పోలు పొందియుండెను. వయోవృద్ధుని యంగశైథిల్యమే గాక చింతాక్రాంత ముఖలక్షణములేగాక మానసికగుణవినాశము కూడ వీరియభినయములో జక్కగ ముద్రింపబడియుండెను. రాముని పై ప్రేమ, వియోగమందలి కష్టము వాగ్దానపరిపాలనాపేక్ష కలవరపెట్టుచుంట, దారిగానని వృద్ధాలాపములు నగరాజరావుగారిచే సైరీతుల నభినయింపబడినవి. రాముడు వెళ్ళిన వెనుక దశరథుడొందిన మనస్తాపము, శోకభారము, దుఃఖతరంగపరంపరలలో నాతని శేషజీవము మెల్లగ మునిగి కొట్టుకొని మత్తుమందు పీల్చుచున్న శస్త్రరోగివలె క్రమముగ వాక్శూన్యుడై, చేష్టారహితుడై, నిర్జీవుడై చల్లబడుటయు పుత్రోదయమున కెట్లు పరితపించెనో పుత్రవియోగమున నట్టులే పలవరించి యసువుల నూదిగైచుటయు నిరుపమానముగ నభినయింపబడినది. పాదుకాపట్టాభిషేకమందు నాట్యవైఖరుల కవకాశ మెక్కువ లేకున్నను, హరికథ కుపయోగించువిషయము రూపకరూపమున దుర్వ్యాప్తినొందినను బలశీలసమన్వితుడగు దశరథుడు ముక్కాళ్లముదిమిలో అనుభవించిన రస

భావవిప్లవము చక్కగ జూపించి పాత్రస్వభావముతో నైక్య మొంది, నగరాజరావు కొంత రసవైభవ మీనాటకమున కేర్ప రచియున్నారు.

ప్రహ్లాదచరిత్ర భారతీయుల భక్తిగాథలలో నెల్ల ప్రసిద్ధమై భారతిజాతీయధర్మమగు సహింసావ్రతము "పొడచిన దిట్టిన కొట్టిన, పడుచుందురు పరమభాగవతులు... తా రొండబడరు మారు సేయఁగ" ననుసాధనక్రమమును భౌతిక పారమార్థిక విభూతులభేదమును జూపు నుత్తమకావ్యమై యున్నది ప్రహ్లాదుడు హరిపూజానిబద్ధమానసుడై "లభ్యంబైన సురాధిరాజపదమున్ లక్షింప డశ్రాంతమున్." నిఖిలభూతములందు నొక భంగి సమహితత్వంబున బరగువాడు, విష్ణుసేవాదోషమును వారించ దండ్రి దుస్సరశిక్ష ననుభవింప జేయ "పారడు లేచిచిక్కులకు, బాహువు లొడ్డడు, బంధురాజిలో దూరడు, ఘోరకృత్యము నిదూరడు తండ్రిపై, మిత్రవర్గము జీరడు .....కావరే యనడు, భయకంపసమేతుడు కాడు." ఇట్టి నిశ్చల నారాయణపాద భక్తి నుద్దీపించుమానస మాప్రహ్లాదునిది.

హిరణ్యకశిపుడు వేల్పుపెద్దను కొలుచునపుడు "అదిరెఁ గుంభిని పాదిత్రయై, కలగె నే దంభోనిధుల్." తపఃఫలితముగ "లోకములన్నియున్ క్షణములోన జయించినవాడు" ఇంద్రియనిగ్రహము, బలపరాక్రమములు కలవాడు. విపులమైన త్రిలోక సామ్రాజ్యమును సంపాదించి ద్వంద్వభావములతో గదలుచుండెను. ప్రహ్లాదజనకుడు చక్కనిసంస్కారి. విద్వాంసుడు. ఐశ్వర్యవంతుడు. తన తెలివితేటలతో జగమునంతను నింపగల

మహోపేముద్ధుడగును. ఇట్టి రాచకట్టికి నైజముగ లలితసద్గుణమ్ము లమరియుండును. రాజులకు, అందులో విజరీతిపరిభావమున భువనైకచక్రవర్తు లగువారికి; నవరసములు సంస్కారిసాధుత్వముతో నొప్పియుండును. చక్రవర్తులు కోపగించు, శోకించు, ప్రేమించు, ముద్దాడు దారులు నీతిమర్యాదలవంటి వీరపరిభులక్షణంబులు జాటుచు సామాన్యమానవుల చర్యలకు భేదముగా నుండును. అహంకార మప్పుడప్పు డుప్పొంగినను రాచపోకడలు వ్యంగ్యముగను లలితభావాలంకృతముగను కనుపించును. సామాన్యముగా హిరణ్యకశిపుని గుణాభినయ మవలంబించువారు వివి నోకకూరరరక్కసిగ నెంచుచుందురు. ప్రహ్లాదచరిత్ర కంసుని వంటి దుర్మార్గుని పాపపరిణామమును తెలుపు నాటకముగ నెంచదగదు. ఇవి లౌకిక వైభవములు, పరమార్థచింతకు విరుద్ధములన్నియు, భౌతికైశ్వర్యవిభూతి పరతత్త్వజిజ్ఞాసకు సరిరాదనియు, శీలమర్యాదలు భక్తికి తోడుగావనియు, యెన్నిశక్తులున్నను పరమేశ్వరునియాన దాటి నడువనేరవనియు, ధర్మస్వరూపమగు కాలచక్రమును లక్షింపక నహంకారపరిమత్తుడై దిరుగువా డధోగతి జెందుననియు బోధించునాటకము కాని బొబ్బలిడు జగలరక్కసులు, పద్మలోచను బోరాడు సమరవర్ణనము కాదు. నాటకములో లౌకికవైశ్వర్యశీల మర్యాదలకును, భక్తిజ్ఞానవైరాగ్యములకును పొసగు పోరాట ముద్దేశింపబడినది. హిరణ్యకశిపుడు మర్యాదలెరింగిన చక్రవర్తిగా నగరాజరావు గుర్తించి యభినయించి యున్నారు. వీరి గాథావ్యాఖ్యానము నేను చూచినవాటిలో నెల్ల ముద్దుగ

యున్నది. భాగవతములో హిరణ్యకశిపుడు "లీలోద్యానముల తా నివాసములలో లీలావతీయుక్తుడై హాలాపానవివర్ధమాన మద రోషాయత్త తామ్రాక్షుడై కేళించెదె" నని నారదుడు చెప్పు చున్నను హిరణ్యకశిపుడు సంస్కారికృహస్థపద్ధతుల నడచు వాడన్నదియే మా నమ్మకము. ఇట్టి రాచనడవడి నగరాజునందు మూర్తీభవించి యుండెను. ప్రహ్లాదుని జేరదీయునపుడు నోటిమాట లెట్టివైనను లోనియుక్కువ తెలియునటులను ప్రేమసూచకంబులగు తండ్రిచేతలు సంకల్పశూన్యముగ, నైజముగ, వచ్చినట్లును చిత్రముగ నభినయించి యున్నారు. నగరాజరావు గారు హిరణ్యకశిపు నొక బలమదమత్తమస్త దైత్యునిగ నెంచక పుత్రునితో నభిప్రాయభేదముగలిగి ప్రేమించుచు వారింపబూనెడి సామాన్యమానవునిగ చిత్రించి ప్రహ్లాదగాథను దేవదానవవిరోధకాలమునుండి కలికాలపు నిత్యజీవనములోనికి దింపియున్నారు. బహుమందినటులు హిరణ్యకశిపుని దొల్లిటినుండియు ద్వేషపూరితునిగ నూహింతురు. కాని రక్కసి మేటియు నరులవలెనే ఆశాబంధములతో 'ఏమో యేనాటికైనా బాగుపడకపోతాడా? వాడికేం తెలుసులే, చిన్న పాపగట్టు! ఆ! స్నేహాలు, స్నేహాలువల్ల చెడిపోతాడు" అని ఊహించు తండ్రిగా సంకల్పరహితముగ పుత్రగాత్రపరిష్వంగ సుఖంబులందును తప్పులిపడక పుత్రునిమేలుకోరి వైరాగ్యవృత్తిని మాన్పించి శూరాధిరాజపదవిసమర్థునిగ జేయు వేడుకతో నలంగినట్లును, పుత్రునిదుర్నివార్యవాసుదేవానురక్తి కలిగినట్లును, పుత్రద్వేషము క్రమముగా విషతుల్యమైనను పుత్రవా

త్సల్యభావపరిబోధము లామానసము పీడనట్లును చక్కగా నిర్దుష్టముగ భావగర్భితముగ నభినయించిరి. తుదకు స్తంభనిర్భేదసమయమున హిరణ్యకశిపుడు మహోగ్రప్రతాపమున బరిఢవిల్లినట్లు నగరాజరా వభినయింపలేదని కొందరాక్షేపించిరి. కాని శిక్షలన్నియు నిష్ఫలములై తనత్రిలోకాధికారశాసనము శక్యమై ప్రహ్లాదభక్తియే విజయమొందినపుడు "ఖండించితి వార్ధులన్......ధిక్కరించితి, శపించితి, ఘోరదవాగ్నులందు ద్రోయించితి, పెక్కువట్ల నలయించితి జావ డిదేమిచిత్రమో" అను శంక హిరణ్యకశిపునియంద మాక్రమించి నిస్పృహ గలిగించుచుండెను. రక్కసిరాజంతటి విష్ణువిరోధియయ్యును లౌక్యుడు. నీతికోవిదుడు. స్వబలపరబలవిజ్ఞాత. తనప్రయత్నములన్నియు నిష్ఫలమై విరోధసంకల్పమభ్యుదయమొందని విపరీతస్థితికి గల కారణమరయు వివేకి. స్వకీయమేధాబలైశ్వర్యమాయాపరిభావమున నహంకారమాయల్లను నెల్ల వశపరచుకొనియుండెను. ఇవియన్నియు భక్తిప్రభావమున కోడి నిష్ఫలమని తోచినంతనే హిరణ్యకశిపుని యహంకార మంతరించెనని చెప్పవచ్చును. అహంకారపటలము శంకాతరంగముల తాకిడికి జిక్కి చెదరినపుడు ఆత్మపరిబోధములు మానసవీధి నుద్దీపింపదొడగును. ఇప్పట్టున హిరణ్యకశిపునకు పూర్వదేవతాసంస్మరణ మంకురించెను. అట్టిసందర్భములలో నటుడు సర్వజ్ఞుడై నిస్సహాయుడై భావసంక్షోభమున ముగ్ధుడై యహంకారరాహిత్యమున చేష్టారహితుడై నిలచుటయే నైజమగు అవస్థ. దీనినిక్కమెరింగి నగరాజరావు సందర్భానుకూలమగురీతి నభినయించెను. మరియు నృసిం

హావతారఘట్టమునందు భౌతికశక్తులన్నియు పరశక్తిచే నిర్మూలింపబడినవి. పరతత్త్వప్రభావమును, భౌతికైశ్వర్యదౌర్బల్యమును చాటు సందర్భ మొక విశ్వవిలయముగా నుండనోపును. జగద్విలయములు కలుగబోవునపుడు కొన్ని విద్యుచ్ఛక్తు లుద్భవించి జనుల మూర్ఛిల్లజేయుననియు గ్రహసంఘట్టనాది మహావిలయసంక్షోభమును భూజను లనుభవింపనేరరనియు నొకమారు ప్రకృతిశాస్త్రముల యాధారమున జెప్పియుంటిని. నృసింహావతారసందర్భములో విశ్వరూపప్రదర్శనము జరిగినప్పుడెల్లను మహాతపస్వులగువారు తక్క తక్కిన జనంబులావిలయ మెరుగకుండిరని భాగవతాదులలో నున్నది. ప్రహ్లాదుడు మూర్తి నారాధించెను. హిరణ్యకశిపుడు మూర్ఛనొంది మడిసెను. భక్తిసాధనకు భౌతికాహంకారము లోబడి మృగ్యమైనది. ఇచ్చట నగరాజరావు ఉచితముగ నభినయించెను. వీరివేషము లన్నిటిలో గాథాసంప్రదాయములు, సందర్భములు నిర్దిష్టముగ బరికించి మానసవ్యాపార వైఖరుల గుర్తించి పాత్రసారూప్యమొంది రసవిచక్షణతో, నాత్మనిగ్రహముతో, ముద్రానైపుణ్యముతో నభినయించెడి నటరాజరీతు లేర్పడియున్నవి. సంగీతమొకటి కొఱన్న మన్నింపవచ్చును. "ఏకోహిదోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః"

## —* మాగంటి సుబ్బారావుగారు *—

వీరు బందరు గొడుగుపేట కంపెనీలో నాగలింగము గారితోకూడ నభినయించుచుండిరి. వీరిని నేను స్వయముగా

నెరుగను. ఒకమారు హరిశ్చంద్రపాత్రమును ధరియింపఁ జూచితిని. వీరు సరసులనియు, సంగీతనాట్యకళానిపుణులనియు కైతలల్ల నేర్చిరనియు, "పాణిగృహీత" విఖ్యాతి గాంచిన నగరాజకుమారికకు యొజ్జలనియు వినుచుంటిని. నాజ్ఞాపకమునుబట్టి వీరి ముఖబింబము మైసూరు వరదాచారిని బోలియున్నది. అభినయసంగీతములుకూడ సరసముగ నటులనే యుండెనని నాతలంపు.

—* బందరు హాస్యగాండ్రు *—

చిపురుల కృష్ణయ్యంతులుగారి శిల్పనైపుణ్యము మా నాయనగారిభవనము దగిరనై నిలచి యున్నది కాని వీరు బందరు పౌరులను పక్కలుబ్బ నవ్వించిన హాస్యప్రసంగముల నే నెరుగను. దేశీయనాటకసమాజములో పేరిగాని 'సాకలి తెలియు' విచిత్రముగ నభినయించుచు నీచపాత్రము లనేకముల స్వారిరూప యాదార్థ్యమున బ్రకటించుచుండిన భావరాజు నారాయణమూర్తిగారియొప్పిద మెంతయు నభినందించుచుంటిని. పల్లెవేషములో "అరి అరీ నారాయణా ఆదినారాయణా కరుణించి మమ్మేలో కమలలోచనుడా" అనిపాడు పల్లెవెఖరి మిక్కిలి సైజముగ నుండెను. వంగలదీక్షితులు తురకపోకిళ్లా వేషములో "అయితానగరంకాడ...రమ్మన్నదీ మాకీ రమ్మన్నదీ" అనే పాటను భద్రాచలయాత్రిక వేషములో "వెంద్కైతే వృంచీ రావు, భ్రింధకానాలో" అను రామదాసు కీర్తనను పాడునప్పుడును జాతీయ మొలికించుచుండెను.

కంభంపాటి విజయరావయ్య జగ్గయ్యశెట్టికోమట్ల స్వరూప
మును చక్కగా చిత్రించుచుండెను. కాని గొడుగుపేట ఫార్సు
లు చాలవరకు సుల్తానుగడ్డం బైరాగులతోను, సామీలగారి
శిష్యగుమాస్తాలతోను నిండి పల్లెటిజనుల తెలివితక్కువను
ఆక్షేపించు నీచహాస్యముగ నుండెను. హాస్యము మనుష్యుల
విద్యాబలహీనరూపముల దారిద్ర్యమును వెక్కిరించునదిగా
నుండకూడదు. లోపములచెప్పినను మానవమనోవృత్తుల భం
గపాటులను చిత్రించినను కరుణారసపూర్ణుడగునట్లు సానుభూతితో
జనసమష్టికుడు సామాన్యలోపములనే జూపవలెను. వెక్కిరిం
పబడినవాడుకూడ వినువారితో కలిసి పకపక నవ్వవలయును.
అట్టిహాస్యమే మాననీయమైనదికాని వ్యక్తుల బిత్తికించి నిర్ద
యగా వెక్కిరించు ప్రహసనములు ఏమాత్రము మంచివి
కావు. కుర్తివెంటి సుబ్బారావు బొబ్బిలికథకులను నీచపాత్ర
ములను చక్కగ నిరూపించుచున్నాడు. డ్రామెటిక్ కంపెనీలోని
పాలకుర్తి సత్యనారాయణ రసపుత్రవిజయమందు గులాంపాత్ర
మును మిక్కిలి యందముగ జూపగలడు. సుబ్బారావు అలీబా
బాకు తలవనితేపుగా ధనరాసులబ్బినపుడు చూపెడి వింత
చేష్టలెంతయు నవ్వుబుట్టించుచున్నవి. రామమోహనకంపెనీ
లో సుబ్బిశెట్టి వర్తనాతీతపాత్రపోషణ మందెయున్నాడు.
పొత్తువాగా, బనారసురుమాలు, అయిదువేళ్లకు ఉంగరములు
పైగండికిందకిపెట్టుకొని చింతామణివద్ద జేబులోని నాణెముల
గణాయించునపుడెంతటి ముచ్చికోమటి సింగారమొలికించెనో,
పుణుకుల్లిక నెత్తిపెట్టుకొని మహాప్రాణముల కట్లతో,

మురికికొల్లాయితో, "యేడేడిపెనపట్లు, కమ్మనినేతట్లు, కానికి మూడట్లు" అని యూరచూచు నచ్చునపు డంతటి దశాపాత్రత్వమునే యథారూపముగ చిత్రించెను. చింతామణి యెవరిడబ్బు వారి కిచ్చినదని భవానీశంకరుడు చెప్పినపుడు అట్లమ్ముచున్న సుబ్బిసెట్టి సిగ్గులేక "మల్లెబుకమెలు గెలిగిస్తాగా" నన్నపట్టు సీనటును రమ్యముగ నభినయించెను. ఇట్టిదుర్నివార్య దుశ్చింతాపరత్వము, ఆంధ్రనాటకములలో నెల్ల సుబ్బిసెట్టియు, మధురవాణి తిరస్కరించినపుడు "Damn it కథ అడ్డంగా తిరిగింది" అని నూతనదుష్కార్యాచరణసంకల్పముతో భంగపాటున కదరిపడక నిష్క్రమించిన గిరీశము మాత్రమే చూపుచున్నారు.

—* ఇతర హాసకులు *—

పార్సీనాటకములలో హాస్యగాండ్రనేకుల జూచియున్నాను. గున్నేశ్వరరావు కంపెనీలోని రామ్ అనుచిత్రకారుడు పార్సీతెరహాలో హాస్యప్రదర్శనము గావించుచుండెను. పార్సీనాటకములలో మొదటినుండి తుదివరకు హాస్యరంగములు వచ్చుచుండును. ఇందు సామాన్యముగా నొకబుడ్డామియ్యాకు చెందికెండ్లాము దొరుకుటయు నాయువతీలలామ బలువిటుల జేర్చి బుడ్డామియ్యాను మోసగించుటయును జూపబడుచుండును. స్త్రీవేషధారులలో మిక్కిలి చమత్కారములు చేయగల సమర్థుడు చెంజేడీపాత్రమును ధరించి హాస్యగాండ్రకూడ చక్కని పాటగాండ్రై వింతదరువుల పోకిరికీర్తనలు పాడుచు జనసామాన్యమును మెప్పించుచుందురు. మార్వాడీలోభియు నొత్త

రాయణుల హాస్యరంగములు దరుచుగ గోచరించుచుండును. తెలుగుదేశములోని హాస్యగాండ్రిదివరకు గానవైఖరు లెరుంగని జాతీయాభినేతలుగ నుండిరి. పార్శీ, బంగాలీ, గుజరాతీ, కర్ణాటకి, సింహళనాటకములందు హాస్యగాండ్రు మంచి గాయకులై గానవైఖరులలో వింతలకు నెత్తిపోకడల రాగకాలములు తప్పకుండ పాడుచు, ముక్కు, కళ్లు, చెవులు కదలించుచు పల్లవిప్రకారముల నభినయించుచుందురు. నెల్లూరు సుగుణవిలాససభలోని హాస్యకు డీపద్ధతి నవలంబించి యున్నాడు. వల్లూరి జగన్నాథరావుగారు తెలుగుజాతీయ మట్టిపడనట్టెటి పాటలను పాడినరీతి గ్రామొఫోను రికార్డులలో వినగలిగితినే కాని వీరి హాస్యప్రదర్శనముల నవలోకించి వారిపై నాకున్న విశ్వాసగౌరవములు ప్రకటించు సందర్భ మిప్పటికి నేర్పడలేదు. తమిళనటులలో శామణ్ణ హాస్యప్రబంధముల నద్భుతముగ జూపునేర్పరి. దొంగవేషము హాస్యసంబంధమైనదయ్యును నటప్రచారి, కల్లనువాగ్గునో కలయుప్రస్తరణ కౌశల్యసంశ్లేషగ నొనర్చి దొంగల కింపరాని గాత్రసంచారపద్ధతుల నతిశయించి హాస్యేతరముగ జేయుచున్నారు. నాటకహాస్యమే గాక నోటతో జాతీయములు చెప్పుచు శ్వానభైరవి మొదలగు రాగముల హాస్యపద్ధతులలో పాడగలవారిని చూచి యున్నాను.

గుంటూరు కంపెనీలో పూర్వముండిన యువటూరి వియ్యన్న కొన్ని వేషములను, జాతీయములను చక్కగా నొ

ప్పించుచుండెను. మొత్తము మీద తెలుగునాటకములలో హాస్యపద్ధతులు చక్కగా పరిణమించి యుండలేదు. అగ్ర కంపెనీల హాస్యములు బూతుపాటల వికృతాభినయముతో జాతీయత నొప్పించుచు నున్నవి.

—* పెడన రామయ్య *—

విప్పగు వక్షముమీద రోమరాజులందమై క్రమ్మ మెడలోని రుద్రాక్షమాలిక శివపూజాపరత్వమును సూచింప కరవాల మాడించుచు నభయహస్తమిచ్చుచు "మీకు భయకారణమేమి? పరుగిడబోకుడి, కృతవర్ముడ ధైర్యము చిక్కబట్టుడీ" యని యుత్సాహించుచు కురుక్షేత్రసంగ్రామరంగమును జేరునప్పుడితని వైఖరి మార్ధల్యాన హెంసెనుబట్టు మహాసేనానియొక్క సమరప్రచారమువలె దోచుచుండును. వీని యశ్వత్థామాభినయము ప్రశంసనీయమే కాని విపులదేహమా పాత్రలక్షణము సూచించకున్నది శోకరసము రామయ్యకన్నము. జులూరి కృష్ణరావు పెక్కువ యొప్పిదముగ నభినయించి యున్నాడు. వీరిరువురు అశ్వత్థామ నతిరసముగ, వీరప్రతాప జ్వాల బ్రహ్మతేజంబుగ నద్దేశించి యాభినయించిరి. సేనాసంహాగము సమరావకాశమునట నిశ్చయమే. రణరంగమున కౌరవచమూనిర్మాణోత్సవమున రంగప్రవేశమొనర్చు గురుకుమారుడు బాహుబలదర్పమొప్పెడి భీకరసేనానిగా వర్తించుట సంభావ్యమే. కాని అశ్వత్థామునందు వేరు లక్షణము లున్నవి. ఈతడు నిరంతర శివధ్యానయోగమున మునిగి యుండెడి బ్రహ్మచారి. రాబోవు మన్వంతరమున వేదజాలము

రక్షియింప చిరంజీవియై నివసించు యోగివిభుఁడు. ఈతని మానసవ్యాపారములు అవస్థానుకూలముగ బహిర్గతమై వ్యవహరించినను లోనితలఁపు లెల్లవేళల పంచాక్షరీమంత్రచింతన మం దాసక్తమై నిలచియుండును. ఇట్టి యోగివరుని యభినయించుటకుం దృఢప్రజ్ఞ నాటకమధ్యమున చేష్టలననుయ లోనిచూపుల యోగమార్గము నభినయింపవలసియుండును. నారదునకు గానలోలత, హరిచింతారతి నిత్యవర్తనమై యుండినట్లు ద్రోణపుత్రు డనవరతము శివధ్యానైకదీక్షతోనుండును. ఇదియే వీని స్థాయీభావము. మిగిలిన మనోవాక్కార్మములన్నియు దీనికి పక్కగా యోగభ్రంశ మేర్పరచకుండ నడచు క్షణికావస్థలు. ఈ సంగతి నేఁటి గుంటూరులోని పత్రి సీతాపతి అశ్వత్థామపాత్రనిర్వహణమందు వీని యోగిలక్షణములను, మైమరచు భక్తిప్రలోకగుణములతో పాటు జూపించెను. తరువాత అశ్వత్థామ మరణాసమర్థ్య మంతయు "బ్రహ్మతేజో బలం బలం" అను శక్తివలన అస్త్రప్రయోగనైపుణ్యమున నేర్పడినదే కాని కండక్రొవ్విన కిరీటుల తరిఫీదులో కలిగినది కాదు. ఈ యస్త్రప్రయోగవైదుష్యమును, మంత్రవిజ్ఞానమును, యోగిసత్వమును సూచించు పలుచని లోనిచూడ్కుల పసిడిమేని నొప్పుచు సీతాపతి యశ్వత్థామపాత్రమున కెంతయు నొప్పిదమై యుండెను. రామమూర్తి, కృష్ణారావు, అభినయకౌశలమున దీతనికి వెనుదీయకున్నను పాత్రసాహృప్య మొందకయు యోగిసత్వ మెఱుంగకయు సీతాపతికి వెనుకవా రగుచున్నారు.

—* మంజులూరి కృష్ణారావు *—

ఈనటుడు రసపుత్రవిజయములో దుర్గాదాసున కొసంగిన స్వర్ణపతకమును వేణీసంహారములో నశ్వత్థామకేర్పరచినదియు గూడ పొందియుండెను. కృష్ణారావు దుర్గాదాసుపాత్రి మతినైపుణ్యముగ నభినయించెను. కాని యాసందర్భములు మరపుతగిలినవి. నిజముగా వైకుంఠయోగివలె యోగిస్వరూప మొంది తురుష్కసార్వభౌముని వెక్కసమును భారతమాతృశోకమును ఆలించి దేశాభిమానపూరితుడై రసపుత్రవీరప్రభావమును వెదజల్లుచు హిందూరాజ్యముల కైకమత్యమొనగూర్చు నీతిచాతుర్యమొప్పించుచు నిజముగా దుర్గాదాసే యభినయించుచున్నను భ్రాంతి గల్పించుచుండెను. మంజులూరి కృష్ణారావు తిరుపతి వేంకటేశ్వరుల భారతనాటకములను ప్రదర్శింపజేయుటలో విఖ్యాతుడై యుండెను. అందు శ్రీకృష్ణరాయబారమున కృష్ణవేషము ధరించి కొన్నిపట్లు లతినైపుణ్యముగ నభినయించెను. “జెండాపై కపిరాజు” అను పద్యములో “మూకల్ చెండుచునున్నప్పు డొక్కండున్ నీ మొరయాలకింపడు కురుక్ష్మానాథ సంధింపగన్” అనపట్టును కర్ణునితో భేదోపాయ మాలోచించునపుడు రహస్యముగ చెవిలో “నిన్నాయమ పెండ్లియాడగల దారవభర్తగ సూర్యనదనా!” అను ఆశ లతికించునపుడును భీష్మప్రతాప మొకరొక్కనటుడు సమరసమయ ముల్లంఘించి, “నురికిన నోర్వక నుదరంబులోనున్న జగముల వ్రేగున జగతిగదల, చక్రించుచేపట్టి చనుదెంచు రయమున బైనున్న పచ్చని పటముజార...కరికిలంఘించు సింహంబు

శరణిమొరసి, నేడుభీష్ముని జంపుదు నిన్నుగాతు, విడువు మర్జునయనుచు........." చను దెంచుపట్టునను కృష్ణరాయని శ్రీకృష్ణ గుణవ్యాఖ్యానమెవ్వరు అతిశయించియుండలేదు.

అశ్వద్ధామపాత్రాభినయములో నీతని మంచిచెడ్డ లిదివరకే వర్ణించియున్నాము. కృష్ణారావు బందరునటులలో సాహిత్యపరిజ్ఞానముండి నాటకములను ప్రదర్శనానుకూలముగా మార్చు విన్నాణమొప్పుచుండెను. ఈతనిసామర్థ్యము నటవర్గమును జేరదీసి సత్వరముగనాడించు కట్టడిమైయున్నది. ఇతనిచే నడిపింపబడిన "రాయలు హిందూ థియేటరులో" నాట్యసాహిత్యములందు పేరొందియున్న పింగళినాదరులు, నిరాఘాటగాంధర్వగీతికా గాత్రసామ్రాజ్యమున వీనుల నుప్పొంగజేయు రాఘవాచార్యులు, శ్రీపతి పట్టాభిరామయ్య, రామారావు యింకెందరో ప్రసిద్ధనటులు చేరియుండిరి. వీరరసప్రధానమైన భారతనాటకములను బందరులో నిండుహంగున గూర్పగల సమర్థుడితడొక్కడే.

ఇతనికి సంగీత మొకింత కొరవైయె యభినయరీతులందు కొన్ని వెకిలితనము లుండెను కాని నాటకార్థమును గ్రహించి, భావగర్భితముగ నభినయించుచు, బందరులో కొంతకాల మెన్నికలోనుండెను.

పింగళి వెంకటవరసయ్యగారు సామాన్యముగ భీమవేషమును దాల్చుచుందురు. వీరు గోవిందరావునాయుడువలెనే భీముని వినయలక్షణములను, సాధుత్వమును, దయాసౌశీల్యములను, గండుతనమును, గుర్తించి పెద్దపులి చిలిపిమాటలతో

మొగ్గరేడక, పాండురాజతనూజున కుండదగు సుత్తమరాజమ ర్యాదలతో దర్పవిశ్రమమొప్ప నభినయించుచుండురు. వీరిభీ మపాత్రి గుణవ్యాఖ్యానము గోవిందరావునాయు డూహించిన దారులలో మెరుగారియుండెను. వరిసయ్యగారి వేషము లలో నాకు పరమానంద మొసంగినది పాండవవిజయములో కృష్ణనిదర్శను సందర్భమైయున్నది. భీష్ముడు భారతసౌ శీల్యసద్గుణంబుల పరిణామమూర్తి. మహాభక్తుడు. విరాగోన్న తుడు. రాయభారసందర్భమున కచ్చితముమాన్ప యత్నించెను. శాంతముగ భగవన్నామము చేసికొనచు "బ్రతికెదము ర్వేల" అని కోరువాడు. దుర్యోధనుని దుర్మదాహవసంకల్ప మున కిష్టపడనివాడు. అయినను, కౌరవులు యుద్ధసంకల్పమే నిశ్చయించుకొనినపుడు తనప్రభుపక్షమున శత్రుభీషణముగ పదిదినము లాహవము జరిపిన మేటివీరుడు యుద్ధము ధర్మ మని యెరిగియు తాను "సంయమివరు డిదుచుండె సంసారము నన్" అనినపగిది ధర్మనిరూపణమందును, భగవదారాధన మందును కాలము గడుపుచుండినను ప్రధానముగ క్షత్రియ జన్మమెత్తినవీరుడు. ఈవృత్తియందు మేటియై మోసి కృష్ణుని ప్రతిజ్ఞాభంగ మొనర్చునంతటి రణప్రతాపమును విజృంభించి నందుననే భీష్ముని శాంతిపర్వధర్మోపదేశమునకును, చక్రిని వేయినోళ్ల నుతించినందులకును శాశ్వతమైన గౌరవమేర్పడినది. భీష్ముడు ధర్మమునకు ప్రోవు; భక్తిసాధనల కదురు; కాని వీనికన్నను ద్వాపరరాజన్యమునకేగాక పరశురామునకు గూడ సరిగాని క్షాత్రవిద్యాసంపన్నుడు. "దుర్లభం క్షత్రియాః పార్థ లభంతే

యుద్ధమీమాంసకుం" అని భగవంతునిచే నుతింపబడిన ధన్యక్షత్రి పోరాటమునందు భీష్ముని భీష్మప్రతాపము వెలుగొందినచో యానిక్షత్రియజన్మమెందులకు? ఇంతవఱకు నెట్టి యోగమున 'లో, "చిత్తము గోవిందపదాక్రాంతము గావించి మానినై తనలోనే తత్తరము లేక" యనుపుంవిశువవలచెరో అట్టి మహాగావస్థయే రణరంగమున చక్రిచే తనకు గలుగనాయెను. దుర్జయుఁడై లోకభీకరముగ సంగ్రామరంగమున నిలచి పోరాడి వాసుదేవుని ప్రతిజ్ఞాభంగమేర్పరచెను. చక్రిచే మఱియు వైభోగమేర్పడెను. తనకు (తిను సామర్థ్యమునకు సంతసము; భగవద్ధ్యానంబునగాక భగవత్సాన్నిధ్యము వచ్చునని సంతోషము కఫవాతపైత్యములకుల్లో రోగముచేగాక సుదర్శనజ్వాలల వంకమొందు నలౌకికమరణసిద్ధి భీష్ముని యూరించుచుండె "నేను భీష్ముబజంపుదు నిప్పుగాతు" నని మీరికిమునకు కృష్ణుని సమరాగమునకు భీతిగొందక "దెరలి చనుదెంచు దేవుండు దిక్కు—రాడు" అనికృష్ణునకు స్వాగతంబిచ్చి సుదర్శనప్రయోగమును సంతోషముతో తన 'చిత్తపు' చనమునిజయముగ నభినందించు భీష్ముని రూపభావములు వెంకటవరసత్యుగారు సంపూర్ణకళాభిజ్ఞతతో నభినయించిరి. జరలేని ముదిమితనము క్రోధమెరుంగని క్షాత్రప్రతాపము, కౌటిల్యకళంకమొదవని రాజనీతి, శత్రుసాధనజేయు భక్తితాత్పర్యము. దప్పగానిచ్చు వైరాగ్యము, జీవితాదర్శములు సంపూర్ణఫలసిద్ధిగాంచిన సంతోషము—ముదితాన్నియు నరసత్యగారి భీష్మాభినయమందు గోచరించుచుండెను. కంఠబలమున జలరేగు పడుచు వేషము లెన్నియో దాల్చి నీనటుని

జూచియుంటిసికాని భీష్మునిభక్తిప్రతాపసాంకర్య రసమును అభినయించినపుడే పింగళి వెంకటనరసయ్యగారి నాట్యకౌశలము నాకనుభవమైనది.

—* గూడపాటి నరసింహారావునాయుడు *—

బందరులో నాడబడిన రసపుత్రచరిత్రగాథలలో రణప్రతాప్ మొదటిదని చెప్పవచ్చును. దీనినే చిత్తూరుముట్టడియందురు. రాజపుత్రస్థానమందలి వీరులు కొందరు మొగలాయిచక్రవర్తులతో వియ్యమొందుచుండిరి. రాజా ప్రతాపసింగు హిందూమహమ్మదీయరక్తసాంకర్యమున కియ్యకొనలేదు. అక్బరుచక్రవర్తి సామ్రాజ్య మంగీకరింపని స్వాతంత్ర్యవీరుడు. ఈతని వశపరచుకొననెంచి ప్రతాపసింగు నివాసమగు చిత్తూరుదుర్గమును ముట్టడింప తనప్రధానసేనానియగు రాజా మానసింహుని దాడి వెడలించెను. ప్రతాపసింగు అక్బరు సైన్యముల వేడిమి నోర్వజాలక నడవులబట్టెను. మానసింగు రణవిజయ మొందియు చిత్తూరుపతనమునకు చింతిల్లి రసపుత్రకులాభిమాన ముల్లమున దేజరిల్ల ప్రభుకార్యనిర్వహణదీక్షాసంకల్పమునకును స్వదేశాభిమానమునకును విరోధభావము లేర్పడ విజయమొందియు చిత్తూరునగరమును స్వాధీనపరుచుకొనకయే మొగలాయిసైన్యమును మరలించి గొనిపోయెను. గురజనాయుడు రాజా మానసింగుపాత్రమును రసపుత్రవీర్యతేజాబు లొప్పునట్లు రూపసాదృశ్యమొంది చక్కగా నభినయించెను. ఎన్నో యేళ్ళు గతించిన నిప్పటికిని

వీరానాడు రామమోహన్ కంపెనీలో ప్రదర్శించిన భావ సంక్షోభము, నేతాధర్మ దేశాభిమానములు మానసికవిరోధ ములు కన్నులకట్టినట్లుగా దోచుచున్నవి.

నాయుడుగారు మైలవరంకంపెనీలో ధరించి నిర్వహించిన పాత్రము లెన్నియో కలవు. వీనిలో ద్రౌపదీవస్త్రాపహరణ మందు భీమునిగను, సంపూర్ణరామాయణమందు దశరథునిగను, సావిత్రిలో సత్యవంతునిగను నాయుడుగారి యాటపాటల జూడగలిగితిని. భీముని గుణవిశేషములు వీరు గుర్తించియున్నను వీరి యభినయమందు తొల్లిటి వ్యాఖ్యానవైఖరులే, వీరశీలమే ప్రధానలక్షణముగ నగుపడుచుండును. లక్ష్మణస్వామిగారివలె ఇతడు మూకాభినయ మెక్కువగా జేయుచు నితరపాత్రముల సంభాషణ మాలకించుచు కథావ్యాపారమున తానొందు చిత్తవృత్తుల బ్రకటించువాడుక గలవాడు. ద్యూతపుసభలో పుట్టములోనుచుపట్టున నీతని మహాభారతకథాపరిణామ ముద్దీపించు మూకాభినయ మొనర్చెను.

దశరథుని ముసలివలపుల బ్రకటించుటలో ఇతడు నగరాజరావుగారిచెంత జేరనేరడు. ఫలితకేశజాల మావడుచు ముగపు కండపటిమను దాచకుండెను.

యముడు సత్యవంతుని యసువులగొనిపోవ నరుదెంచు వైఖరి కాలభీకరమహోగ్రమూర్తితో “నంత్యకాలదహనజ్వాలాప్రచండుడు” గనుండెను. కాని “వీనిగ్రిచ్చర గొనిపోవ గాజనుదెంచితి” నని చెప్పినను యముడు ధర్మమూర్తియై, త్రికాలజ్ఞుడై, రాబోవు సందర్భమెరుంగనివాడు కాడు. నీవెవరవని

సావిత్రి ప్రశ్నించినప్పుడు "విద్ధి మాం త్వాం శుభే యమం," అని తన్ను దా దెలుపుకొనిన భారతవాక్యమందలి శుభే యను పదము సుమంగలి కర్థమై పాతివ్రత్యపరిణామవిజయమును సూచింపుచు యముని నిజోద్దేశము సత్యవంతుని యమలోకమునకు జేర్చుటకన్న సావిత్రిపతిభక్తి శిక్షించి పరీక్షించుటయే ప్రధానముగ దోచుచున్నది. మనుష్యుల మనోవాక్కర్మసంకల్పముల సర్వసాక్షియగు ధర్మదేవతబలయొక్క నిర్మల పతిభక్తి నెరుగకుండెననుట యసంభవము కాన సమవర్తి సత్యవంతునకు మృత్యుప్రాయమైయడగుపడిన యుగ్రభంగి యమానిరూపములో జూపడగినను కార్యపరిణామ మొకప్రక్క జూపరు. శ్రీగుపడుచునే యుండపలెను. ఈస్థితి నాయుడుగారు రంగి యనుకూలముగ తమయుగ్రవలోకన జ్వాలలక్రింద నొకప్రసన్న సుస్మితమభినయించి చూపించిరి. ఆవల సత్యవతి యముని వెన్నంటి దుర్గమకర్కశాలయముల దొక్కుచు,

"శ్రమఃకుతో భర్తృసమీపతోహి మే।
యతోపి-భర్తా మమ సా గతిర్ధ్రువా॥"

అని చెప్పుచు నడచునపుడు యము డాయమను వెనుకదిరి వారింపబూన నుచితముగనటించి మెప్పించుచుండ యముని తొల్లిటిసంకల్పము కూడ మధ్యాహ్నరవిదీధితులతాకున నీహారశలాకములు నీరై కరిగినట్లు క్రమముగా పల్చపడి వరాంజలుల నర్పించి తుద కాపాతివ్రత్యప్రభావమున కతులితానందమొంది మగనినర్పించి ఆయురారోగ్యసంపద్వరంబుల నిచ్చెను. ఈపట్టుల పారేపల్లి సుబ్బారావు నిజముగ సత్యవతియై పతివ్రత

లక్షణము లొప్పుచు తనపాతివ్రత్యప్రతాప మెఱుంగని యబలా సుశీలమున మాత్రమే కనుపరచుచు, మగనిపోకను వారింపజాలని దౌర్బల్యమును, కాలు నెదురొడ్డనజాలని స్త్రీస్వభావమును వెల్లడించుచు నెంతవరకు కానిమిటి ననుసరించుటయే సతీధర్మముగ నెంచు మనస్థితియు జూపుచు వెన్నంటినడచునపుడు నాయుడుగారి దయార్ద్రాపానతలావరోహణము సత్యవంతుని బ్రతికించు వరకు సలక్షణముగ జరిగెను. సావిత్రి తాను పతివ్రతయనియు తనప్రణయమహిమచే కాలునిసంకల్ప మడిగించి మగని బ్రతికింతునను నమ్మకముండియు నాయమప్రయత్న మారంభించలేదు. పతితో నడచుటయే పరమార్థమని భావించి వానితోగూడ యమపురావాసమును జేరుట కుద్యమించి నడచినదే కాని, తనకును తనబంధుగులకును సౌభాగ్యసిద్ధి కలుగునని యూహించి యుక్తిమాటతో యముని వెన్నంటలేదు. యవనపురాణములలో "హార్క్యులీసు" అను మహాబలుడు తన సతిని గొనిపోవ నేతెంచిన కాలుని కుస్తీపట్లవోడించి భార్యను బ్రతికించుకొనెను. బాబిలోనియా గాథలలో పాతాళమున భూతకాంతల భోగసంతుష్టికొరకు చెరపట్టబడిన 'తమూజ్'ను రక్షించి తెచ్చుటకు యిష్టారు అను పతివ్రత కావలివారికి లంచముల దనియించి లోనికిజొచ్చెను. వీరిరువురు తమతోడులను భూలోకమునకు దెచ్చి వారితో సుఖించుటయే పరమావధిగ నెంచినవారు. మార్కండేయుడు మృత్యుభీతిచే శివలింగమును కౌగిలించి స్తోత్రాష్టకమున శివుని యమునిపై బురికొల్పి చిరాయుసంపాదన మొనర్చెను. సావిత్రి భూమిపై

జీవింపనెంచలేదు. మగడున్నతావున పతిననుసరించి యుండుటయే యామె యుద్దేశ్యము. భౌతికజీవనము, ఆ సముద్ర సామ్రాజ్యము, మిగిలిన సంపత్తులన్నియు యముడు తననంతట తానే సావిత్రిపాతివ్రత్యమున కచ్చెరువంది యొసంగిన వరవిభూతులు. నిస్సంకల్పమగు భర్తృపాదానుగమనమును, స్త్రీజననైజమైన దౌర్బల్యపరిణయతత్త్వమును పారేపల్లి సుబ్బారావు అసమాననైపుణ్యముతో చిత్రించియున్నాడు. ఈతని లీలావతీవేషనిర్వహణము చూచియుంటిని. ఇందు రసములు ముఖముద్రలందు తీక్ష్ణముగ చిత్రింపబడియున్నను నీవేషమును పలువురు మెచ్చుకొనినను, పారేపల్లి సుబ్బారావు సాధుపాతివ్రత్యనిరూపణ మొక్కటియే యసమాన వైఖరుల జూపగలడని నానమ్మకము.

—* దేవరకొండ వెంకట సుబ్బారావు *—

బందరులో నాటకపోషణము ప్రస్తుతకాలమందు జనసామాన్యముచే నడుపబడుచున్నది. పూర్వము ఉద్యోగస్థులు, విద్యార్థులు కొలదిమంది సంగీతసాహిత్యముల బోషించుచు నాటకముల నుత్సాహపరచుచుండిరి. ఇప్పటికి అట్టిపోషకులు కొందరున్నను నాటకములు అల్పవిద్యాసంస్కారముగల ధనవంతులయొక్కయు సోడాషాపులు, కాఫీహోటలులు, జటకాలు మొదలగు స్వతంత్రజీవనముగల వారలయొక్కయు అభిమానమున ధనార్జనము చేయుచున్నవి. బందరుపౌరుల నటరాజు దేవరకొండ సుబ్బారావని చెప్పవచ్చును. ఇతనియభి

నయవిశేషములు పలుతావుల ముచ్చటించియున్నాను. దుష్ట బుద్ధి, పఠాను వేషములగూర్చి ప్రత్యేకవిమర్శన లిచ్చియుండుటవలన వాని నీయెడ విస్తరించను.

సుబ్బారావు బందరువాఁడు. బందరులో పుట్టి పెరిగి యుటనే చాలవరకు నైజమనీషచే నాట్యకళాభ్యాస మొనరించినవాడు. ఈతనికీర్తి తెలుగుదేశపుదిగంతముల వ్యాపించి బళ్లారి, విజయనగరము, చెన్నపురి, రంగూను, మొదలగుతావులకు పెద్దజీతముల యాశలతో పిలువబడినను తానున్న హాంగురక్షున కంపెనీని నమ్ముకొని బందరుపురమును వదలివెళ్ళని నిలుకడగలవాడు. ప్రసిద్ధనటులలో నిట్టిమరు అరుదు. సుబ్బారావు తొలిమెంటరీచదువును దాటినవాఁడు కాకపోయినను తానభినయించు పాత్రములగద్యపద్యములు అర్థజ్ఞానముతో నుచితరీతుల జదువగలసరసుడు. ఇతడు స్త్రీవేషములను ధరియించుచుండును. కాని వానిలో యశోదపాత్రము నొక్కటే నేను చూచియుంటిని. కృష్ణలీలను నేను విస్మరింపజాలను. సుబ్బారావుగాత్రమాధురి మెంచదగినది. బుర్రా రాఘవాచారియొక్క వియత్సంచరణగానవైఖరి సుబ్బారావునకబ్బలేదు. యడవల్లిసూర్యనారాయణ నానాదేశములు తిరిగి ప్రశస్తభరతగాయకులగాత్రప్రచారములరీతు లెరింగి యలవరచిన శిక్షాశుద్ధి సుబ్బారావునకేర్పడలేదు. రాఘవాచారి శబ్దార్థజ్ఞానశూన్యుడు తా నభినయించెడి పట్టుల గుణాభిజ్ఞత గాని అర్థముగాని యెరుంగక "టీజని తేన్స్వరేష నుపదిష్టమహీయగవాయి గానవిద్యాజిత పీకు సాబు." సూర్యనారాయణ సిద్ధగాత్రులయాదర్శ మనుకరించి

యు, గీర్వాణాంధ్రనాటకసంప్రదాయముల గుర్తించియు, పాడ నటసిద్ధుడు. సుబ్బారావు పీ రిరువురిగాత్రమాధురి కించిదూనముగ నొప్పుచు తనబుద్ధికొలది కొంచెమర్థయుక్తముగను, కొంచెము రసవాహకముగను, మిక్కిన సుఖముగను, పాడి జనసామాన్యమును సంతోషపరచగల సామాన్యధీయుతుడు. సుబ్బారావునాట్యకీర్తి యొంతయు నాతని గాత్రమాధురి యందే నిలచియున్నది. చక్కపాడిచెసి వేకువవేళ కమ్మతెమ్మెరల మూపున దేలు పికకూజితము నిద్రాళువుల కెట్టి యవ్యక్త సుఖలీలలిచ్చునో, అట్టి ప్రశాంత నిరాడంబర గాన సౌలభ్యము "యిండియన్ డ్రామెటిక్" వారి ప్రధాననాయకునం దగుపడును. గాత్రము శారకమై వయోభేదమున వెగుచుండును. సుబ్బారావుగాత్రము మానవనైజముగు విపర్యయమొందుచు, క్రమముగా సుఖస్పర్శ గలిగింపకున్నది. సంగీతశిక్ష పొసగిన నారాయణదాసు, కట్రా పాపయ్యశాస్త్రి మొదలగు పాటగాండ్రు పికస్వరలాలిత్యమును గోలుపోయినను, తానతరంగసంపదలచే తమ ముసలితనముల ముదురు గొంతుక నలంకరింపగలిగి యున్నారు. కేవలనాట్యరంగముల గాత్రమై ఖ్యాతులలవడినమనసుబ్బారావువంటివా రెంతకాలము జనాభీష్టముల నిలుపుకొనెదరో సందియమైన విషయము.

సుబ్బారావొకప్పుడు స్త్రీపురుషవేషముల రెంటిని సమానపాత్రౌచిత్యముతో నిర్వహింపగలిగి యుండెను. ఇప్పుడాతనిశరీర మొక్క వయసుజరిగిన తరుణరూపములకు మాత్రమే యనుకూలముగ నున్నది. ఇది కొంత దురదృష్టమని

చెప్పవచ్చును. పదిసంవత్సరములక్రింద సుబ్బారావు స్త్రీవేషమును ధరించినను పటువులొలికించు వంగసౌభాగ్యమొప్పియుండెను. అర్జుని భూమికలో నీతడు గోపీమనోహరుని ముద్దుల మరదిగా నగుపడునంతటి సౌకుమార్యమున నుండెను. హరిశ్చంద్రపాత్రాభినయమందు ఆమహామహుని మహోదార సత్యశీలత సుబ్బారావునం దగుపడుచుండెను. కాని వైపరీత్యమున నీముఖలక్షణము లస్తమించినవి. ముఖము గడుసుబారి భావాభినయముల ముద్రింపజాలకున్నది. పఠాను, దుష్టబుద్ధిపాత్రముల రంగవ్యాఖ్యాన మొనర్చునపుడు సుబ్బారావుత్సాహ తెల్పుచున్నను ముఖాంగము లాయాహావ బ్రకటింపజాలకున్నవి.

పూర్వము సుబ్బారావు తన కష్టమైనంతలో నిరాడంబరముగ సహజప్రబోధముల నందికొని పాత్రముల వేషభావములను రసవంతముగ నటించుచుండెను. ఈతని స్వభావము కుదురుగల దయావివేకము లొప్పు శాంతతత్వము. అర్జునుడు, నలుడు, హరిశ్చంద్రుడు మున్నగు శాంతసత్త్వపుంగవుల నిజప్రవృత్తు లభినయించుట కనుకూలమైన మానస మీతనిది. ఇట్టివాడిటీవల వీరబీభత్సకౌటిల్యవృత్తు లభినయించవలసిన వేషముల ధరియించి, నైజమనీష ననుసరింపక నెక్కడనో యెరువు దెచ్చిన ఎవరో నిర్ణయించినరీతుల నభినయించుచున్నాడు. ఇప్పుడే కాదు, నిండుయౌవనముల పిన్నవయసునందైనను సుబ్బారావు వీరవిషాదభావాభినయముల కనుకూలమైన యంగవిన్యాస మొప్పినవాడు కాడు. మనోవృత్తులకును, శరీరపరికరములకును

బొత్తుగా పనికిరాని వేషముల ధరించి నూతనముగ నటియించిన నాట్యవైఖరులలో విస్తరింపదలంచుచు సుబ్బారావు తన నైజపరిమితుల నెరుంగక నభినయించుచున్నాడని చెప్పవచ్చును. లక్ష్మణస్వామి పదానురూపసాదృశ్య మభినయింపగా జూచిన బందరుపౌరులు పార్థపాత్రోచితుడగు సుబ్బారావు గరుడునివేసములో నటింప జూచి మెచ్చెదరా?

సుబ్బారావు నమ్మినవారి విడనాడనివాడు. స్వతంత్రా పేక్షగలవాడు. ఇమిటేషను రాళ్లనడుమ రాజిల్లు మేలిపచ్చవలె నీతడు చిరనాటిసాంగత్యమును విడువజాలక దొరకినహంగు తో బందరుహాలులచిరిపిరి తెరలలో సమాననటసహకారలా భ్యమొందక గాలయాపన మొనర్చుచున్నాడు. ఈతని రంగ సంపాదకుడు తనవృత్తిలో బందరుకెల్ల మేటి. అయినను సుబ్బా రా వితరపరిస్థితులలో నిప్పటికన్న నెక్కువ విఖ్యాతి గలిగి యుండునని సంశయింపము.

చిన్ననాటి గాత్రిమాధుర్యము వయసుజెల్లిన మధురా కృతుల కెడమిచ్చినది. సుకుమారము ఖాంగవిస్ఫూర్తి సత్వ జరాజీర్ణతను పొందుచున్నది. లలితమైన జాభినయరీతుల బదులు బలవంతపునాట్యపుపట్లు నిష్కారణముగ నావేశించినవి. అనను కూలపాత్రస్వీకరణము అనుచితనటసహకారము. ఇన్నిప్ర త్యూహములు లొదవిన సుబ్బారావినాడుకూడ బందరులోని జన సామాన్యమునకు నాట్యమూర్తియై వెలుగుచున్నాడు. నేను చిత్రించిన నటశిల్పు లొకానొకప్పుడు మహానీయనటవర్గ మున జేరు నెంపుల కర్హమగు రూపగాత్రాభినయముల

మూర్తియై యుండెను. సుబ్బారావుగారి కీర్తి యాసర్వవ్యాప్తమైనది కాదు. కాని వయోవిపర్యయమునను, గాత్ర భేదమునను, ఆనాటికీర్తిబీజములనంటియే ప్రస్తుతజనాభీష్ట మొనగూర్చినది కాని ఇప్పటి సుబ్బారావు వెనుకటి యందచందము లెంతమాత్రము చూపకున్నాడు.

దేవరకొండ సుబ్బారావు ధరించిన వేషము లన్నిటిలో పదియేండ్లక్రింద నిండుజవ్వనమున నభినయించిన గయోపాఖ్యానమందలి యర్జునపాత్రమునందు "గజ్జలందియలు గల్లుగల్లని మ్రోయ" ననుపద్యమును, "కడచునె యెన్నడైన" నను నదియు బాగుగ నిర్వహింపబడెను. "హరిశ్చంద్ర"లో "దేవబ్రాహ్మణ మాన్యముల్ విడచి" రాజ్యమెల్లను కౌశికునకు ధారవోసిన సందర్భములో విశ్వప్రతిభాతయగు కౌశికుని "కరంబుక్రిందగుట, మీకైనాకరింబుంట చెల్లాదే రాజ్యము గీజ్యముగా నతతమే కాయంబు నాపాయమే" అనుభావమును వెల్లడించి దాతృపాత్రము లభించిన యానందమును ప్రకటించెను. మరల కాశీపురాభివర్ణనమును, "జవదాటి యెరుగని యువతీలలామం" బనుపట్టున మనోహరముగ నాడుచుండెను. రసపుత్రవిజయములో నీతడు రాజసింహపాత్రమును గైకొనిన యుక్తముగ నుండెడిది. దాని నితరులకిచ్చి తన ననుచితముగ దుర్గాదాసభూమికను దాల్చియుండుటచే నాంధ్రనాటక పరిషత్తువారి పోటీపరీక్షలో జగన్నాటకసూత్రధారిగుణాభినేతయగు మను జులూరి కృష్ణారావు నైక తయోగినైఖరులకు జాలకపోయెను. పరీక్షాఫలితము లెట్లున్నను సుబ్బారావు బందరు

పౌరుల కనవరతము నాట్యకళాప్రదర్శనానంద మొసఁగూర్చువాఁడై పలుమారు నా విమర్శనాభినందనము లొందియున్నాఁడు.

## —* చైత గోపాలము *—

నేనుచూచిన భారతనాటకము లన్నిటిలో విదురుఁ డొక వృద్ధతపస్విగ తెల్లనిగడ్డముతో చుట్టుకుమురుము రికితలపాగతో చెప్పులోకాళ్ళిడి కాలునిపిలుపు కెదురుచూచువానివలె ప్రవర్తించుచుండెడి. దుర్బలుఁడగు ముదుసలి యొకమూలనుండి "కవ్వడితోడిపోరితము కష్టము కష్టము" అనుచు గొణుగుచుండెను. ఇదియే నాటకసమాజముల సామాన్యాభిప్రాయము. మైలవరమువారి ద్రౌపదీవస్త్రాపహరణములో చైతగోపాలము 'విదురస్వరూపమును సలక్షణముగ ప్రదర్శించి యున్నాఁడు. విదురుఁడు కౌరవసామ్రాజ్యమునకు కర్ణధారి. అమాత్యశేఖరుఁడు. నీతికోవిదుఁడు. ధర్మప్రవక్త. అన్నిటికన్న విష్ణుచింతాపరుఁడు. రాజ్యతంత్రముల యలసటలో హరిసేవానిరతియలవడిన సమవర్తి. దాసీపుత్రుఁడయ్యును అశ్వత్థామాదుల కంటెరానిగౌరవముతో హస్తిపురరాజ్యభారమును వహించుచుండిన మేటి. ఈలక్షణము లన్నియు గోపాలముగారి యభినయములో ద్యోతక మగుచుండెను. గోపాలము చక్కని పాటగాఁడు. శాంతస్వభావుఁడు. "ఈజగదీశుమాయలను వర్ణింపగ నెవ్వారికి తరంబగును" అను భక్తినిర్వేదరసభరితకీర్తనను గోపాలము పాడునపుడు జూపరుల కేర్పడు భక్తివినమ్రభావములు

రామకృష్ణయ్య నారదవేషములోగాని, రాధాకృష్ణయ్య శకుని గీతములందుగాని గానరాకున్నవి. గోపాలముపాడిన "జగదీశు మాయల" గానవైఖరి పారేపల్లి సుబ్బారావుచ్చరించిన "పోవుచున్నాడే నావిభునిప్రాణములు గొని" అనుదానితో సమానమర్యాద నొంది నాటకగానాభిలాషుల సాధనావస్తువై కొంతకాల మీపాత్రతముల నేలినది.

—* ఉప్పలూరి సంజీవరావు *—

దేవగొండ సుబ్బారావుతోబాటు సంజీవరావుకూడ మునుమొదలు బందరులో నాట్యాభినయము నలవడినవాడు. ఇద్దరు ఒకకాలముననే 15 ఏండ్లక్రింద నామిత్రవర్గమున జేరిరి. సంజీవరావు మోహిని, చిత్రాంగి మొదలగు శృంగారయువతీ పాత్రముల కర్హుడైనవాడు. ఈతని నడవడి యాండువారిచేష్ట లతో సాదృశ్య మొందుచున్నది. కోటంరాజు లక్ష్మీకాంతము చూపుతళుకు లితనియందు లేవు. కాని అతనికంటె నెక్కువ స్త్రీస్వభావోచితరీతు లలవడినవాడు. నెల్లూరి శ్రీనివాసాచారి యంతటి పాటగాడు కాడు—అతనిది పాటకచేరీకి తగినంత దీర్ఘవిస్తారమున నుండును. సంజీవరావుపాట కిన్నగమేళవింపు లతో లలితమనోహరంబుగ నుండును. సుకాంగదలో "మాంగతీలతా" కీర్తనను పాడునపు డీతనిగాత్రి మత్యంతరామణీయకత మొప్పుచున్నది. దమయంతి, చంద్రమతి, సావిత్రి మొదలగు పతివ్రతాస్త్రీ వేషములలో సీతకు జగ్గరాజుకు, పారేపల్లి సుబ్బారావుకునొప్పిదమగు నుదారలక్షణము లొందవకున్నాడు.

శోకరసమున సుబ్బారావుకన్న బాగుగ నభినయించును. శృంగారపాత్రకల్పనమున నసమానుడు. కాని చల్లని యాబాలోచితపవిత్రస్త్రీగుణంబు లీతని యభినయమం దంతగా నగుపడవని పలువు రభిప్రాయపడుచున్నారు.

## —♦ పింగళి లక్ష్మీకాంతము ♦—

తిరుపతి వేంకటేశకవియుగ్మములోని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు బందరులో తెలుగుకైతల నేలుకాలములో పలువు రాంధ్రకవిత్వరచయితలు బయలుదేరిరి. వారిలో కావ్యసిద్ధి యొనగూడి నేటివరకును క్రొత్తదారుల తెలుగుకైతలల్లు పింగళి లక్ష్మీకాంతము, కాటూరి వెంకటేశ్వరరావు, విశ్వనాథము, సత్యనారాయణ ముఖ్యులై యున్నారు. లక్ష్మీకాంతము వెంకటశాస్త్రిగారి ప్రియశిష్యుడై వారి శుశ్రూష చక్కగజేసి భారతములోని గుట్టుమట్లు ననేకముల తెలిసికొనెను. మరియు తెలుగు ప్రబంధముల జక్కగ జదివి లోకజ్ఞానముతో, సూక్ష్మవిమర్శకశక్తితో వాని మానసికతత్త్వమును గ్రహించియున్నాడు. సరసుడు, అనుభవశాలి, లౌకికుడు, కరుణాసమత్వములతో మానసికవ్యాపారముల విమర్శించు తత్త్వజ్ఞుడు. భావకవితారీతు లలవడిన కావ్యశిల్పి. ఈతడు రాయల్ హిందూధియేటరులో శాంతనాటకాభినయమందు అనేక వేషముల ధరియించుచుండెను. ఆవల నాంధ్రపరిషత్తులోను ముత్తరాజు సుబ్బారాయ మెమోరియల్ సంఘములోను మంత్రిరాక్షసునిపాత్ర మభినయించెను. మ త్రి

రాక్షసునిపాత్రయు లక్ష్మీకాంతముగారి యభినయ కౌశలము నుద్దేశించియు నొకప్రత్యేకవిమర్శన మల్లియున్నాను. వీరు బాహుకవేషమును, అశ్వత్థామభూమికను మిక్కిలి సామర్థ్యముతో నభినయించినట్లు వింటిని గాని వాని జూచి యుండలేదు. నేను చూచినవానిలో భారతనాటకమునందు ధర్మరాజు వేషమును, రసపుత్రవిజయమునందు రాజసింహుని భాగమును మిక్కిలి చతురతతో నెరవేర్చిరి. లక్ష్మీకాంతముగారు గొప్పపాటకుడుగాదు. కాని పద్యమునకు రసపుష్టినొసంగు గానకౌశల్య మేర్పడియున్నది. వెంకటశాస్త్రిగారి తరువాత నీయనగారిలో పద్యముల నర్థవాహక వైశద్యముతో, స్పష్టముగ రసభావయుక్తముగ నుచితమగు సంగీతముతో శ్రోత్రానందముగ జదువనేర్చినవాడీ లక్ష్మీకాంతమే. ఈతడభినయించునపుడు కావ్యసౌందర్య మెరిగినవారందరు వీరితోడి సంగీతమున కెన్నరుజూడక, గానలోపము నధిక్షేపించక, శ్రద్ధతో హాయిగ తెలుగు పద్యముల రసభావము ననుభవించుచుందురు. నాటకాభినయమున కెంతసంగీత మవసరమను రహస్యమా చుమరో, నాట్యతత్వమెరింగిన గానవిద్యాధిపు లెంతసంగీతమును నాటకాభినయమునందు వినియోగింతురో, అంతసజ్ఞానము లక్ష్మీకాంతముగారి కమరియుండుటచే నితడభినయించునపుడు గానప్రావీణ్యలోప మేమియు నెంచియుండలేదు. వీరు ఆంగ్లవిద్యయందు నాటకవిమర్శన మెరింగిన యనూనావకాశము కలవారగుటయేగాక చక్కని లౌకికజ్ఞానము, మానవస్వభావ విమర్శనశక్తియు కలిగి తామభినయించు పాత్రముల

సంప్రదాయమును పురాణేతిహాసములనుండి గ్రహించి విమర్శించి పాత్రస్వభావమును వివిధములగు పట్టులలో మనుష్యులకుండు గుణములను లెస్సగ బరికించి యభినయింతురు. విగ్రహము కూడ అనేక వేషముల కొప్పిదముగ నుండును. వీరి వేషము మొత్తముమీద స్వభావసహజముగనుండి ముఖముద్రలందు రసభావములు చక్కగ ముద్రితమై యగుపడును. హస్తవిక్షేపణము కొన్ని అలవాటులకు బానిసయై తర్కవాగ్వాదము లొనర్చువాని బల్లగుద్దువాదింపులను జూపుచున్నదని కొందర భిప్రాయపడుచున్నారు. లక్ష్మీకాంతము రసోద్వేగమున మైమరచి భావసాంకర్యమును విపరీతచేష్టలను చూపగల నటుడు కాడు. తెలివి, శాంతము, విమర్శకశక్తి, కరుణాప్రవృత్తులు, ప్రధానలక్షణములై యితరరసములకవకాశములను జొదు మేధాసంపన్నుల గుణవిశేషముల చక్కగ నభినయింపగలడు. అనగా తన నిత్యజీవనపద్ధతుల కనుకూలమైన పాత్రములనే యెక్కువ సామర్థ్యముతో నిర్వహింపగలడుకాని, లక్ష్మణస్వామి షమేరుసింగుభీభత్సమును, నరరాజరావు పఠానుమతిభ్రమణమును, రాఘవాచారి రామదాసభక్తిపిశ్చేష్టతను, సంబంధమొదలియారు యాగోకౌటిల్యమును, గోపాలర్సు శకారశ్యాలకత్వమును ప్రకటించునట్లు నిజస్వభావమునకు సంపూర్ణవిరుద్ధమునగు నాటకపాత్రలతో గుణరూపసాదృశ్యమొంది యభినయించలేదు.

లక్ష్మీకాంతము ధర్మరాజునందలి నిజసత్వమును చక్కగా గ్రహించియున్నాడు. భారతవీరులలో భీముడు

అంతరంగమున మంచివాఁడై లోకములో దుడుకుతనమునకు ఖండవాదమునకు నపకీర్తిగొనినవాఁడు. ధర్మరాజు సామాన్యముగ ధర్మవర్తనుఁడయ్యును పెద్దలయెడ భక్తివిశ్వాసముల జూపి వినయాదిసద్గుణములకు పేరొందియున్నను "నలసినచో నబద్ధములు పల్కఁగవచ్చు" నను లోకలౌక్యుఁడు. ధర్మరాజంత గూఢాలోచనవాఁడు భారతములో లేఁడు. ఈసంగతి నెఱింగి రాజసూయాధ్వరమూర్ధాభిషిక్తుఁడై రాజన్యమాన్యత లందికొనిన పాండవాగ్రజుని రాచపోకడ లనుసరించుచు "మాట తేనెతేట మనసువిషము" అను లోని నిజమెఱింగి ధర్మరాజ గుణానుకూలముగ నభినయించెను. అదివఱకు నాటకరంగములలో ధర్మరాజు పట్టుబట్టలు మడికట్టి శ్రాద్ధయోగ్యముగా నగవకుండు విరాగిచూపులతో చేతకానిశాంతముతో నిర్వీర్యముగ క్షత్రియజన్మవాసనలకన్న పురోహితలక్షణము లెక్కు వేర్పరచుచు గుంపులో పాడినట్లు రాజనీతినెఱుఁగని దైన్యముతో కనుపడుచుండెను. మఱికొందఱు నటులు చమక్కు దుస్తుల పూసతళుకులలో ధర్మరాజు సౌశీల్యమును మఱుగుపెట్టి సామాన్యరాచవిగ్రహమువలె చూపుచుండిరి. ధర్మరాజు నిత్యవ్యవహారములలో దయాసత్యశీలము లొప్పుచు నవసరమైనప్పుడు దుర్భేద్యమగు రాజనీతిని సమరస్థిరధరత్వమును ప్రకటింపగల సర్వసమర్థుఁడు. ఈసత్యమును లక్ష్మీకాంతము భారతావలోకనమున జక్కఁగా గుర్తించి ధర్మరాజునోట "తర్పణములు నీకుతండ్రి" అని చప్పువైదికునిగ జూపక కథావకాశముల ననుసరించి యేగుణములు ద్యోతకార్హములో వాని నుచిత

రీతుల ప్రదర్శించి ధర్మరాజ పాత్ర నిర్వహణమున కమూల్యమైన వ్యాఖ్యాన మొనర్చియున్నాడు. ఏపట్టున నెట్టి ముఖవైఖరులు, కాకుస్వరములు అవసరమో భారతసామ్రాజ్యధూర్వహుడగు నీతివిత్తము డెట్టి రసావేశముల జెందగుడో వానినెల్ల యథార్థముగ జూపియున్నాడు. అర్జునుడు కర్ణుని దాకజాలక "మాధవా మనరథం బికమరలనిమ్ము" అని ధర్మజు శిబిరమున మాటినపుడు తమ్మునిపై నలిగి వీరోత్సాహదీకంబుగ నభినయించిన తీరు నెన్నటికిని మరువనేరము. ధర్మరాజగుణాభినయములో లక్ష్మీకాంతమును మించినవాడు లేడు.

రసపుత్రవిజయములో రాజసింహుని వీరరసప్రధానగుణములను యథోచితముగ ప్రదర్శించి పరిషత్తువారి స్వర్ణపతకమును గెలుపొందియున్నాడు. శాంతస్వభావముగల ధీరనాయకుల వీరావేశము లెస్సగ నభినయించును. మంత్రిరాక్షసుని స్వభావమంతయు, వాని ఆర్యావర్తభూభరణసామర్థ్యము లక్ష్మీకాంతముచే చక్కగా ప్రదర్శింపబడినది. నగరాజరావు వలె అంతకన్న నెక్కువ యైతిహాసిక పరిచయముతో పాత్రగుణములను, కథాసందర్భమును విమర్శించి తా నేపాత్రాభినయమునకనుకూలుడో దానినే గైకొని పాత్రసాదృశ్యమొంద నేర్పేర్పడ నభినయించుచుండును.

—* హరి ప్రినాగరావుగారు *—

ఆనాటి విఖ్యాతపురుషు లీనాడు సామాన్యులగుచున్నారు. దేశకాలపరిస్థితులు కాలతరంగకల్లోలములో మునుగుచు,

దేశము, నూతనాదర్శములను నవ్యభావములను క్రొత్తపుంతలను యేర్పరచుచున్నవి. కావ్యములు, శిల్పములు యిట్టి కాలవిపర్యయమున కీర్తిలాభమునొందుచు ప్రజాసృష్టిలో గౌరవస్థైర్యమున కుంగుచు చక్రనేమిక్రమంబున నీచోచ్చ దశల నొందుచుండినను శిలాగతమైన శిల్పవైఖరులు గ్రంథ లిఖితమైన కావ్యసంపదయు దశాపరివర్తన మనుభవించునే కాని చప్పున చావనేరవు. ఒకకాలములో నవి తగ్గువడినను మరి యొకకాలములో సంపూర్ణప్రజాభీష్టమును వడయుచుండును. నాట్యకళ మనుష్యుని స్వకీయరూపమనోబలముల నాశ్రయించి సులభముగ కాలవిపర్యయ మొందుచున్నది. బళ్లారి రాఘవులు మహానటులుగను వ్యాఖ్యానములకును రసోపన్యాసములకును శాశ్వతస్థితి గల్పించుచున్నవి. విమర్శకులు కొంత వరకు నటవైఖరుల బుడమిపై నిలుపగలిగియున్నారు. యెవరెంతచేసినను నాట్యప్రతిష్ఠ నటుని జీవితకాలములోనే బాల్య ప్రౌఢవార్ధక్యముల భిన్నగౌరవము నొంది వానితో యంతరించుచున్నది.

హరిప్రసాదరావు కొందరచే నాంధ్రనటపితామహుడని గౌరవింపబడెను. ఈతనియందు కొంత భాగవత సంప్రదాయమున్నది. గుంటూరులో పుట్టి పెరిగి అచ్చటి ఫస్టుకంపెనీలో ప్రధాననాయకపాత్రధారియై చిరకాల మాంధ్రనాటరంగమునకు నాట్యాదర్శముల నాదేశించు నటరాజుగా వెలిగెను. గుంటూరులో గద్యనాటకములు, హిందీనాటకములు తొలుదొల్త నుండినదియు లేనిదియు నేనెరుగను. బందరులో

కన్న గుంటూరులో ఆకాలమున వీధిభాగవతములకును సంగీతమునకును యెక్కువ జనామోదముండెననుట నిర్వివాదాంశము. బందరు నాటకములలోకన్న గుంటూరువానిలో మొదటినుండియు సంగీతమున కెక్కువ అవకాశము గలుగుండెనని యూహించుట మాత్రము యథార్థమునకు దూరముగ నుండ నేరదు. 1896 ఆ ప్రాంతములకే గుంటూరు ష్టుకంపెనీ వడ్డాది సుబ్బారాయుడుగారి పద్యమయ వేణీసంహారమును, వీరేశలింగముగారి శకుంతలా హరిశ్చంద్రలను, కృష్ణమాచార్యులుగారి పద్యమట్లు నాటకములను అప్పటికి గొప్పగా నెంచబడిన సీనరీతో మంచి దుస్తులతో ప్రదర్శించుచుండిరి. అప్పటికే హరిప్రసాదరావుగారు సారంగధర, దుర్యోధన, నల, చంద్రహాస పాత్రముల గైకొనుచు స్త్రైపునకెల్ల జక్కనివాడనియు గానాభినయ సర్వాంగసౌకర్యము లేర్పడిన నటశ్రేష్ఠుడనియు పేరొందియుండెను. ఆవల దుష్యంత, హరిశ్చంద్ర, సుదేవ పాత్రములకూడ అభినయించుచుండెను. ప్రసాదరావుగా రానాడనుభవించిన కీర్తివైభవము నాటకసమాజములు తామరతంపరలై వ్యాపార పద్ధతులమీద నడుపబడు నీకాలములో నేరును పొందనట్టి మహావ్యాప్తితో నుండెను. ప్రసాదరావుగారి చూపులు, పోకడలు, నడపడి, హస్తములు, గాత్రవైఖరులు అభినయవిశేషములు మాత్రమేకాక వారి గానాభినయరీతులందలి లోపములు కూడ నాట్యాదర్శములుగ నెంచబడి బల్పురచే ననుకరింపబడెను. వీరి నటాధిపత్యకాలములో వీరియభినయకౌశల మంతగా జూచుభాగ్యము నాకు గలుగలేదు. కాని రాజకుమారుల

వేషములందుకన్న కొంతవరకును చెల్లిన దుష్యంత హరిశ్చంద్రాది పాత్రములకే వీరితరంగగాంభీర్య మొప్పెనని యభిప్రాయపడితిని. సారంగధరలో "అటవీస్థలములఁ గరగుముపూ వటపత్రంబులలో యుదమూ," "పావురము బడయుదము, భళిభళి తడయుక నేగుదము" మొదలైన కీర్తనలు పాడుచు తోడిబాలురతో విహారవినోదములఁ దేలు సారంగధరపాత్రము నెంతటి చకచకితో కౌమారసైజముగ నభినయించెను దుష్యంతభూమికలో "వాసనచూడనట్టి ప్రసవంబు"గ శకుంతల నూహించినపు డుద్దీపించిన ప్రౌఢశృంగార రసాభినయమందలి నేర్పు కనుపడకుండెను. ప్రసాదరావుగారి మేనివిప్పు చక్రవర్తుల కుచితమైన విశాలగాత్రగాంభీర్యమున నేర్పడి తొల్లిటినుండియు రాజకుమార పాత్రముల కనర్హముగ నుండెను. పెద్దవేషములలో బాలివాలా యొకడు తప్ప భరతఖండమున ప్రసాదరావుగారితో పోల్చదగిన రాజపురుషుడు లేడనియే చెప్పవచ్చును. బెంగుళూరి నాగేశ్వరరావు ప్రకృతిపు సామ్రాజ్యసైనికవర్గములోని రసపుత్రభూపాలకుల మేనిచందము దోప్పుచుండును గాని ప్రసాదరావుకెప్పుడు చక్రవర్తిలక్షణము లీతసియుండు కనుపడవు. హరిశ్చంద్రలో చివరభాగమునలో హితాస్యుని మృతకళేబరము నీక్షించి "తతహంసతూలికాతల్పంబునను జేర్చు మృదుతరదేహమా యిదికుమార! కమ్మసంపెగనూనె కడు రాచిపెంచిన ముంగురులా యివి ముద్దుకట్టు" మొదలైన పట్లను, శోకరసప్రధానముగ నభినయించు తెరవు లిప్పటికిని యతిశయింపబడలేము. సారంగధరలో శిక్షావిధాన మేర్పడుపట్టున "ఎంతటి

9

కూర్చుండేనియు, నెంతటినాస్తికుడుగాని యేమరక, నారిన్ నంతలు చింకైడువేళల జనించిన భాధతోలగు" ననుపద్యమందలి భక్తిరసమును నిక్కముగా గురిపింప గలిగెను. ప్రసాదరావు ధీరోదాత్తనాయకుల శృంగారశోకరసముల ముద్రించుటలో చతురుడు. కాని వీరభీభత్సముల బ్రదర్శింపజాలడు.

రుచులు మారినవి. ఆంధ్రనాటకరంగములశిక్షాక్రమము గానమందును, అరజ్ఞానమందును, అభినయసౌష్ఠవమందును కాలోద్వేగమున విపరీతగతుల విస్తరించుచున్నది. రాజకీయ రంగములందెట్లున్నో, నాట్యకళాభ్యాసకులందు కూడ నట్లనే "సుకృతిర్గతాయుః" అనిచెప్పవలసి యున్నది. తెలుగు నాటకముల సింగమై, యసమాన నటవిఖ్యాతి ననుభవించి నవ్యనటశేఖరుల కాదిశిక్షనొసంగి నాట్యాదర్శముల నాదేశించియుండిన ప్రసాదరావు క్రొత్తకాలపురుచుల నందికొనలేక "బ్రతికియున్నాడ జీవచ్ఛవంబనగుచు," ననుపెద్దనవాక్యముసు జపియించుచు, కాలయాపన మొనర్చుచున్నాడు. వీరినాట్యవైఖరు లీనాటిప్రజాపండితజనంబుల నాటకాదర్శముల కందకుండినను వీరికీర్తియు, మార్గదర్శకప్రభావము, నిరుపమగాత్రగాంభీర్యము నేటికిని ఆంధ్రుల గౌరవాస్పదమై వెలుగుచున్నవి.

—* యడవల్లి సూర్యనారాయణ *—

బందరుపట్టల తాటితోపులదాటి డెల్టాచేలచప్పిడిసీనరీ జూచి చిన్నరైలు కుంటినడకకు విసిగి యుల్లవ బెజవాడకూడలి

శేరి సంధ్యారాగశోభితమై గిరినగరసమ్మోహనవిభ్రమమై వెలుగొంది భావసంచలనసౌభాగ్య ముదయింపజేయు సుందరగంగ మవలోకించి నటిసించుచు యాత్రికుల దుఃఖదశల బాధ నోర్చుచు నిష్క్రమణద్వారాభిముఖులమై నడచునపు డుత్తమ తరగతి నివేశనాగారము మొదట—నొకరాజసమూర్తి యొంటు పోగుల చవుకళింపులు చూపుతళుకుల కచ్చెరువొందుచుండ లేతయూదాపట్టుకుచ్చు మకుటమై ముఖసీమ నలంకరింప కాంతులీనెడి చామనఛాయ నెమ్మొగము గాచబింకముల చెక్కడుబొమ్మవలె నుదారగంభీరవిలసనముతో రాజిల్ల డంబుమై గూర్చుండి యోరచూపుల పాంథుల నవలోకించు రాచ పోకడలుట్టిపడు నొకవిగ్రహ మగుపడును. పాంథులు సామాన్యముగ శకటాభిగమన మపేక్షించి విశ్రమించు జమీందారునిగ బలుమాఱు తలంచెడి ఈవిగ్రహమే సుప్రసిద్ధ దుష్యంతభూమికాధారుడగు యడవల్లి సూర్యనారాయణ!

తెలుగునాటకముల నవ్యవైఖరులకు తొల్లిటికుదురైన గుంటూరుపుర మీతని నివాసస్థానము. ప్రసాదరావు పెద లక్ష్మీకాంతము నాటకములలో సంగీతమును విరివిగ వాడుచుండ బాల్యమునజూచి వానిని నతిక్రమించు నుత్సాహమేర్పడినవాడు. నటులనాట్యరంగగీతికాక్రమములతో సంతసించి వానినే పరమావధిగ దలంచి యనుకరింపక భరతవర్షములోని ప్రసిద్ధగాయకుల గానసభలన్నిటిని వ్యయప్రయాసలనోర్చి విని వచ్చిన గానరసాభిరతుడు. నైజమగు కళాసక్తికి సిరిసంపదలు తోడై తీరనిరసావేశము నవ్యవైఖరీసమాలోకనమునకు

ప్రోత్సహించి నిరంతరము గానవిద్యారహస్యజిజ్ఞాసతో మెలం
గెడి రసికకళాభిలాషన కెట్టి సవ్యవైఖరీసంస్కారఫలితము
లందగలవో, యవియన్నియు సూర్యనారాయణగారి చేత
జిక్కినవి. వీనికి పరమేశ్వరు డొసగిన గాత్రమాధుర్యము,
గానవైఖరీసంచారనైపుణ్యము తెలుగుసీమల నలుదెసల నభి
నందింపబడు సంపద లొప్పుచున్నవి. వీనికితోడు విసుగుపరా
మయములేక తనసర్వస్వమును ధారపోసి గానప్రసిద్ధుల పాటక
చేరీలను నటశేఖరుల నాట్యసిద్ధిని చూచివచ్చిన సంస్కారము
సూర్యనారాయణగారి నాట్యగీతికారీతులందు రాజిల్లుచున్నది.
ఇట్టి ప్రయత్నపూర్వకమైన నిజప్రతిభాసంపోషణము మనవైపు
తెలుగునటులలో మరెవరికిని కలుగలేదు.

సూర్యనారాయణ పండితవంశములోని వాడు. తెలుగు
ప్రబంధములను, సంస్కృతనాటకములను, అలంకారలక్షణము
లను చక్కగా గరచియున్నాడు. సంగీతమం దెట్లో కావ్యనాటక
ముల రసావస్థలందును, అలంకారములందును అటులనే పెద్దల
యభిప్రాయములను, సిద్ధుల ప్రయోగవైఖరులను ప్రీతిమై
నెరుగవేడెడివాడు. సూర్యనారాయణ పైచూపు కెంతటి
రాచబిరుదముల గురిపించుచున్నను మానసము విజ్ఞులయెడ
వినయవిధేయతల నొప్పుచు నిరంతరరసాస్వాదనకుతూహలం
బున సర్వార్థజిజ్ఞాసపరత్వమున జ్ఞానసంపాదనాన్వేషియై మెలగు
చుండును. మన తెలుగునాటకరంగములలో ప్రజామోద మను
భవించెడి ప్రసిద్ధనటబాహుళ్యము తమకు సహజముగ నేర్పడిన
గానకౌశల్యమును యితరనటుల లక్షణవిహీనగీతికాక్రమము

లతో సానపెట్టి హార్మోనీవాని శిక్షాదేశముల ననుసరించి పెంచుకొందురే కాని సూర్యనారాయణవలె నుత్తమనటగాయక వర్గముల కళాసిద్ధి నరయజాలరు. ఇట్టులనే తమ కొద్దిచదువుల అన్వయజ్ఞానమును రంగశిక్షకుల రసవ్యాఖ్యానముతో మెరుగుపెట్టి యాంధ్రానభివిదితమగు సర్వజ్ఞానదారిద్ర్యముతో తమ పాత్రసంభాషణము నెట్టుకొందురే కాని సూర్యనారాయణ వలె నుత్తమశిక్షను పొందదలచరు. సూర్యనారాయణ తా నభినయించు నాటకముల అర్థమును సంప్రదాయమును పనివడి నేర్చుకొనుటయేకాక నాటకాంశమును అలుపు కావ్యములను, నాటకములను వేల్పువిద్దెలో, తెలుగుబాసలో గూలంకషముగ నభ్యసించెడి రసికుడు.

రాచపోకడల తెక్కుడుబొమ్మయై విలసిల్లు సుందరమూర్తికి రాచమర్యాదల తెలియ నలవరచియున్నాడు. నిసర్గమాధుర్య మూరెడి గాత్రసౌకర్యమునకు సకలదిగ్దేశగాయకాదర్శముల గానరీతు లలవరచియున్నాడు. పండితసంప్రదాయానుగతమగు కావ్యప్రసక్తికి వెలుయుజ్జ్వ రసభావవిజ్ఞానసంపదల నలంకరించియున్నాడు. పనివడి పలుమారు లభినయ మభ్యసించిన ప్రయోగదక్షతవలన నభినయములో సహజముగ నేర్పడని కౌశల్యదారిద్ర్యమును మెరుగుపరచియున్నాడు. భరతఖండమందలి నానారాష్ట్రముల నుత్తమనాట్యరంగముల జూచియు నటవర్తన మవలోకించియు నాట్యమర్యాదల జక్కగ గుర్తించి నటకసంపులచే పోకడబింకములచే మొత్తము మీద మెప్పించి నాటకాభిమానుల గౌరవ మందుకొనిన నేర్పరి. సూ

ర్యనారాయణ ఆంధ్రనాటకరంగస్థలమందు పొందుచున్న పెనుపేరు యిన్నిటి సమావేశమున గలుగుచున్నది. నగరాజరావుగారి వలె మరికొందరు పెద్దనటులవలె నీతడు ప్రయత్నించి నటవృత్తికి గౌరవము సంపాదించిన మహాభిమాని. సామాన్యముగ తెలుగుకంపెనీలలో ప్రధానపాత్రముల నభినయించు ధీమంతులు తమకన్న తక్కువవారి నలువురతో గూడి పేరుపెంపులజాడ లగయక నటులన్న సంఘములో తక్కువచూపు దెచ్చుకొని మారుమూలల బడియుండ సూర్యనారాయణ నిత్యవర్తనము స్వాభిమానపూరితమై యాత్మగౌరవసంరక్షణోద్దిష్టమగు పోకడలతో నందమై చెలగుచుండును. వీరు లక్ష్మణస్వామి, నగరాజరావు మున్నగు భావాభినేతల ముఖవిన్యాససౌకర్యము లొప్పకున్నను నటనైజము వీరియం దగుపడకున్నను తెలుగునటు లందరిలో ప్రయత్నపూర్వకమగు కావ్యసంగీతశిక్షను కలిగి తమనైజస్వభావమునకును నిత్యవర్తనమునకును అనువగు రాజవేషముల ధరించుటలో ప్రోడలై యుత్తమమగు సర్వతోముఖ సంస్కార సౌందర్య సంపదలతో నంగసౌష్ఠవమునకు వన్నెపెట్టి యుచితవిఖ్యాతి గొల్లగొనియున్నారు.

సూర్యనారాయణగారిని నేను 1910 లో గుంటూరు పురమున నొకచిన్ని నాటకసమాజములో పాడుచుండగ జూచియుంటిని అప్పటికి వీరు నాటకములలో విరివిగా నభినయింప మొదలిడలేదు. కాని, భావిసిద్ధి యొంతయు నానాటి గానస్వాతంత్ర్యమం దగుపడుచుండెను. తరువాత వీరు చెన్నపురి కరు

డెంబినప్పుడు వీరిచే పాటకచ్చేరి జరిపించి స్వర్ణపతక మొకదాని బహూకరించిన మిత్రవర్గములోనే నొకఁడను. అవల ననేక వత్సరములు వీరి దినప్రవర్ధమానవిఖ్యాతి వినుచు బెజవాడలో కలిసికొనుచు నుంటిని. వీరి సత్యవంతిపాత్రాభినయము, దుర్యోధనభూమికాధారణము మైలవరం కంపెనిలో చూచియుంటిని. కాని వీరిలో గలిగిన యానందమునకు పదిరెట్లు నిరుడు వీరు మా యింట నతిథులై యుండి ఒకనాడు పూర్వాహ్ణము మొదలు సాయంతనము వరకు గాత్రపోషణముతో జరిపిన కావ్యనాటకరసప్రసంగమే, యుదాహరణపూర్వకమగు నాటకరసభావోపన్యాసమే నన్ను మిక్కిలి సంతసింపజేసినది. సూర్యనారాయణగారి గాత్రమాధుర్యము తపలాహార్మనీల యనుకరణసహాయ మపేక్షించునదికాదు. ఆనాటి ప్రసంగము కట్టాపాపయ్యశాస్త్రులు మున్నగువారి ఘటితిలో నంతకన్న మిక్కుటమగు సంగీతరసజ్ఞతతో విజయనగరకావ్యపఠన నాట్యరసానుభవము మిగ్గైచుచు నుల్లము తల్లడిల్ల నందమై శ్రావ్యమై మనోహరమై యనిర్వచనీయ శోభావిరాజితమై వెలుగుచుండెను. సూర్యనారాయణగారు ఆంధ్రగాయకశిరోమణులలో నొకరని నేను చెప్పను. కావ్యాలంకారకోవిదులలో నొకరని మన్నించను. నాట్యకళారసజ్ఞులలో మొదటి తావుల వీరి నుంచను. ఆంధ్రభావాభినేతల మొదటితరగతిలో వీరిని జేర్ప నుద్యమించను. కాని కావ్యనాటకసంప్రదాయములను బహువిధ గానవైఖరులను నాట్యరంగమర్యాదలను మెచ్చఁదగిన సిద్ధిసమృష్టితో ప్రయోగవైదుష్యముతో

నన్నిట, సమానముగ మొఱపించుచు సిద్ధహస్తముగ నభినయిం చెడి ప్రోడ, నాట్యసార్వాధికారి సూర్యనారాయణ యని యే చెప్పవచ్చును. వీని మించి రంగములో గానతరంగ ముల నూగించి ప్రజాసంతుష్టి గలిగించిన నటులెందరో కలరు. కాని వారి గానవైఖరులు దోషపూరితములై సంగీతపరిజ్ఞాన శూన్యములై రసభావానుకూల్యత నెఱుగక ఆర్యావర్తదాక్షి ణాత్యగీతికాక్రమముల ప్రత్యేకోపయోగ్యత గమనింపక జెలు వొందుచున్నవి. పద్యముల నర్థయుక్తముగ జదివెడి నటులెం దరో కలరు; కాని పాత్రలక్షణముల కావ్యసంప్రదాయము నెఱిం గినవారు పెక్కులు లేరు. రాచవస్తుల డంబుమీఱెడి నాయ క వేషధారు లెందరో ఒడ్డుపొడుగుల సుందరమూర్తు లున్నారు. కాని నిత్యజీవనాభ్యాసమున, నైజముగ దోచెడి రాచపోకడల పొలుబింకముల నొప్పించెడివారు లేరు. ఇందులో నేవో ఒకటిరెండు లక్షణము లున్నవారే తెలుగునటులలో ప్రధా నులై వెలుగుచున్నారు. అభినయమందు ప్రత్యేకసిద్ధి నొందిన లక్ష్మణస్వామి, నగరాజరావు మున్నగు నటశేఖరులు సంగీ తాదులందు మెప్పువడయకున్నారు. రూపములో సూర్యనా రాయణ ప్రసాదరావునకు చాలడు. అభినయసంప్రదాయాభి జ్ఞతలో నగరాజరావు పొంత జేరనేరడు. గాత్రవిస్తరణమా ధురీప్రభావములో రాఘవాచారి నిరాఘాట సంచార మొప్ప నేరడు. ఆంధ్రగీర్వాణపద్యార్థముల గీతికావ్యాఖ్యానములో పాపయ్యశాస్త్రియడుగుల నడువనేరడు. జగ్గరాజు, గోవింద శాస్త్రి, లక్ష్మీకాంతముల రంగోచితగాత్రోచ్చారణసమన్వయ

మెఱుంగడు. కాని యిన్నిలక్షణములు నొక్కచోట నేకీభవించి మెఱపించి సొంపులొలికించు విపరీతఅపూర్వనటలక్షణ సముచ్చయము సూర్యనారాయణకు నొప్పియున్నది. సూర్యనారాయణ రంగప్రవేశము నొక్కంపుచూపులతో తియ్యని పాట పొంగులతో నిర్దుష్టమగు వర్ణజ్ఞానముతో రాచనడకల నిండు మర్యాదలతో గుణానేకసంలబ్ధగౌరవముతో మెరయుచు నిట్టిదని నిర్వచింపజాలని మహావైభవముతో భాసిల్లుచుండును. ఆంధ్రనటులలో సూర్యనారాయణ పొందినన్ని రాజసన్మానము లందికొనినవారు లేరు.

యడవల్లి సూర్యనారాయణ శాకుంతలములోని దుష్యంతపాత్రాభినయమునకు పేరొందియున్నారు. ఏ రీపాత్ర మభినయింపగ జూచెడి యదృష్టము నాకింకను లభించలేదు. కాని యీనడుమ చెన్నపురిలో సీతారామాంజనేయ నాటకసమాజమువారి శకుంతలప్రదర్శనము నభినందించుచు నాంధ్రపత్రికలో బ్రచురింపబడిన విమర్శనము సహేతుకముగ నగుపడినందున దాని నీయెడ నుదాహరించుచున్నాను.

శ్లో॥ కావ్యేషు నాటకం రమ్యాః నాటకేషు శకుంతలా
తత్రాపిచ చతుర్థోంకః తస్మిన్ శ్లోకచతుష్టయమ్.

కావ్యమణిమండలమునందు శాకుంతలనాటకము దివ్యానురాగవిలసితమైన మహామణి యని సుప్రసిద్ధులైన కావ్యమీమాంసకుల పొగడ్తలను బడసినది. శాకుంతల రామణీయకతను ప్రాచ్యపండితులె కాక గెయితె మున్నగు పాశ్చాత్యపండితులు సైతము కొనియాడిరి. దివ్యానురాగవిలసితమైన

మహాకవి కాళిదాసుని శాకుంతలమును ప్రదర్శించుటకు ప్రదర్శకుల కసామాన్యమైన ప్రజ్ఞావిశేషములు గావలసియున్నవి. శాకుంతలమునందు మాలతీమాధవమునందుగల చిత్రకథలు లేవు. ప్రేమరంగము తరులతాగుచ్ఛములతోను మృగశాబకములతోను తాపసజనముతోను శోభాయమానమైన కణ్వాశ్రమము. నాయిక వనమునందు పుట్టి పెరిగిన ముగ్ధాంగన. వల్కలము కుసుమపల్లవములు భూషణాలంకారములు. హృదయము నవకోమలానురాగభరితము. శృంగారమూర్తియైన శాకుంతల మనోహరంబులైన కోమలపల్లవప్రసూనములందును, హరిణపోతముల లాలనంబులందును విశుద్ధమైన ప్రేమరసాస్వాదనమును జేసి అవ్యాజమైన రసానందము ననుభవించినది. శాకుంతల రసానందమునకు విశ్వమును బంధించెడి ప్రేమసూత్రము మూలముగాని నాయికానాయకులను జేరదీసెడి కామసూత్రము మూలముగాదు. శాకుంతల మేనకావిశ్వామిత్రుల కామసూత్రమునకు సత్ఫలమై తపోధనుడైన కణ్వమహామునికి కూతురై సాత్త్వికజీవనము నవలంబించుచు తాపసోత్తములనడుమను సతీధర్మములను గ్రహించినది. ఉదయాస్తమయములను ప్రకృతిపరిసరంబులందు జీవించుచు ప్రేమరసమును సహజముగ ననుభవించినది.

నాయకుడు పూరువంశప్రదీపకుడై మహావైభవముల ననుభవించుచున్న దుష్యంతుడు. తాపసుల క్షేమసంరక్షణతత్పరుడైన మహారాజు. ధీరోదాత్తుడు. విశుద్ధచరిత్రుడు. వీరి యన్యోన్య సందర్శనమాత్రమునని విశ్వకారణమైన ప్రేమ

సూత్రబంధనము గలిగినది. విశుద్ధానురాగశోభితములైన హృదయములు కామసూత్రబద్ధములై భరతోదయముగలిగినది. ఈదివ్యానురాగపరిణయమును మహాకవి కాళిదాసు శాకుంతలమునందు మనోహరముగ నాచంద్రార్కస్థాయిగ వర్ణించెను.

విశుద్ధచరిత్రుడైన కణ్వమహర్షి ఈ శుద్ధానురాగపరిణయమున కానందించి యాశీర్వదించెను. సంసారవ్యామోహమును విసర్జించిన కణ్వమహర్షియును శకుంతలావియోగదుఃఖమును బొందెను. కణ్వాశ్రమమే శకుంతల వియోగదుఃఖమును వ్యక్తముచేసినది. ఈ వియోగదుఃఖమును హృదయము కరగునట్లు నాల్గవయంకమునందు కవి వర్ణించెను. ఈ కారుణ్యరసమే శాకుంతల నాటకమునకు హృదయము. బాల్యమునుండియును దుఃఖము నెరుంగని శాకుంతలకు కణ్వాశ్రమవియోగమును దుష్యంతుని తిరస్కారమును గలుగజేసిన పరమసంతాపము మహాకవిహృదయము మాత్రమె గ్రహింపగలదు. ప్రేమరసప్రవాహమునందు భర్తృసంయోగవియోగావస్థలందును స్వవాసస్థలమిత్రబంధు సంయోగవియోగావస్థలయందును గలుగు సుఖదుఃఖములు శాకుంతలనాటకమునందు గోచరం బగుచుండును. శ్రీ సీతారామాంజనేయ నాటకసమాజమువారు ఆమహానాటకమును ప్రదర్శించి చెన్నపురి పౌరులకు పరమానందమును గలుగజేసిరి.

నాటకప్రదర్శనమునకు రసానందము ఫలము. రసోదయమునకు ప్రత్యేకపాత్రలనైపుణ్యమును సమష్టిప్రదర్శనమును

మూలములుగ నుండును. కణ్వాశ్రమమునందు శకుంతలయును ప్రియంవదానసూయలును ముగ్ధాంగనలకు సహజమైన శృంగారవిలాసములతోను మిత్రసల్లాపములతోను నాశ్రమమునందలి తరులతా వితానములకు జలసేచనమును జేయుట మనోహరముగ బ్రదర్శింపబడినది. నారచీరెలను గట్టుకొని కుసుమాలంకృతులైన వీరి ముగ్ధవిహారములు శుద్ధశృంగారస్వరూపమును బ్రత్యక్షము చేసినవి. శకుంతలాపాత్రను ధరించిన ఉప్పలూరి సంజీవరావుగారు శృంగారవిలాసమును చక్కగ బ్రదర్శించిరి. రంగమునందు దుష్యంతుని ప్రవేశము శృంగారవిలాసమును సార్థకము చేసినది. రూపవయోవిలాసశీలములం దొండొరులకు దగియున్న శకుంతలాదుష్యంతుల సమావేశము శృంగారరసానుభవమున కవకాశము నొసంగినది. యడవల్లి సూర్యనారాయణరావుగారి దుష్యంతపాత్రధారణము ప్రేక్షకుల యాదరణమును బడసినది. సూర్యనారాయణరావుగారి వేషము, భాష, గానము, భావప్రదర్శనము ధీరలక్షణములను ప్రత్యక్షము చేసినవి. శకుంతలాదుష్యంతుల ప్రేమయోగమును కాముకయోగముగ బ్రదర్శించునపు డాసంయోగము వికారచేష్టలు లేకయు నార్యసాంప్రదాయముల కనురూపముగను ప్రదర్శింపబడినది. కామయోగమునకు వెంటనే గలిగిన వియోగమును బ్రదర్శించుటయం దవకాశములు తగ్గింపబడినవి. ఈ వియోగప్రదర్శనము విస్తరణమును గోరుచున్నది.

శాకుంతలనాటకమునకు హృదయము చతుర్థాంకము. కాళిదాసు దానియందు గంభీరముగ రసస్థాయిని చిత్రించెను.

ప్రేమరసాతీతమైన కారుణ్యరసము భక్తిరసమునందు మేళవించుచున్నది. కారుణ్యరసమునందు త్యాగము గోచరించునట్టు భోగము గోచరింపదు. శకుంతల తన్ను పెంచిపోషించిన కణ్వాదులను తాను పెంచి పోషించిన ఆశ్రమపరిసరములను విడిచి పోవునపుడు కణ్వాశ్రమ మంతయును కారుణ్యరసమయమై యొప్పినది. కణ్వుని పాత్రను గైకొనిన అద్దంకి శ్రీరాములుగారు కరుణారసమును చక్కగ గనుపరచిరి. శ్రీరాములుగారి గాత్రము, వేషభాషావిలాసములు చతుర్థాంక హృదయమును వెలుపరచుటకు దగియున్నను రసోదయమునకు స్థాయీభావ ముచ్చస్థితిని బొందవలసియున్నది. శకుంతలకు పితృవియోగము సఖీవియోగము ఆశ్రమవియోగము దుర్భరమై శకుంతలను శోకసాగరమునందు ముంచినవి. సంజీవరావుగారు రప్పగింతల సమయమునందు శోకరసోదయమును స్ఫుటము చేసినను శృంగార రస సమ్మోహము వెంబడించినది. ఈరసవికలత్వమునకు ప్రేక్షకులు మూలకారకులని యూహింపదగియున్నది. ప్రేక్షకులలక్ష్యము కవిహృదయ సందర్శనమునందు కాక పాటలయందును పదములందును తళుకుబెళుకులందును శృంగార విలాసములందును లగ్నమైనపుడు ప్రదర్శకుల లక్ష్యమును మధ్యమస్థితియందు సమ్మేళనము బొందుచున్నది.

శకుంతల పుట్టెడాశతో దుష్యంతునిమందిరము చేరినది. దుఃఖము నెరుగని కోమలహృదయము దుఃఖసముద్రమునందు మునిగినది. నూతనపరిసరములు, నమ్మి ప్రేమించిన పతితిరస్కారము, కణ్వశిష్యుల నిందారోపణములు, శకుంతల

హృదయమును భగ్నముచేసినవి. దుర్భరమైన యవస్థాభేదములను జూపుటకు సంజీవరావుగారు ప్రయత్నించిరి. శృంగార కారుణ్యశోకకోపరసములను వెనువెంటను బ్రదర్శించుట కష్టతమము. ప్రదర్శనములందనుభవముగల సంజీవరావుగారీభిన్న రసములను ప్రదర్శించినను శోకరస ముచ్ఛ్రితిని బొందవలసియున్నది. దుష్యంతుని పాత్రనుధరించిన సూర్యనారాయణరావుగారి భావప్రదర్శనము గంభీరముగ నున్నది. తాను చేపట్టిన శకుంతలన్ను నిరాకరించునపుడు సూర్యనారాయణరావుగారు చూపిన భావచేష్టలు సమయోచితముగ నున్నవి. నందనవనమునందు భరతసమావేశము, శకుంతలా సంయోగము కాలాతీతమువలన నంత ప్రముఖతను గాంచియుండలేదు. ఇది ప్రేమ ప్రదర్శనమునకు మూలకందము. ఇది నాటక ప్రదర్శనములందు విలంబమువలనను గలుగుచున్న లోపముగ నున్నది. కాలాతీతమువలనను చివరకు మూలపట్టు [illegible] సయితము విడిచి వేయుట సంప్రాప్తమగుచున్నది.

మాయింట జరిపిన కాలక్షేపములో దుష్యంతుని పద్యములకు, పట్టులను కొంతవరకు అనుభవించి యానందించిన నాకు పై విమర్శనము సూర్యనారాయణగారి దుష్యంతపాత్రసంపాదనాభివర్ణనమందు నిజమునే వెల్లడించినదని నమ్ముచున్నాను.

మైలవరంవారి నాటకశాలలో సూర్యనారాయణ సత్యవంతపాత్రమును ధరింపగా జూచియుంటిని. ఆనాటకము ప్రధానముగ సావిత్రికి యమునకు జెందియున్నది. సత్యవంతు

నకు దీనిలో నాట్యుడు అభినయావకాశము లెక్కువ. సూర్య నారాయణగారి సామర్థ్యము యీనాటకమునందు ఎక్కువ వెలుగలేదు. దీనినిగూర్చి యాంధ్రపత్రికలో నగుపడిన విమర్శన ముదాహరించుచున్నాను:

"సత్యవంతునిపాత్రను ధరించిన యడవల్లి సూర్యనారాయణరావుగారి అభినయవిశేషమును, గాన నైపుణిని, ధీరోదాత్తనాయకానుకూల వేషభాషాదులను యెన్నిసార్లు వర్ణించినను పునరుక్తిదోష ముండనేరదు. సత్యవంతుడు ద్యుమత్సేన మహారాజపుత్రుడయ్యును, బాల్యంబునుండియు వనవాసమును తాపసస్నేహమును అలవడియుండుటచే సావిత్రిని వరించునప్పుడును, ఆయమతో అడవికి కట్టెలు కొట్టబోవునప్పుడును, తాపసునివలెగాక రాజనందనునివలె వర్తించుచు నాగరకుడగు రాజు వనవిహారము బోవునటుల నుండెను. తాపసచర్య, వేష భాషణంబుల మాత్రమే గన్పట్టెగాని అభినయంబున లేదేమో యని శంకింప గారణం బగుచున్నది."

ఈవల నీనాటకములో సమవర్తియై మెప్పించినటుల గూడ దెలియుచున్నది.

ముత్తరాజు సుబ్బరావుగారు రచించిన శ్రీకృష్ణతులాభారములో సూర్యనారాయణగారి నాట్యసిద్ధి యీగతి వర్ణింపబడియున్నది:

"కృష్ణపాత్రమును యడవల్లి సూర్యనారాయణరావుగారు ధరించి, సర్వజగన్నాథత్వమును, బహుభార్యాప్రియత్వమును, మహామునులయెడ భక్తియు వివరముగ జూపిరి. భగవం

తనకు గల విశేషణంబు లన్నియును ఆపాత్రధారణమున వెల్లి విరిసెనని చెప్పిన నతిశయోక్తి గానేరదు.”

మల్లాది అచ్యుతరామశాస్త్రిగారు రచించిన ద్రౌపదీ వస్త్రాపహరణమునందు యడవల్లి సూర్యనారాయణగారు దుర్యోధన వేషమును ధరింపగ జూచి యానాటకములో వీరి సామర్థ్యవైదుష్యముల సంపూర్ణముగ ననుభవించితిని. భారత కథలో యితరకవుల నాటకములలో, అచ్యుతరామశాస్త్రి గారి మూలములో, దుర్యోధనుడు తొల్లిటినుండియు పుట్టుకవలన దుర్గుణాగారుడుష్టుఁడు, వంశవినాశకదుర్లక్షణముల పోగుగ చిత్రింపబడియుండెను. ఈతనికి పాండవులయెడ గలిగిన అసూయామాత్సర్యములు నైజముగ నెంచబడి యితరపాత్రముల సంభాషణములలో విష్కంభరూపమున వెల్లడింపబడుచుండెను. నాటకములలో ప్రధానపాత్రముల స్వభావపరిణామము గుణాభివర్ణనమువలన నిరూపింపకూడదు. కథాంశములో నేర్పడు నవస్థల ననుసరించి ప్రధానపాత్రముల గుణపోషణ మేర్పడవలయును. ఈ విషయమును గుర్తించి సూర్యనారాయణగారు దుర్యోధనుని మానస మసూయాతరంగముల నూగులాడెడి చందమంతయు, పార్థద్వేషపోషణమంతయు చూపు గద్యసంభాషణము లిఖించి నాటకములో నద్దాని నభినయించి యున్నారు. వీరి నడతలు రాజరాజున కుచితముగ నుండెను. ఎంతటి దుష్టనైజము గలవాడైనను వీని పుట్టుకకు భూతజాల మేవిధి తల్లడిల్లినను, వ్యాసుని మన్మడై, గాంధారి పుత్రుడై, బలరాముని శిష్యుడై, భారతవంశదీపకుడై

గురు భీష్మాశ్వత్థామ కృపాదుల నిర్యాణవార్తావలి బంధుజన రాజరాజు సామాన్యమానవుల మహాహంకారముల నెన్నడు చూపనేరదు. సూర్యనారాయణ భారతసామ్రాజ్యధూర్వహుని రసావేశ మెట్లుండునో వానిమానసమున నసూయాబీజము లేగతి మొలకెత్తి మొగ్గదొడగునో తెప్పగ గుర్తించి యభినయించి యున్నాడు. ఈ భాగములో సూర్యనారాయణ వాచకము, అభినయము, నాట్యవైఖరి, నగరాజరావు గోపించ. శాస్త్రి మొదలగువారి కళానైపుణ్యమును జాటుచున్నది. అసూయాజనన మందున జేర్పవలదని కొంత యాటంకము కలిగించిరట! కాని, ఆ నాటకములో మిక్కిలి రమ్యముగ పట్టు ఒకవిధమగు మూర్ఛాసమ్మోహమును కలిగించునది. దైత గోపాలము విదురుడై పాడెడి "జగదీశుని మాయలు" అను కీర్తనవచ్చు భాగమైయున్నది. ఆనాటకమునకు ప్రాణ తేజం బొసంగి నాటకలక్షణ మేర్పరచినది సూర్యనారాయణ గారి అసూయోదయమే. ఈ భాగము ద్రౌపదీవస్త్రాపహరణమునకు ప్రతిపాదింపగల రసపుష్టి నెరింగి యీ రమ్యావస్థ నందున జేర్పనూహించిన నాట్యపరిజ్ఞాన మెంతయు ప్రశంసనీయమై యున్నది.

తెలుగునాటకములు అభివృద్ధిలోనికి వచ్చుటకు నాటక సమాజములు వ్యాపారపద్ధతులమీద నడుపింపబడవలయుననియు, పాత్రధారులకు కఠినమగు అభ్యాసశిక్ష, కావ్యసంగీత పరిచయము కలిగించవలెననియు సూర్యనారాయణగారి యభిప్రాయము. నాటకములలో కొన్ని తావులతప్ప మిగిలిన కథాంశ

మందు. గద్యమే ప్రధానముగ నుండి గద్యమునందుగూడ యభిన
యావకాశములు ఎక్కువ గలుగవలెనని వీరియాదర్శము.
పద్యములను చౌకబారుతు నాటకకర్తలవియుపయోగించుట
మాధు ప్రాచీనమహాకవికల్పితములైనవానిని యవసరమైన
తావుల నుపయోగించి వెలుగు నప్పుడెల్ల సంస్కృతశ్లోకములను
తెలుగునాటకములలో వాడి ఆతిఘాంశమునకు సంబంధించిన
రమ్యోత్తమసారస్వతమును ప్రేక్షకులకు అందించుటయు, జన
సామాన్య మెరుంగ.లని మహాకవి కల్పనల నిరుపమమాధు
ర్యమును జనుల కందజేయుటయు వీరి యుద్దేశ్యమై యున్నది.
పాత్రీమట్ల వెకిలిమోత్రలు విని నానందింపకున్నవి. సంగీతము
రసపుష్టిముగ నౌచితీవిచక్షణతో, నియమసంస్కారముతో
నాటకమునకు అచ్చటచ్చట మెరుపింపవలెననియు హిందూ
స్థానికర్ణాటకగాన పద్ధతులలో నెయ్యది ఏతావుల నుపయుక్త
మగునో దాని నాయెడ వాడుచు నుభయసంగీత సంప్రదాయ
ముల కిళి లొప్పించుచు రసపోషణ మనుర్చవలెనని వీరి
యభిప్రాయము. మొత్తముమీద సూర్యనారాయణగారు
యీనాటి ఏమర్శకాదర్శ మగు గద్యనాటకములం దభిమానము
గలవారు.

సూర్యనారాయణ ఆంధ్రనాటకరంగమున నిదివర
కెవ్వరు అనుభవించని గౌరవప్రభావ మొందియున్నాడు.
ఒక్కొక విషయములో నీతని మించనివారనేకులున్నను నట
రాజునకు వలయు గుణసమస్తముల మూటయై ఆత్మగౌరవ
మున కాలవాలమై పండితపామరుల నొక్కరీతిగ మెప్పించుచు

...స్నన లందికొనుచున్నాడు. ఈతని వైభవ పురోవృద్ధి ...లను పాపయ్యశాస్త్రిగారిదివంటిది. ఈతని పరిజ్ఞానము ...డభాషి వెంకటాచారిగారిదివంటిది. ఈతని దశ కోడి రామమూర్తిగారిది వంటిది. పుట్టుక వెంటనే, ధనమున్నను లేకున్నను, పాండిత్య మొదవినను జేకూరకున్నను, కళాప్రయోగదక్షత సిద్ధించినను లేకున్నను, సుఖమున్నను దుఃఖమేర్పడినను, జమీందారుల నిందుబింకములతో మహావిద్వాంసులవిజ్ఞానసమృద్ధితో, నటశేఖరుల కౌవైదుష్యముతో, నిత్యానందమందహాసములతో జెలఁగుచు తా నధివసించు పరిసరంబుల నిజప్రతిభాప్రకాశమున వెలిగించజాలెడి బలు విద్దిముల పోకిరినడతల నేర్పు, జీవితపు ప్రత్యేకవిలక్షణమూర్తి మన యడవల్లి సూర్యనారాయణ! ఈతని జీవితవైఖరులు మించు సరసనిత్యానందజీవి మన తెలుగువారిలో హాంధ్ర రత్న గోపాలకృష్ణు నొకనినే స్మరియింపగలము.

—* మల్లాది గోవిందశాస్త్రి *—

శ్రీకృష్ణుడు కపటనాటక సూత్రధారి.

"జననంబందుటలేని యీశ్వరుడు దా జన్మించుటెట్లో విరో
ధినిరాసార్థము వీతకల్మషగు నద్దేవుండు గర్భప్రవ
ర్తను డొల్ల జరాంతరప్రకట భూతశ్రేణులన్ గర్భవ
ర్తనులన్ జేయుదలంచి కాక, కలవే దైత్యారికిన్ గర్మముల్?"

భూభారముడంప నుదయించిన వాసుదేవుడు తామరాకుతోని జలబిందువును వోలి సంసారసాగరమున నీదుచు, వీరు

శృంగారముల నారీజనంబుల దనియించుచు విరోధ మెరుగని గా వ్యాసమున ధర్మవిరోధుల దండించుచు, ప్రేమతోని వలపులతో నుచితసత్కృతుల నాదరించుచు మునియై, సన్యాసియై, నిస్సంగుడై, త్రికాలజ్ఞుడగు యోగీంద్రుడై, ద్వాపరాంతపు భారతచరిత్రను నడిపించు మేటినటుడై యుండెను. ఈతని ప్రవర్తనము నౌదాసీన్యము, అన్నిరసముల బాహ్యస్వభావము లగుపరచినను నిస్సంగసాక్షిభావము ప్రధానాంశములైయున్నవి. రుక్మిణీకల్యాణసందర్భములో కృష్ణుడు వలపులపోరుగా కథానుకూలరసపారవశ్యమున నగుపడవచ్చును. శిశుపాలవధాకాలమున వీరరసోద్రేక మభినయించవచ్చును. నరకాసురవధలో కూడ నిట్టి వీరక్రోధములనే ప్రకటింపవచ్చును. కృష్ణలీలావిహారములందు గోపికలతో నాట్యకళా కౌశల్యకవిధములగు శృంగారవిలాసములను నేర్పుచు పలుమాటల ప్రౌఢయై, చేతలపోకిరియై కనుపడవచ్చును. కాని కృష్ణుడు ప్రియమిత్రునితో సంగీతములో నిజముగా జగత్ప్రాణతత్త్వము నుపదేశించుచు మోక్షసాధన మేర్పరచుచు, వేదాంతవైరాగ్యముల నలవరచుచున్నాడే కాని భౌతిక శారీరక మోహప్రచారముల నుద్బోధించుట లేదు. కృష్ణుని శృంగారమంతయు భక్తిసూత్రము. వేదాంతతత్త్వము, కాని పూవింటివిద్దెలపాకక్రియములు కావు. ఇతని ప్రణయాభినయములో నెంతవరకు అంతర్గతమైన వేదాంతవైరాగ్యములు, లీలాకపటరసానుభవములు ప్రకటముగ స్ఫురించుచుండవలెను. అందుచేతనే బొగుస్తూకంపెనీల ఉపిపి బాలకులు, కామవికారమొందని పిన్నవాండ్రు, కృష్ణలీలలో

[illegible] తలంపరాదు. అభినయించు [illegible] కృష్ణుని బాల్యకౌమార ప్రాయోచిత లీలాశృంగారములు [illegible] రూపముగ, సలక్షణముగ గోచరించుచున్నవి. [illegible] నరసింహాము రుక్మిణీకల్యాణములో నభినయించెడి [illegible] వలపులు కృష్ణున కాపాదింపదగినవి కావు. కృష్ణుని ప్రే[illegible] మేవిధి వైరాగ్యసూచకమో అట్లనే కృష్ణుని క్రోధవిరోధము లుకూడ లోకానుగ్రహకాంక్షతో సర్వసమత్వముతో ద్వంద్వస్వభావమెరుంగక "ఎవ్వని కరుణింప నిచ్చగింతును వాని యఖిలవిత్తంబు నే నపహరింతు" అను వాక్యమున కనుకూలముగ విరోధపరాక్రమమం దమితవాత్సల్య మేర్పడునట్లు ప్రకటింపవలసియున్నది. కావున కృష్ణపాత్రమును ఏయొట్టి సందర్భమున అభినయించినను కృష్ణుని నిశ్వసత్వమును తుణికావేశములను జూపుచుండుట నటున కేర్పడవలెను. అందులో ముఖ్యముగ భారతకథాసందర్భమునందయు నిట్టి నిస్పృహతో, నిస్సంగతతో, సాక్షిభావముతో, సమత్వముతో, నౌదాసీన్యముతో నడుపవలసియున్నది.

మల్లాది గోవిందశాస్త్రి గుంటూరు సెకండుకంపెనీలో పాండవనాటకములందు శ్రీకృష్ణవేషమును వహించుచుండెను, ఆయాభారములలో నీతని యనురూపరూపము, కృష్ణస్వభావ పరిజ్ఞానము మిక్కిలి ప్రశంసనీయముగ నుండెను. భారత యుద్ధసమయమున కృష్ణునకట్టి వయసుండునని మన మూహింపగలమో, అట్టి తారుణ్యమొప్పెడి రూపముతో నీలమేఘ శ్యామమగు సుందరాననముతో, క్షాత్రస్ఫూర్త్యుచితమైన గాంభీ

ర్యమును, కోమల సౌకుమార్యమును జూపునొడలితో, పద్మ
దళములబోలు విశాల నేత్రములతో కృష్ణుని లీలావిజనత్వ
ములు రెంటిని ప్రకటింపగల ముఖలక్షణములతో గోవింద
శాస్త్రి కృష్ణరాయబారములో సాక్షాత్తుగ శ్రీకృష్ణుడే యన
నొప్పుచుండెను. గోవిందశాస్త్రి నైజమగు వచ్చె కృష్ణవ్యాఖ్యాన
మును, శ్రీరామ వ్యవహారములను గుర్తించి కృష్ణపాత్ర
మభినయించెనో లేక పురాణేతిహాసపరిచయమున నట్టి యస
మాననటసిద్ధి సంపాదించెనో మేమెఱుగము కాని రాయబా
రములో నితని నడతలన్నియు కృష్ణుని యౌదాసీన్యమును
జూపించుచు రాచకూటముల రాయబారముల బరువు మంత్రి
సత్తముల చాతుర్యసామర్థ్య మంతయు జూపుచుండెను.
గోవిందశాస్త్రి రూపవేషాభినయములు, పాత్రానుకూల
ముగ నుండుటయే గాక చతురోపాయముల వచించునట్లు నా
ట్యసందర్భముల కనుకూలమగు కంఠస్వరము, రాచమర్యాద
లెఱింగిన సంభాషణానైపుణ్యము మెఱసి యీసందర్భమును
నాట్యరంగమునుండి తప్పించి సహజముగా కౌరవుల నిండోలగ
మే యను భ్రాంతి గలిగించుచుండెను. గోవిందశాస్త్రి మంచి
పాటగాడు. నవరసములను నిండుపొంకమున జూపగలసమర్థుడు.
ఇతర వేషములలో నితని రసావేశప్రవృత్తులను చూచినందు
ననే కృష్ణపాత్రాభినయమందలి యాత్మనిగ్రహము, కపటనట
లక్షణము సంకల్పావలంబితముగ నెంచి యింతవరి పొగడవలసి
వచ్చినది. అపశబ్దదోషముగాని గ్రామ్యపాతిత్యముగాని పొంద
క గద్యపద్యసంభాషణములకు నాటకవైఖరులు లేకుండ సహజ

# విషయసూచిక

## ఆఱవదళము

# ఆంధ్రనాటకవిమర్శనము

—* ఆంధ్రనాటకములు *—

### కొన్నిసమాచారములు

(కోలాచలం శ్రీనివాసరావుగారు.)

నాటకాభివృద్ధిని గుఱించియు, ప్రదర్శనాభివృద్ధిని గుఱించియు నీదిగువ వ్రాసిన వాక్యముల ననుసరించినచో గొంతవఱకు మార్గమగునని తలంచెద.

### నాటకకవులకు నొకవిజ్ఞప్తి.

(1) పౌరాణికేతరములగు నితివృత్తములు నూతనముగను, ప్రదర్శనీయములుగను నుండనిండు. పాత్రములు రంగస్థానములు వదలిపోవునప్పుడు దప్పిశికముండక భాషాచమత్కృతివలనను విషయచమత్కృతివలనను జనులకు నాహ్లాదము గలిగించియు ముందేమి జరుగునోయను కుతూహలాయత్తచిత్తులగు నటులజేసియో దిదృక్షువుల మానసములను నాటకాపేక్షాపాశమున బంధింపుడు.

(2) జనసామాన్యమునకు నాటకాభిరుచి కలుగువంతవఱకు మీ నాటకములు సంస్కృతనాటకంబులవలెగాక పెంచివ్రాయుడు.

(3) చరిత్రనాటకములదప్ప నాయికానాయకుల మరణము రంగస్థానమున జూపకయుంట క్షేమము.

(4) దుర్నీతివిషయము, మొరటహాస్యము వదలుట మేలు.

(5) స్త్రీని ముద్దిడికొనుట, కౌగలించుకొనుట మొదలగు పాన్పుగది విషయములు రంగస్థానమున బ్రదర్శింపనటుల నుంచుడి.

ఇతివృత్తమునకు ముఖ్యవిషయమే యదియైనయెడల విధిలేదు.

(6) వినయగౌరవమునుబట్టి భాషను మార్చుట మేలు.

(7) ఒక నాయకునిపై నొక నాయికపై నాటకమంతయు నాధారపడులాగున నొనర్పకుడు.

(8) అనివార్యావశ్యకపక్షమున నుండినతప్ప యుద్ధమును రంగస్థానమున దేకయుండుడి.

(9) నీ నాటకములందలి రంగముల యల్లిక యెటులుండవలయుననిన, నొకవేళ కాలసంకోచతమున గొన్నిరంగముల వదలవలసివచ్చినప్పుడు కథకు లోపము లేకుండునటుల గొన్నిరంగములు దీసివేయులాగున నుండనిండు.

(10) మనలో నాటకములు వ్రాయును విషయము లనేకములున్నవి. కావున నొకకవి నాటకముల వ్రాసినవిషయమునే వేరొకకవి నాటకములు వ్రాయుట తగదు.

(11) విధిలేక వచ్చినప్పుడుతప్ప, భూతప్రేతపిశాచములకు రంగస్థానమున నిల్పకుడి.

(12) వ్రాయబడిన నాటకము లెటులైనను ముద్రింపించుట భాషాభివృద్ధికి గారణమగును.

## —♦ పాత్రములుగా నుండువారికి విజ్ఞప్తి ♦—

(1) నాటకమంతయును రెండు మూడుతూరులు, చక్కగ జదువుడి. చదివి మీరు ధరించు భూమికవిషయమును విమర్శించుడి. ఇతరపాత్రిలతో మీభాగమెట్లు సంబంధపడినదో చూడుడి. అట్లు సంబంధపడియుండిన ఆ దల వారిఁగూడి యిరువదితూరులకంటెను దక్కువ కానటుల పఠించు

చుండుడి (Rehearsal). మీరు పఠించువాక్యములందేరసముముఖ్యమో, యారసమును నేయభినయరూపకముచే ప్రదర్శించిన బాగుగా నుండునో దానిని నభ్యసించుడి. ఇందున ముఖభావము ముఖ్యము. హస్తచలనము మాటికి మాటికిని జరుపు టనవసరము. కంఠమాధుర్యము ఆయాపాత్రలకు దగినంతవరకు ముఖ్యము. ఇంతియును వేషములను ధరించువా రభ్యసించినయెడల, రంగస్థానమునందు కలుగు రసావేశంబు మీకు సాహాయ్యపడును.

(2) రంగస్థానము మీరు ప్రవేశించినపుడు, మీ రెవరైనది మఱచి, మీ రేవేషమును ధరించినవారో, వారే నిజముగా మీరని తలంచుడి. Edmund Kean చరిత్రను చదువుడి.

(3) మానసమునందు రసభావమునకు భిన్నముగా ముఖభావ మగపఱచుసమయము లెటస్థించును. అట్టి విరుద్ధములగు భావముల బ్రదర్శించు కౌశలము మీ రార్జింపవలెను. (దృష్టాంతము) ధృతరాష్ట్రునియొద్ద దుర్యోధను డుండుకాలమున, పాండవు లాగృహంబున జచ్చిరను వార్త వచ్చును. దుర్యోధనుడు మనమున సంతసించును. ముఖభావముచే నత్యంతఖేదమును జూపును. దీనిని నభ్యసింపవలెను.

(4) మాట లెచటెచట నెంతకాలము నిలుపవలయునో, యేమాట లెటుల రెత్తిపలుకవలయునో, యేయక్షరము నెటు లుచ్చరింపవలయునో చక్కగ నేర్వవలయును.

(5) మీభాష నెమ్మదిగా నుచ్చరింపుడి. ఆత్రపడితిరేనిం జెడుదురు.

*(a)* వాకిలికి తాళముపేసి చెవిని జేబులో వేసికొనె ననుటకు బదులుగా నాతురపడి ఒకపాత్రము 'చెవికి తాళము వేసి. వాకిలి జేబులో వేసుకొనె' నని హాస్యాస్పదురాలాయెను.

*(b)* వెలుగుబట్టుకొని మనుష్యుడు వచ్చుచున్నా డనుటకు బదు

లంగా 'మనుష్యుని బట్టుకొని వెలుగు వచ్చుచున్న'దని పలికి హాస్యాస్పదుడాయెను.

(6) రంగస్థానమున మీరు మాటలు సూచించువానియొద్దకు బోవను గాని, వానిదిక్కు వీనులొగ్గి వినుటకుగాని యత్నింపకుడి. నగుబాటగును.

(7) ప్రమోదుపడిన మొద్దులాగున నిలుచుండి నిద్రలో మాటలాడు వానివలె మాటలాడినచో, సంతటి నాటకంబైనను జెడునటకు సందియము లేదు. చిలుకపలుకులంబలె నుచ్చరించుట తప్పు. శబ్దములు మ్రింగుట దోషము.

*(a)* సంఘమున విద్యావిహీనులు పలువురుండెరేని గొప్పనాటకము లాదనిచ్ఛగించుట యపయశమునకు గారణమగును. ఈవిషయమున సునందనీపరిణయములోని ప్రారంభపీఠిక జదువనగును.

(8) ఆత్మగతమున మాటలాడువిధము, ఇతరులతో మాటలాడువిధము, ప్రక్కకుబోయి మాటలాడు విధము, పరాక్రమముజూపునపుడు మాటలాడు విధము, మోహించిన స్త్రీ సరసపుమాటలాడు విధము, పిచ్చియెత్తినపుడు పిచ్చియెత్తిన పిదప మాట్లాడువిధము, పశ్చాత్తప్తుడై మాట్లాడువిధము, సర్వవిషయత్యాగియై మాట్లాడువిధము, ప్రాణములపై నిరాశచేసుకుని మాటలాడు విధము మారుచుండును. దీనివిషయమున నొకరొక రొకవిధము నవలంబింతురు. దీనిని గమనించి యాయావిధము లభ్యసింపవలెను.

(9) భూమికలను ధరించువారిని దప్పులుపట్టినచో దానికి సైరించుకొనియుండుట గొప్పగుణము. పాత్రి యాత్మగౌరవమును గాపాడికొనుట మరియును గొప్పగుణము.

(10) గానరూపకముగ బాటలుపాడునట్టిపాత్ర తనకంఠ మెంతటిదే చూపక శబ్దోచ్చారణ స్పష్టముగ నుండులాగొనర్పవలెను. పాడునపుడు చేతితోగాని కాళ్లతోగాని తాళము వేసికొనగూడదు.

(11) పాత్ర యెప్పుడుగాని తనవీపు దిదృక్షువులకు జూపగూడదు. ఎదుటనుండుపాత్రతో మాటలాడుచుండినను నర్థము, మోము దిదృక్షువుల

దిక్కున నుంచవలెను. పాత్ర తనమాటలతో రంగస్థానము వదలుచుండిన యెడల మాటలాడుచు లోనకు వెళ్ళవలయును. రంగస్థాన ముత్తరిగ నెప్పటికి నుండగూడదు.

(12) విశేషము కోపమున నుండిపడినపాత్ర వెంటనే ప్రసన్నముఖు డగుట తప్పు. క్రమక్రమముగ కోపము దిగుచుండినవానివలె ముఖభావము సూచింపవలెను.

(13) పాత్ర తనభాగము ముగిసెనని దిదృక్షువులలో నొక్కడుగ కూర్చుండరాదు.

(14) అన్నివిషయములకంటెను పాత్రకు కష్టతరమగునది వేషమును ధరించుటలో కలిగించుకొను ప్రావీణ్యము. ఒక్కతూరి వయోవంతుడుగ నుండవలయును. ఒక్కతరి శ్రీమంతుడుగ, మరియొక్కతరి బిచ్చగాడు కావలయును, ఒక్కతరి దొంగ కావలయును. ఇటుల వేషములు మార్చుట కష్టము.

(15) హిందూనాటకములు గద్యరూపకములు గావు. పద్యగద్యములతో గూడినవి. నాటకప్రదర్శకులందు పద్యములు గానరహితముగ గద్యరీతిగ చెప్పవలయుననియు నటుచెప్పుట యస్వాభావికముగనుండుననియును కొందరభిప్రాయపడుచున్నారు. ఒకపాత్రము తనకు సంభవించిన పుత్త్రవియోగాది శోకమున కన్నీరుగార్చునపుడు సైతము గానయుక్తముగ పద్యములు చెప్ప నగుట చిత్రమని వాక్రుచ్చుచున్నారు. అభిప్రాయము పొరపాటనుటకుగల కారణములలో కొన్ని యీక్రిందవివరించినాను.

(అ) స్వాభావికముగ నుండవలెననినచో పాత్రములు తమతమ గృహములలో మాటలాడుకొనురీతిగనే రంగస్థానమున సైతము మాటలాడవలసివచ్చును. అటు లొనరించినచో నాటకము పేలవమగును. రుచికరముగ నుండదు. అట్టిది ప్రహసనానుగుణ్యమగు భాషగానుండును గాని నాటకభాషగా నుండదు.

(*b*) ఛందోబద్ధములు, పద్యము చెప్పుట యస్వభావవిరుద్ధము. పద్యములు లేక గద్యతోనే నాటకములు వ్రాయుపద్ధతులు ప్రారంభమునుండియును నేదేశంబునను లేవు. ఇప్పటివారు వ్రాసిన యెద్దియో యొకనాటక మట్టి గద్యరూపకముగ నుండినచో నది ప్రదర్శనమునందు రుచ్యముగ నుండదు.

(*c*) ఇక ఛందోబద్ధముగు పద్యమును మాటలరీతిగ జెప్పుట సహజము కాదు. మాటలరీతిగ బద్యములు చెప్పినచో ఛందస్సేల? క్రోధావేశపరవశుడైనపుడును, అవసానసమీపకాలమునను, పాత్రము గానమించుక తగ్గించి గద్గదస్వరమున జెప్పినను జెప్పనగును.

(*d*) పాత్రము శోకకారణంబున నేడ్చునపుడు పద్యము చెప్పుటయు దానిని గానరూపకముగ జెప్పుటయు స్వాభావికవిరుద్ధములనుట లోకానుభవమును బట్టియుండదని నా తాత్పర్యము. పల్లవారుగాని యాడువారుగాని దీర్ఘములుతీసి రాగములతో నేడ్చుట స్వభావము.

(1) మనుచరిత్రములో వరూధిని "ఏడ్చె గలస్వనంబుతో" నని యున్నది.

(2) పారిజాతాపహరణములో సత్యభామ "బాలపల్లవగాత్రి సకసాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్" ఏడ్చెనని యున్నది.

(3) వసుచరిత్రములో గిరికన్య "కాంభోజీమేళవిపంచికారవసుధాపూరంబు తోరంబుగాన్" ఏడ్చెనని యున్నది.

ఇటులనే యేడ్చునపు డనేకరాగము లుపయోగించుట స్వభావము. రజతగిరిలో హస్తములు చిక్కినపుడు రావణు డనేకరాగముల నేడ్చెనని ప్రతీతికలదు. ఈగృహసాంబంధికభాషకును, ఉపన్యాసభాషకును, పురాణభాషకును, ప్రహసనభాషకును, నాటకభాషకును విశేషతారతమ్య మున్నది. ఈభాషణముల యుచ్చారణవిధములు వేఱు, కొనవిరుపులు వేఱు.

(4) నాటకములందు పాటలు బాడుట పార్శీలనుండి కఱచిన నూతనాంశము. చక్కగ పాడువా రుండినయెడల పాటలు సంతోషకరముగ

మంకును. ఆనందనాయకములగునవి స్వాభావికవిరుద్ధములని వదలుట న్యాయమేము గాదు. పాశ్చాత్యులలో "Italian operas" అని పాటలతో నాటకము లాడెదరు. నాటకములలో సైతము sonnets అని పాటలు పాడెదరు. నాటకములే స్వాభావికవిరుద్ధములగుచర్యలు. ఎవడో యొకడు శ్రీరామునంతటి భూమికనుధరించుట విరుద్ధముకాదా? రాజు పదివేలేండ్లు తపం బొనర్చుట, పుత్రుడు గల్గులాగు దైవము వరంబొసగుట, భార్యగర్భిణియగుట, పుత్రునిగనుట, పుత్రుడు పట్టాభిషిక్తుడగుట, యిట్టివి యన్నియును, రంగస్థానములలో పదినిమిషములలో జరిగిపోవును. ఇది సహజమేనా? నాలుగు చెట్లును, బచ్చని వర్ణమున వ్రాసిన యొక్క నేపథ్యమును జూపి యిది సింహశార్దూలాది. క్రూరమృగములుగల ఘోరాటవియని యెన్నచు నందున రాజులు వేటాడుట స్వాభావికవిరుద్ధముకాదా? స్వల్ప విషయములనుబట్టి దిదృక్షువులు గొప్పవిషయములు తమమానసమున భావించుకొనునంతటి శక్తిగలవారుగ నుందురని నాటకప్రదర్శకులు నమ్మెదురు. పూర్వకాలమునందువ్రాయబడిన యక్షగాననాటకములలో పాట లుండెను.

(16) మీ భాగపుమాటలు చక్కగ వర్ణింపక రంగస్థానమున నోటికి వచ్చిన మాటలాడితిరేని మీరు హాస్యాస్పదు లగుటయేగాక నాటకమును జెఱతురు. యెంతటిశక్తిగలపండితునకుగాని వ్రాసి నేర్చుకొనిన మాటలు వచ్చి నటుల స్వేచ్ఛగా రావు. వచ్చినను సొంపుగ నుండవు.

(17) రంగస్థానమున పాత్రములుమాటలాడునపుడా మాటలను సరకుసేయక మార్గముపెట్టుకొనుట తప్పు. ఉదాసీనభావప్రదర్శనంబున నది యొప్పు. పాత్రములతో సంభాషణము జరుపునపుడు కర్తప్రత్యుత్తరములనుండి కలుగు రసోచితభావములను ముఖమునందు నగుపడజేయవలయును.

(18) వేషమునకు దగినవస్త్రము లుండవలెను. ఏయేదేశపురాజులు

యోధులు, జనులు, నేయేవిధములగు వస్త్రములు ధరించుచుండి రనునది పూర్వచరిత్రలు చదువుటవలన దెలిసికొనవలెను.

(19) వేషమునకు దగినభాష యుండవలెనను నంశము విచారణీయముగనున్నది. రాజవేషమునకు స్వచ్ఛమగుభాషయు, సేవకునివేషమునకు నించుక గ్రామ్యముగనుండిన జాలునని కొందరతాత్పర్యము. ఆయాజాతికి దగినభాష యుండవలెనని మరికొందర తాత్పర్యము. అది శాస్త్రముగనుండిన నుండ నగునుగాని ప్రయోగానుగుణ్యముగాదు. తురుష్కాంగ్లేయాదిగాథ లితివృత్తములుగ గొని నాటకము రచించునపు డాయాజాతివారికి దగినట్టుల దురుష్కాంగ్లేయాదిభాషలు వ్రాయవలసివచ్చును. ఒకపాత్రముభాష మరియొకపాత్రమునకు దెలియకపోవును. జనులు 'నమోనారాయణాయ' యనుచు గూర్చుందురు. తెలుగుమాటలలో నట్టిజాతివారిమాటలు జేర్చి సంభాషణము సల్పినచో నెట్టి గాంభీర్యముగల సంభాషణముగాని హాస్యాస్పదమగును. కావున నట్టినాటకములే వ్రాయగూడదని యర్థమగును. తురుష్కాద్యన్యజాతీయులు సంస్కృతమిశ్రాంధ్రభాషను స్వచ్ఛముగ మాటలాడుట యసంభవ మను వాదము లోకజ్ఞానములేనివారివాదము. రాయచూరు, హైదరాబాదు పట్టణములలో గొందరు తురుష్కు లాంధ్రము స్వచ్ఛముగ మాటలాడుదురు. ఒక తురుష్కుడీ పట్టణమునకు వచ్చి యాంధ్రమున గాలక్షేపము లొనర్చెను. ఆంగ్లేయమతగురువు లనేకు లాంధ్రమున నుపన్యాసము లిచ్చుచున్నారు. కావున నన్యదేశీయులు రంగస్థానము జేనప్పుడు తమ జాతికిదగినభాషతో మాటలాడవలె ననునది విధి కాదు. రామాయణ భారతాదుల ననేకభాగములందు నాటకముఖ్యలక్షణములగు ప్రశ్నోత్తరములు నాత్మగతమున నున్నవి. రాక్షసులేమి, అడవిజనులేమి, నీచజాతివారేమి వచ్చి మాటలాడునపుడు స్వచ్ఛమగు సంస్కృత ముపయుక్తమైనదిగాని ప్రాకృతాదిభాష లుపయోగింపబడలేదు. అప్పటి కాభాష లుండలేదనిన ననిందు. ఆయంశము సంశయముగనుండినను వాదమునకుగాని నేను సమ్మతింతును. నీచపాత్రలకును,

స్త్రీలకును మాగధప్రాకృతాదిభాషలు సంస్కృతనాటకములం దుపయుక్తములైనవి. కావున నాంధ్రనాటకములందును సైత మావిధముననే గ్రాంథికేతర భాష నుపయోగింపనగునని తలంతురు కాబోలు. ప్రాకృతాదిభాషలు సంస్కరింపబడి యొకకట్టుకు బంధింపబడిన పిదపనే నాటకములందా భాషలుపయుక్తములైనవి. ఆంధ్రమునందు గ్రాంథికభాష సంస్కరింపబడినట్టుల గ్రామ్యభాష సంస్కరింపబడలేదు. పురాతనసంస్కృతనాటకముల కాలమునందు దేశములు కొన్నియుండినందున ముఖ్యములగు గ్రామ్యభాషలు కొన్నిమాత్ర ముండెను. అప్పటి శబ్దశాసనులా భాషలకు సర్వమగురీతి సంస్కరించి వ్యాకరణముల గొన్ని రచించిరి. మిగిలినగ్రామ్యభాషలు వదలిరి. సంస్కరింపబడిన గ్రామ్యభాషలుమాత్రము రసప్రకర్షనార్థములని నాటకకర్తలుపయోగించిరి. ఇపుడో, దేశము లసంఖ్యాకములై గ్రామ్యభాషలు లెక్కకు మీఱినన్ని యైనవి. వీనిని సంస్కరింప సాధ్యముకాదు. తుదకు నొకదేశమువారు మఱియొకదేశమువారి మాటలు తెలిసికొనుట కష్టము. నీచపాత్రములు వ్యాకరణదుష్టములగు తెలుగుమాట లాడినను దప్పులేదు. అట్టిమాటలు సైత మశ్లీలములకు దూరముగ నుండవలెను.

(20) నాటకమునవచ్చే ముఖ్యపాత్రములు గుణవంతులై యుండుటయే గాక శారీరావయవపుష్టియు, సౌందర్యము గలిగియుండవలెను. అట్టిపాత్రములకు నుండదగిన ముఖ్యగుణము లెవ్వియనః:

1 శారీరావయవపుష్టి
2 స్ఫుటోచ్చారణశక్తి
3 జ్ఞాపకశక్తి
4 వేషమును ధరించుశక్తి
5 కార్యనిర్వాహకశక్తి
6 జనాకర్షణశక్తి
7 మధురమగు కంఠము
8 భాషాపరిజ్ఞానము

9 యశమార్జించు నపేక్ష
10 నాటకప్రదర్శనాపేక్ష
11 ప్రతిభ
12 ధైర్యము
13 జితేంద్రియత్వము
14 సంచినదనడిక

ఈగుణములు కలవాడు కీర్తిమంతుడగును.

(21) ఇపుడుండు హైందవసాంఘికదౌర్భాగ్యమును, జనసామాన్యమునకు గల విద్యారాహిత్యమును, కాలమానస్థితిని బట్టి, స్త్రీలను పాత్రములంగొనుట యాదరణీయముగాదు. పురుషులు స్త్రీపాత్రములను గొనుట వికారమని, స్వాభావికవిరుద్ధమని తోచినను నాటకములే స్వాభావికవిరుద్ధములని యెన్ని యూరకయుండవలయును. ఆంగ్లేయులలో సైతము 1660 సంవత్సరమువరకు స్త్రీపాత్రము పురుషుడే ధరించుచుండెను. ఆకాలమున హ్యూజస్సను స్త్రీ డెస్డిమోనాపాత్రము ధరించి రంగముప్రవేశించినపు డనర్థములయ్యెను.

—* దిదృక్షువుల కొరకు విజ్ఞప్తి *—

ప్రేక్షకుల యాదరణ ముఖ్యము. వారే పాత్రలకు బాఠములు చెప్పువారు. పాత్రలపై దాక్షిణ్యాభిమానములు గలయట్టివారిని, కాలయాపనమునకుగాను నాటకశాలలు ప్రవేశించి ప్రదర్శనములు చూడక నలుదిక్కులు జూచువారిని వదలి మిగతవారివిషయము మనము విచారింపవలయును. వీరు పాత్రయొక్క యేలోపమును గాని యెంతస్వల్పముగ నుండినను సైచువారు కారు. వీరు తప్పుపట్టుట వైషమ్యమునగాదు. ప్రదర్శనకాలమందు వారి మానసమునందు హఠాత్తుగా గలిగిన బుద్ధివలననే యట్టివారు రంగస్థలమున పాత్రలాచరించు దుష్టచర్యలు చూచి యోర్వరు. పాత్రలయందు దేదోషమున్నను ప్రేక్షకులు వానిం దెలుపదగినవిధముగా తెలిపిన మేలగును గాని, నవ్వులతోను, కరతాళధ్వనులతోను పాత్రను బరిహసించుట తప్పు.

## —♦ శ్రీపాద కామేశ్వరరావుగారు ♦—

(ఆం॥ సం॥ 1922, ఆంధ్రగద్యనాటకములు)

రాగవరుసతో జదువుట మన తెలుగుపద్యములకు వ్యక్తివిశేషము. కవిత. అభినయము, వాచకము, సంగీతము అను నాల్గుకళలు నాటకములందు సమ్మేళనము జెందుచున్నవి. అభినయము, వాచకము బాగుండి సంగీతము కొఱవైన నటులు పొగడ్త గనుచున్నారు. కేవలము సంగీతమే కలవారు మెచ్చుకొనబడుటలేదు. పండితులకే కాదు జనసామాన్యమునకుగూడ నిట్టి యభిప్రాయమే. సంగీతము పెచ్చుపెరిగి వాచకాభినయముల నడుగంటచేయుచున్నది. పాటలను పద్యములను బొత్తుగా వాడకుండుటయే ఉత్తమమని నాకుతోఁచుచున్నది. గద్యనాటకములు ప్రదర్శించినగాని రంగస్థల మభివృద్ధికానేరదు. నటులు వాచకాభినయములందు నిపుణులై యుండుటకు విద్వాంసులే కావలయును. పాశ్చాత్య వంగీయనాటకములన్నియు ప్రకృతము గద్యములో రచియింపబడుచు పాత్రస్వభావోన్మీలనము, ఆఖ్యాతవస్తునిర్మాణము లెస్సగ జేయుచున్నవి.

నాటకములోఁ జేరి కళలన్నియు నొండొరుల దిగద్రొక్కకుండ సమానముగ కలిసి భావోన్మీలన మొనర్పవలయును. గద్యకావ్యములు ప్రబలుటచే వాచకము, అభినయము అభివృద్ధినొందును. రంగస్థలము బాగుపడును. పౌరస్వతము గణనీయమగును.

కవిత సరసముగను నాతికఠినముగను నుండి భావోన్మీలనమున కుపయోగించు గద్యపద్యములతో రాజిల్లవలెను. కథాభాగమున నైక్యముండవలెను. ప్రధానవిషయముండి దానిని బలపరచునల్లికయే వెలయవలెను. ఇట్టి యుపవిషయములు ప్రధానాంశమునకు అనుకూలముగను, ప్రతికూలముగను నుండవలయును. ప్రధానవిషయము నిరంతరాయముగ సాగకూడదు. కథాంశముల ఘాతప్రతిఘాతములచే నాటకము నడుచుచుండవలయును. అంతర్ద్వంద్వము

అనగా "చేతామా, వద్దా, యింకొకవిధముగా చేతామా" అనే సమస్యలు భావాందోళనము కలిగించుచుండవలయును. దీనివలన రసోదయమేర్పడును. నాటకవిషయములు స్వభావసిద్ధముగ నుండవలెను. సంగీతము వాడునెడ శాస్త్రకట్టులలో నుండవలెను. అది తటస్థించకపోవునుగాన సంగీతమును, పద్యములను, మట్లను బహిష్కరించుట మంచిది. గద్యమును సరసవైఖరుల పెంచ వలసియున్నది. పద్యములు గద్యమువలెనే చదువవచ్చును. పాటలు సంగీతముతో పాడవచ్చును. పాటలు రంగమునకు ముందో లేక అంతముననో యుండవలెను.

—(ఆం॥ సం॥ 1916-17, నాటక ప్రయోగపరీక్ష)—

దుస్తులు పాత్రోచితముగను "వెల సులభము, ఫల మధికము" అనునట్లు నుండవలెను. సీనులు అసందర్భముగ జేయుటకన్న మానివేయుట మంచిది. ఇతరఉపకరణములు ఉచితముగ నుండవలెను.

పాత్రములందు స్థూలాభినయ ముండవలెనుగాని సూక్ష్మాభినయ ముండ కూడదు. అనగా భరతశాస్త్రప్రక్రియ రంగస్థలములందు వాడకూడదు. అందరు నటులు కథాంశము జరుగునపుడు తమ భావములను మూకాభినయములో వెల్లడించుచునే యుండవలయును. నాటక సమాజములకు రసజ్ఞులగు బోధకు లుండవలెను. నటుడు భాషాజ్ఞానము, రసవివేకము, రసప్రదర్శనసిద్ధి యొప్పచుండవలయును. విమర్శకులు నటులదోషములను ప్రకటించుచుండవలెను. నటులు వీరియభిప్రాయముల నాదరించి "ఆపరితోషాత్ విదుషాం నసాధుమన్యే ప్రయోగవిజ్ఞానం" అను వాక్య మంగీకరింపవలయును.

—(ఆం॥ సం॥ 1914, ఆంధ్రనాటక రంగస్థలము)—

రంజకత్వము, హితబోధ, జీవనోపాధి నాటకమునకు కారణములై యున్నవి, ప్రదర్శకులు వృత్తిగాగలవారు, ఔత్సాహికులు, ఇవి రెండుకలవారు. ఔత్సాహికులలో తగాదాలు రావు. కట్టుగా పనిచేయుదురు. వృత్తికి పెట్టుకొనినవారు అందరిని సమముగ జూచుచు నటుల హెచ్చుతగ్గులను పాత్రనిర్ణయమందు జూపవలెనేకాని పోషణయందు చూపగూడదు. రిహార్సల్సు చాలా ఉండవలెను. నటులు తమకిచ్చిన పాత్రములతో సంతుష్టినొంది వానినే చక్కగ నిర్వహించవలెను. రంగాధికారి నిష్పక్షపాతముగ ఔచిత్యమెరింగి పాత్రధారుల నియమించవలెను. నటులు పోకిరీవేషమున తిరుగక తమవృత్తికి గౌరవము తెచ్చుకొనవలెను. నటులు విశ్వాసము కలిగి యున్నతావున అతికి యుండవలెను. నాటకములందు కవిత, నాటకకళ, ప్రధానాంశములు. భాష సర్వత్ర గ్రాంథికముగ కొందరు వాడుచున్నారు. విశాఖపట్టణములో గ్రామ్యమందరికి ఉపయోగించబడుచున్నది. కొందరు ప్రాతోచితముగ గ్రామ్యగ్రాంథికభాషల్లను వాడుచున్నారు. పద్యములు గీతములుగ నుండవలెనని పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి యభిప్రాయము. కొన్నిపట్ల పద్యములుండనే కూడదు. కొందరు పద్యములే యుండవలయునని చెప్పుచున్నారు. రసస్ఫురణకు పదరచన ముఖ్యవిషయముకాని గద్యపద్యాదిరూపభేద మనావశ్యకము. కవులు స్వాతంత్ర్యవివేకము నుపయోగించవచ్చును. సంగీతము రసవాహకమనువారిమాట విశ్వసనీయముకాదు. ప్రదర్శకుల లోపము కళయందారోపింపగూడదు. కవితాసంగీతసమ్మేళనము రసభావోచితముగ చేయుట మంచిది. రంగములు, పరికరములు అవసరములేదు. సీని లవ ప్రేక్షకుల భావనాశక్తి తగ్గుచున్నది. ధనవ్యయ మేర్పడుచున్నది.

బొత్తుగా తెల్లగుడ్డలు కాక తగుపాటిధనము ఖర్చుపెట్టి రంగసామగ్రి జేర్పవలయును. అభినయము ప్రధానముగ నుండవలయును. ధర్మవరం కృష్ణమాచార్యులు గారు సంగీతము లేకపోయినను పద్యములు సరసముగ జదువుచు అభినయకౌశలముచే మెప్పువడసిరి. నాటకకళ వృత్తము, రసము, పాత్రములు మొదలగు విషయములు చేరియున్నవి. శృంగారవీరరసములు ప్రధానము. నాటకకవులు ప్రాచీననాటకాలంకారనియమగులలో చిక్కుకొనక స్వతంత్రించి గాథా కల్పనము, పాత్రపోషణము జరుపుట ఆవశ్యకము. పాత్రములందు విరుద్ధ ధర్మము లొక్కవేళనే స్ఫురించకూడదు. అవస్థాభేదమున పాత్రధర్మములు మారునపుడు పాత్రౌచితి చెడకూడదు. స్వభావవిరుద్ధ ముండకూడదు. వాచకమువలన పాత్ర తవగుణదోషముల ను ప్రకటించవలయును. ఉచ్చారణలో పాత్రయొక్క కులస్థితులు, శుచి, స్పష్టత, వడి, ధ్వని, ద్యోతకమై యుండవలెను. హాలులో అందరికి వినిపించుస్థాయితో నెత్తుకొని రసోచితముగ అంతకుపైన కథనడుపుచుండవలెను. ఆంధ్రకేసరి, సువర్ణలేఖ, కృష్ణాపత్రిక మొదలైన పత్రికలలో నాటకవిమర్శ మెక్కువగా జరిగియున్నది. పరీక్షలు ప్రదర్శనమునకు, నాటకరచనమునకు ప్రోత్సాహ మొసంగవలెను.

## (ఆం॥సం॥ 1917-18, ఆంధ్రనాటకప్రయోగ పరీక్షలు.)

### పరీక్షాసంఘములు - పరీక్షలెట్లు జరుగవలెను?

పరీక్షాధికారులు కళాభిజ్ఞులై యుండవలెను. సీనులు రంగానుగుణముగ నున్నది లేనిది చూడవలెను. రంగప్రసాధన మొక ప్రధానాంశముగ బరిగణించవలెను. ఇది యితివృత్తకాలమున కనుకూలముగ నుండవలెను. అభినయమునకు భావనాశక్తి, నాగరకాభిరుచి, ప్రపంచజ్ఞానము ఆవశ్యకములు. మిత ముండవలయును. పాత్రానుగుణముగ వర్తనము మారవలెను. కవియుద్దేశ్యమునుపట్టి ముఖవైఖరి మారుచుండవలెను. పాత్రముల గుణము లనుసరించిన తీవిలో నానారసముల బ్రయోగింపవలెను. వాచకములో నిర్దుష్టత, స్పష్టత, ధార, విరామములు, ఊతము, కంఠధ్వని ఆరుభాగములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| I | వేషము | 5 మార్కులు | 15 | | |
| | రీతి | 10 | | | |
| II | ఉచ్చారణ | | | | |
| | నిర్దుష్టత | 4 | | | |
| | స్పష్టత | 4 | | | |
| | ధార | 8 | 40 | | |
| | ఊతము | 10 | | | |
| | అపుం | 10 | | 100 | |
| | కంఠధ్వని | 4 | | | |
| III | సంగీతము | | | | |
| | కంఠము | 2 | | | |
| | శాస్త్రము | 3 | 10 | | |
| | సంగీత వాచక సమ్మేళన | 5 | | | |
| IV | అభినయము | 25 | 35 | | |
| | మూకాభినయము | 10 | | | |

నాటకులకు విశుద్ధమైన సంగీతజ్ఞాన మలవరచవలయును. కొద్ది సంగతులతో చిన్నిపద్దెముల జదువవలెను. పద్యమందలి రసమును, భావమును బట్టి విజ్ఞులెక్కడ నెట్టికళల దెప్పించవలెనో నిర్ణయించుకోవలెను. పాదము మారునపుడు రాగమందలి కళలు మారవలెను. ఆపుదలలు అర్థయుక్తముగ నుండవలెను. ఆపుదలలలో రసోచితముగ గానవిన్యాసమొనర్పవలెను. సంగీత స్వర పద్ధతుల విరుపులతో పాటలను నాటకములందు విరచియాపకూడదు. అర్థ ప్రధానముగా విభజనము చేసికోవలెను. రాగమంతయు చివరకు నిలుపక అక్కడక్కడ ప్రయోగింపవలెను. పాదాంతములందు రాగముతీయుట మంచిదికాదు. సంగీత విరామములు అర్థవిరామముల నాశ్రయించియుండవలెను. సంగీతము అనవసరముగా పెంచకూడదు.

## —♦ శ్రీపాద కామేశ్వరరావుగారు ♦—

(బందరు టౌనుహాలులో యిచ్చిన యుపన్యాససారము)

భావము, అభినయము, వాచికము-యీమూడు ఒకదానినొకటి విడిచి యుండవు. వీని సానుకూలతవలననే రసోత్పత్తి గలుగుచున్నది. సంగీతము గీతములందు,పద్యములందు ఉపయోగింపబడును. గీతములందు తప్పదు. పద్యములం దుండదగునో లేదో చర్చనీయము. గద్యగుం దుండగూడదు. రంగస్థలమున రాగాలాపన రూపుమాపుట అవశ్యకర్తవ్యము. జీవికి అభినయము సహజము. కాని జీవితావస్థ ననుసరింపక అవసరమైనపుడు రసావేశమును జెందుటయే నాట్యము. ఇది వాచకము, ఆంగికము, ఆహార్యము, సాత్వికము అని నాలుగువిధములు. రంగస్థలమందలి యభినయ మొకకళగాని శాస్త్రము కాదు. రంగాభినయమునకు అనుభవజ్ఞానమే ప్రధానముకాని భరతమందు ప్రవేశ మవసరములేదు. అభినయసంగీతశాస్త్రములు రంగస్థలమున నుపయోగించుట సమంజసముకాదు. అభినయకళ పాత్రకాలమును, కథయొక్క సంప్రదాయమును, పాత్రయొక్క లౌకికస్థితిని పరిశీలించి యుండవలెను. హాసము, శోకము, క్రోధము మున్నగు నవరసములు పాత్రయొక్క స్థితినిబట్టి యుండవలెను. భావనము సరిగా నుండవలెను. ఇంతకు వివేక మవసరము. పామరరుచులు పాటిజేయకూడదని ప్రదర్శకులు విశ్వసించి పండితులనే సంతసింపజేయ యత్నింపవలయును. పరిశీలనజేసియు ప్రసిద్ధనటుల జూచియు ప్రదర్శకులు వృద్ధిపొందవలెను. పాత్రగుణములవిషయమై భేదాభిప్రాయము లుండవచ్చును. అభినయమంతయు స్వభావసిద్ధముగ ప్రకృతికి ప్రతిబింబముగ దోచవలెను. అభినయమందు అభివృద్ధి యుండవలెను. కథాంశము జరుగునపుడు ఒకేపాత్రము నిద్దరు ముగ్గురిచే ప్రదర్శింపగూడదు. సందర్భానుసారముగ కాలనిర్ణయము చేసికొని యాడవలెను.

—(ఆం॥ సం॥ 1919-నటులు,నాటకాభినయము)—

అను వ్యాసములో ఇవటూరి సిద్ధేశ్వరశర్మగారి యభిప్రాయములు చాలవరకు శ్రీపాద కామేశ్వరరావుగారి వానితో నేకీభవించుచున్నవి.

నాటకకవులు నటులై ప్రయోగవైదుష్య మున్నవారైనచో నాటకమునందలి భావములు ప్రకృతిప్రతిబింబములుగా నుండును. నాటకము ఆదర్శపూర్వకముగను, రసపోషకముగను నుండి కవియొక్క చాతుర్యముతో నిండియుండును. ప్రకృతికి సమముగా గాథాకల్పన, పాత్రములు నుండవలెను. అభినయము, దుస్తులు, ఆచారములు పాత్రకాలమునకు అనుసరించి యుండవలయును. అభినయమువలన ప్రపంచము రంగస్థలముగ బ్రదర్శింపవలెను. వేషము లెంతస్వభావసిద్ధముగనున్న నాటక మంత రసవంతముగ నుండును. నటులు నాటకమునంతను పరిమర్శగ జదివి స్వభావసిద్ధమగు భూమిక నవలంబించి పనిచేయవలెను. భావవిషయములో పాత్రోచితమైన రీతుల నుండవలెనందురుగాని నాటకము ఆదర్శపూర్వకమై ప్రకృతియొక్క దేశకాల విశాలతను అనుకరింపలేకయున్నది. కావున ఇదియొక స్వభావానుసారియగు కళ (రూపకల్పనమే) కాని ప్రకృతిగాదు. అందుచే పద్యములను, వ్యాకరణయుక్తమగు పదములను నుపయోగించవచ్చును. పద్యములకు రసపోషణ మవకాశమిచ్చును. రసపోషణమందు పద్యములు భావము ననుసరించి మితముగ నుండవలెను. రసానుగుణ్యముగ రాగము మార్చుట మంచిది. సంగీతము రసభావోచితముగ నుండవలెను. వాచకవిషయములో వీరు కామేశ్వరరావుగారి యభిప్రాయములతో నేకీభవించుచున్నారు. నడకలు, అభినయము ప్రకృతియందు సామాన్యజీవితములో మన మవలంబించు రీతుల నుండవలెను. పాత్రకు తగిన గమనవైఖరు లుండవలెను. గతులు సమయమునుబట్టి యుండవలెను. భావముల ననుసరించి స్థూలాభినయము చేయవలెను. కేవలము ముఖమందే రసభావముల ఘటింపవలయు. నటవిషయము నటుడు తన స్వాతంత్ర్య

ముపయోగించి నాటకకళయందలి వివిధాంగముల పరిశీలన బుద్ధితో మేళవించి నడుపవలెను. సునిబద్ధసూత్రముల నేర్పరచకూడదు. పాత్రగుణములను సంప్రదాయములను చక్కగ నెఱింగి వర్తింపవలయును. అభ్యాసిక ప్రదర్శనములు సంపూర్ణముగను, శ్రద్ధగను చేయవలెను. శిక్షకుని యాజ్ఞలో నుండవలెను. విద్య, లౌకికజ్ఞానము, భావనాశక్తి, దీక్ష, సద్వర్తనము, పాత్రస్వభావతన్మయత్వము నటున కేర్పడియుండవలయును.

## —* పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు *—

### (సాక్షి)

#### సారంగధరనాటకప్రదర్శనము.

నాటకసమాజములు ఆటకు కావలసిన వస్తుసామగ్రిని ముందుగా జక్కపెట్టుకొనవలయునని, ఆట వేళకు ప్రారంభింపవలెనని సూచించుచున్నారు. ఉద్యానవనములో రాజనరేంద్రుడు రాజకార్యములను ప్రశంసించుట ఆక్షేపించిరి. రాజు తనసేవకులయొద్ద తనకాంతల యంగాభివర్ణన మొనర్పగూడదు. శోభనపుగదిలో ప్రతిస్వల్పవిషయము అభినయించుట వెఱ్ఱి యనిరి. సారంగధరుడు, చిత్రాంగి శృంగారసంభాషణములో విపరీతశృంగారమల్ల యుద్ధసన్నాహసంరంభము చూపిరట. శృంగారసంభాషణములో యిట్టి హైసూరి పంజాబీ పదవిన్యాసమును ఆక్షేపించుచున్నారు. రాజనరేంద్రుడు భార్యను సంబోధించునపుడు అంత్యప్రాసనియమములతో పాటలందు మాట్లాడుట యసహజ మనిరి. సీసపద్యములను మట్లనుతుంచి సగమొకరు, సగమొకరు అర్ధపాదార్ధపాదాన్యోన్యసాహాయ్యావృతులతో పాడుట అర్థమునకు రసమునకు భంగకరమనిరి. న్యాయసభలో మట్లను యిరికించుట యుక్తముకాదు. చిత్రాంగి జైలులోనుండి మరణశిక్షను అనుభవింపనున్నకుమారునితో సంభాషించునపుడు బ్యాండుస్వరములను, కాలితాళమును అవలంబించుట మిక్కిలి

అసహ్యముగనున్నది. కాల్గుణుడుమనవుడు సారంగధరుడు లయకోరకు మదము సాధించుట మిక్కిలి దుర్భరముగ నుండెను.

ఇట్టి యనౌచిత్యకవిత్వములవలన మనదేశమున కెంత ప్రారబ్ధము పట్టె! సాంసారిక రాజకీయ వాముష్మికాది సకలవ్యాపారములలో మన ముపయోగించు సంభాషణకు, చేసిన చేతలకు, నడచిన నడతలకు, తలచిన తలపులకు ప్రత్యక్షమైన స్వచ్ఛమైన ఆదర్శముగ నుండవలసిన నాటకములలో ఈ దరువులేమి? ఈ తాండవములేమి? ఈ పాటలేమి? ఈ ఆటలేమి? ప్రకృతిని మంటబెట్టిరే! ప్రశస్తకవుల నాటకాదర్శములు నీటగలిపిరే! ప్రకృతికిని ప్రశస్తకవులకును విరోధముగనుండు కల్పనలేల యల్లవలయును? నాటకకాక్షేయకమున ప్రకృతిని జంపిన బ్రహ్మహత్య మన కెందులకు?

## (నాటకపరిదర్శనము)

మన నాటకములు ప్రకృతిననుసరించిపోవక భరతవాక్యమాంగళ్యమునకై ప్రాకులాడనేల? జీవితమంతయు కష్టభూయిష్ఠమైయుండ ప్రపంచము ప్రారబ్ధభోగ్యసీమగ నందరు నమ్ముచుండ నట్టి సాంసారికకష్టములను సుఖదుఃఖముల చక్రనేమిక్రమమును యథారూపమున ప్రకృతి సిద్ధముగ జిత్రింపక నాటకాంతమున నే ఋషినో, నే శంకరునో, నే యసంభావిత యసందర్భపు పయమునో ప్రవేశపెట్టి మంగళాంతము జేయూర్పయత్నించుట మన నాటకములలో మిక్కిలి శోచనీయముగ నున్నది. కవిన్యాయము, అనగా మంచివారలకు సుఖాంతమేర్పరచుటయు దుర్మార్గుల కపజయము నేర్పరచుటయు నుచితమా? కొందరభిప్రాయపడుచున్నారు.

కాని సుఖమన భౌతికైశ్వర్యములు, ఆయురారోగ్యములు అని భావించుట తప్పు. ప్రపంచములో దుర్మార్గులబారిపడి సద్వర్తనముకై యిడుమలగుడిచి పరమేశ్వరుని నమ్మికొని యారాధించినవానికి మోక్షమే నిత్యానందమగు సంపూర్ణసుఖమగుగాని తిరిగి యీ సంసారపటలమున జిక్కికొనుట

సుఖమగునా? దుఃఖాంతనాటకములవలన కలుగు సద్బోధ సుఖాంతములందు దొరకున్నది. కాని సుఖాంతత్వమే మంచిదికాదని నేను చెప్పను. ప్రకృతిలో సుఖదుఃఖములు రెండును కలిసియున్నవి. కావున మననాటకకవులు ద్విముఖియగు ప్రకృతిని రెండువైపుల పరామర్శింతురుగాక!

## (నాటకీయ పద్యరచన)

నాటకములో వృత్తము లవశ్యములు. చం॥ ఉ॥ శా॥ మ॥ తరుచుగను స్రగ్ధరా తరళాదివృత్తములు అరుదుగను వాడబడుచున్నవి. ఇప్పటికి లక్షణగ్రంథములలో చేర్పఁబడిన వృత్తము లన్నిటినే వాడియుండఁగ పుడు క్రొత్తవి కూర్ప ప్రయత్నించుట పనికిమాలినపని. వింతవృత్తము లన్నియు తాళాశ్రయములు. వృత్తము లొకజాతి దరువులు. పల్లవి, యనుపల్లవి లేని పదములు. వృత్తములగానమందు రాగమాత్రమే గాయకుడు మార్పఁగలఁడుగాని వృత్తముతో బుట్టినట్టియు వృత్తజీవమునకు జీవమైనట్టియు తాళమును మాత్రము మార్పలేడు. తాళపుబందుకట్టులో పాటలకంటె వృత్తములే ప్రబలమైనవి. పాటలు ప్రకృతివైఖరీవిరోధములని నాటకకవు లెఱుగుదురు. అందుచేత పాటలను బహిష్కరించిరి. ప్రబంధము చిరజీవియై యుండుటకు యిట్లొనర్చిరి కాని తాత్కాలికప్రజాభీష్టసిద్ధికిని ధనలాభమునకును లొంగి పాటలజేర్చుచున్నారు. కొందరు స్థిరయశస్సంపదలకును తాత్కాలిక ధననామగౌరవములకును నుభయత్ర అనుకూలించురీతిగ పద్యముల నిచ్చుచు అనుబంధములో అపద్యముల బదులు పాడదగిన పాటలను జేర్చియున్నారు. పాటల నాటకకర్త కవిస్వాతంత్ర్యమును నిర్భయముగ నిలుపుకొన నెంచుచున్నాడు. ప్రచ్ఛన్నసంగీతనాటకకర్త పిరికివాడై గోడమీది పిల్లివలె నటించుచున్నాడు. నటులు వీరిరువురి పూర్ణాధారమగు అనుజ్ఞల సందుజూచుకొని వృత్తములకు మట్లువేసి పాడుచున్నారు. వృత్తములను పాటలుగ మార్చకుండనే వానికి యథోచితములగు నడకల ననుసరించి రాగహీనముగ చదివినప్పుడుకూడ ఈ

యాపదయే సిద్ధమగును. వృత్తములకు తాళము జన్మసిద్ధమై యున్నది. తాళములో తాండవ ముద్భవించును. పాత్రౌచిత్యము భగ్నమగును. రసము ధ్వంసమగును. సహజత్వము చచ్చును. పాటలవలెనే యపురూపవృత్తములు నాటకముల నుండదగవు. నాటకమున పాట పాడుటెట్లు సహజమో పద్యములు పాడుటగూడ నట్లే అసహజము. ఆపద్యములు సామాన్యవృత్తములైనను వింతవృత్తములైనను అన్నివృత్తములు నాటకమునుండి బహిష్కరింపవలసినదే. పూర్వకవులు పాత్రములసందర్భోచితరసావస్థల నెరింగి వానిని ననువగురీతి ప్రదర్శించుటకు పద్యముల నల్లిరి. తాళసందర్భరహితములగు వృత్తముల నిరాకరించి కేవల వచనమువలె నడచు వృత్తములను నుపయోగించినట్లు కనబడుచున్నది. ప్రశస్తమైన అభిప్రాయమున్న యెడల దాని నుపమార్థాంతరన్యాసాలంకారములతో మేళవించి ధారణాయోగ్యముగ జేయుటకై నడకయందు వచనముకంటె విశేషభేదములేని వృత్తములలో నిముడ్చుచుండిరి. ఆంగ్లేయుల బ్లాంకువర్సుకు సమానమైనవి సంస్కృతములో ఆర్యావృత్తము, అనుష్టుపు నున్నవి. వీనికి తెలుగులో తేటగీత సమానమైయున్నది. తేటగీతకు జన్మసిద్ధమైన యొక్క నడక లేదు. దీనికంటె ఛందస్సున వచనమును బోలిన పద్యములేదు. నాటకములోని గీతపద్యములను గీతములవలె చదువబోయిన అవి నడువకుండునట్లు వ్రాయవలెను. అవి వచనములని చదువుకొనినప్పుడే నడువవలయును. సీసము, ఆటవెలది కూడ నుపయోగపర్చవచ్చును. వీనినిచదువవలసి వచ్చినపుడు ఆయా రసభేదోచితకంఠరవపరిపాకములు జరుపవలయును. గానధోరణిని పాడకూడదు. నాటకపుశాల ప్రపంచము. పాత్రములందలి నరులు. ప్రజలయభిప్రాయము లెక్కచేయకూడదు.

## — ఆంధ్రనాటకవిమర్శనము: వింజమూరి రంగాచారిగారు —

నాటకములలో గానములయావశ్యకతగూర్చియు పాత్రికులతగిన భాష యుండరాదనుటగూర్చియు చరిత్రనాటకములదప్ప నాయికానాయకుల

మరణము రంగస్థలమున జ్ఞాపకయుండుటనుగూర్చియు శ్రీనివాసరావుగారి యభిప్రాయములకు భిన్నముగ నభిప్రాయపడియున్నారు. కృ॥ప॥ 26-2-16 and 12-3-1916 లో ప్రచురింపబడిన వీరి వ్యాసద్వయపు సారాంశమిది:

సామాన్యముగ మాట్లాడుభాష పేలవమనితలంచుట వాడుకభాష లోని జీవశక్తిని యెరుగకుండుటను బయలుపెట్టుచున్నది. పద్యములు ఛందశ్శాస్త్రమును అనగా నడకను అనుసరించునుగాని సంగీతప్రధానములు కావు. కేవలము స్వాభావికముగనుండవలసిన సామాన్యజీవితమును ప్రతిబింబింప జేయు నాటకములు వచనములోనే వ్రాయబడవలెను. కవీంద్రుడు తన భావశక్తిచే నాదర్శప్రపంచమును సృష్టించిన నాటకములు, విషాదనాటకములు మొత్తుగా వచనములోనే యుండనక్కరలేదు. పద్యములు అర్థప్రధానములు. పాట శబ్దప్రధానము. వాఙ్మయమున ఉన్నతస్థానము వహింపదగిన నాటకమున పద్యములే ముఖ్యములు కాని పాటలు కావు. పాటలు కొన్ని సందర్భములలో కరుణ, దుఃఖము మొదలగు మనోభావములకును, పాత్రలొంటరిగ సంభావించుకొనునప్పుడును వాడవచ్చును.

! ఈ పంతులుగారు నాటకములోని అన్నిపాత్రములకు గ్రాంథికభాషయే యుండవలెననుట అసమంజసము. నాటకమున పాత్రలు యెవరిభావములను వారు విస్తరించుకొందురుగాన వారిస్వకీయోచ్చారణవైఖరులందే సంభాషణము ప్రదీపింపవలెను. నీచపాత్రలకు గ్రామ్యభాష పెట్టనిది నాటకమే కాదని వేదము వెంకటరాయశాస్త్రిలుగారు సిద్ధాంతపరచియున్నారు. గొప్ప నాటకకర్తలు సామాన్యజీవనమునందుకూడ మహానాటకముల సారాంశమును సంపాదించుకొనుచున్నారు. సామాన్యజీవితపుభాష బూతులబుట్ట కానేరదు. ఇట్టిభాషవలన నాటకములు పేలవముగానేరవు.

విషాదనాటకములు నిజముగ కవిత్వమున ముఖ్యాంగమైన రమణీయత వలన అవ్యాజానందము కలిగించుచున్నవి. విషాదనాటకములవలన ప్రయోజన మెక్కువయున్నది.

## ఆంధ్రనాటకములు:

ముత్తరాజు సుబ్బారావుగారు ఎమ్. ఏ.

ప్రస్తుతకాలమున ముద్రాశాలలనుండి వేనవేలాంధ్రనాటకములు వెలువడుచున్నవి. ఇందు గొన్ని సంస్కృతాంగ్లాది నాటకభాషాంతరీకరణములు. ఉ॥ శకుంతలా, అఖిలబింబము, గులేబకావళి మున్నగునవి. కొన్ని స్వయంకల్పితములు. వీనిలో నొక కొన్ని పాండవవిజయాదులు సంస్కృతనాటకలక్షణానుసారముగాను, వేఱొకకొన్ని సుగుణమణీత్యాదులు నాంగ్లనాటకలక్షణానుగుణ్యముగాను, మఱొకకొన్ని వీరభద్రవిజయప్రభృతులు వీధిభాగవతముల వలెను, నింకగొన్ని చిత్రనళీయాదులు నాటకకర్తల యిష్టానుసారముగాను విరచింపబడి యున్నవి. వీనింబట్టి చూడ మననాటకములకు నిరూఢమైన నియమములు గనుపింపవు. ఇది యెంతయు శోచనీయము. ఏలయన మననాటకము లింకను శైశవావస్థలో నున్నవి. ఇట్టియెడ సర్వజనసమ్మతమగు కొన్ని నియమముల నేర్పఱచుకొనినఁగాని పురోవృద్ధి కాటంకము గలుగును. ఈలోపమును దీర్చుటకే కాఁబోలు, బహునాటకగ్రంథకర్తలగు మ॥ రా॥ రా॥ శ్రీ॥ కోలాచలము శ్రీనివాసరావుగారు కొన్నినియమములఁ బ్రకటించిరి. అందుపై నెన్నియో వాదములు నెన్నియో చర్చలు జరుగుచున్నవి. కాని తుదకు నొక్కవిషయమునసైన నిశ్చితమని నుడువుటకు నావంతయు వీలు లేకున్నది. అట్టిచో నాబోటి యల్పజ్ఞుఁ డీవిషయము ననుగుఱించి వ్రాయఁబూనుట కడు సాహసకార్యము. అయిన నాంధ్రనాటకాభిమానమును, జ్ఞానోపార్జనోత్సాహమును నన్నిందులకుఁ బురికొల్పినవి. కాన దక్షులు నన్ను మన్నింతురుగాక!

### నాటకస్వభావము

నాటకము లలితకళలలో నొకభాగము. ఈలలితకళలు ద్వివిధములు: దృశ్యములు (చిత్రలేఖనము), శ్రావ్యములు (సంగీతము). నాటక మీ రెంటిలోను జేరినది గాన మిశ్రమకళ (Complex art) యన బరగుచున్నది.

అయిన ప్రతి కళవలె నిదియు ప్రకృతికి వ్యాఖ్యానము కాని ప్రకృతి కాదు. కానేరదు. ఇందు ప్రకృతియందుగన్పట్టు విషయములలోఁ గొన్నిటి నేర్పఱచి, వేర్పఱచి సమన్వయించుటయే ముఖ్యలక్షణము. వనమునకు, నుద్యానవనమునకు నెంతి భేదమున్నదో ప్రకృతికిని దదనుసారిణియగు గళకును నంత వ్యత్యాసమున్నది. అయిన నిట్లు ప్రకృతిభిన్నముగానున్నను ప్రకృతివిరుద్ధముగా నుండఁగూడదు. నాటకపు నిజమైనవన్నె గనుఁగొనవలయుననిఁ ప్రకృతియే నికషోపలము.

## నాటకాంగములు

నాటకమునకు ముఖ్యాంగములు మూఁడు. అందు మొదటిది భావము. ఇది నాటకవ్యక్తికి జీవము. దీనిని సమర్థతతో నెలకొల్పుటకు అన్వీక్షికీవిద్య (Psychology) తెలిసియుండవలయు. రెండవది యితివృత్తము. ఇది నాటకవ్యక్తి కస్థిపంజరము. దీనిని నేర్పుతో నెఱవేర్పవలయుననిన కథారచనాచాతుర్యము, కల్పనాశక్తియు నవసరములు. మూఁడవది భాష. ఇది నాటకవ్యక్తికి శరీరము. దీని వైదగ్ధ్యముతో విరచింపవలెననిన గవిత్వమత్యావశ్యకము. ఈమూఁడును క్షీరనీరన్యాయంబున గలిసి మెలసి యున్నఁగాని నాటకమునకు సంపూర్ణమైన శోభనియ్యవు. వీనిగుఱించి బహుచర్చనీయాంశము లున్నవి. వీని సాధుత్వాసాధుత్వముల గన్గొనుటకై సంస్కృతాంగ్లాంధ్రముల బెంపెక్కిన నాటకములఁ గొన్నిటి పఠించి వానినుండి (by the use of deductive and inductive methods) కొన్ని నియమముల సేకరించితిని. అందు నాకు గోచరమైన నియమముల నిర్వర్ణించుటకు ముందుగా విమర్శనాపద్ధతులఁ గొన్నింటి నేర్పాటుజేసికొని వివాదాంశముల కొంతవఱకేని తీర్మానము జేయుటయే బాగని తోఁచుచున్నది. ఆ విమర్శనాపద్ధతు (Canons of Criticism) లెవ్వియన నాటకమున ప్రతివిషయమును (1) అవసరమై (2) సహజమై (3) రసోచితమై (4) సులభగ్రాహ్యమై యుండవలయు. ఈధర్మముల మది యందుంచుకొని చర్చనీయాంశముల గొంతవఱకేని నిర్ణయింప ననువగు.

ఏతదంశము లెవ్వియన, భావమును గుఱించిన విషయములు నాలుగు:

1. భావము లెట్లు నిర్వర్ణింపఁబడవలయును? ఇవి పాత్రల ననుసరించి యుండును. కానఁ బాత్రము లాదర్శమాత్రములో లేక వాస్తవికములో ముందు విచారింపవలసియున్నది. పాత్రము లాదర్శమాత్రములుగా పౌరాణిక గాథలయందు బాగుగాని నాటకమున కట్టి పాత్రము లుపయోగ్యములు కావు. పాత్రములు కొన్నివేళల వాస్తవికములుగాక కాల్పనికములైనను సహజముగ వర్ణించెడిచో వానిని వాస్తవికములవలె జేయవచ్చును. చేయవలయును. భావములు సహజములై పాత్రోచితములై పాత్రగుణోన్మీలనమునకు సమర్థములై యుండవలయు. నాటకకర్త స్వపాండిత్యప్రకర్షకై కాని స్వధర్మబోధనమునకుగాని ప్రాల్మాలి భావముల వృథా బొందుపఱుపఁగూడదు. ఇట్లొనర్చిన రసోచితి చేకూరదు.

2. భావములన్నియు నేకరసప్రధానములా? లేక బహురససాధారములా? అనిన నాటకమందంతయు నొక్కరసమునే నింపవలయునా? లేక నవరసములఁ బూరింపవచ్చునా? మానవజీవితములఁ దుదవఱకు విమర్శించిన నవరసముల కాస్పదములని తెలియవచ్చును. ఐన కొన్నివేళలఁ గొన్నిరసములు సగాత్రమే చూపట్టుచుండును. కావున నాటకమున నట్టే యొక్కటేరసమును ముఖ్యముగా నొనరించి మిగిలిన రసముల దానికంగములుగాఁ జేయుటయొప్పు. ఈ యంగములగు రసము లెన్నటికిని ముఖ్యరసమును గప్పిపుచ్చునట్లుగా నుండఁగూడదు. కాన మితముగా మాత్రమే ప్రయోగార్హములు. హాస్యరసమును గొందఱు ప్రహసనములఁ దక్క లాతిచో ననుపయుక్తమందురు. దీని నెచ్చోటనైన సందర్భానుసారముగా మితముగా నుంచిన నష్టమేమియులేదు. శృంగారరసమును గూడ నిట్లే మితముగా బ్రయోగింపవలయును. పచ్చిపచ్చిగా నెన్నటికి వర్ణింపరాదు.

3. భావప్రకటనమునకు సమర్థమైనది గద్యమా? లేక పద్యమా? లేక గీతమా? లేక యిందు కొన్నియా? లేక అన్నియునా? సహజముగా మనము

గద్యనే మనభావముల ప్రకటించుటయందు వాడుచున్నారు. అట్టి గద్యయందే నాటకములు వ్రాయబడియున్నవి. ఇంకను వ్రాయఁబడవచ్చును. కాని గద్యము ప్రహసనములక్కు దక్క నన్యవిధములగు నాటకముల కుపయోగార్హముకాదని నాయభిప్రాయము. పద్యములలో భావప్రకటన మొనర్చుట సహజముకాదు. కాకపోయినను నట్లొనర్చుటచే రసాభివృద్ధి కలుగకపోదు. గద్యము భావప్రధానము. పద్యము రసప్రధానము. ఇయ్యది భక్తి శృంగార కరుణారసముల ముఖ్యముగా బ్రయోగార్హము. లేనిచో రసపోషణమునకుఁ గొంతలోపముగునని నానమ్మకము. ఇంక పాటలవిషయ మించుకఁ జెప్పఁపవలసియున్నది. పాటలు మననాటకముల నూత్నములు గావు. అయ్యవి పద్యములకంటె మున్నుగా వీధిభాగవతములలో నుపయోగింపఁబడుచుండెడివి. వానికిని పద్యములకును సామ్య మెక్కుడు. అన్ని పద్యములకు భావరాగములు పాటలకువలె వలయు. కొన్ని పద్యములకు (ఉదా॥ మత్తకోకిల, లయగ్రాహి) తాళముకూడ వలయు. అట్టి పద్యములకును పాటలకును భేద మావంతయును లేదు. కావున నెచ్చో పద్యము లుండవచ్చునో యచ్చోటనే పాటలుగూడ నుండవచ్చు. అయిన పాటలు రాగప్రధానములు గాన కొలఁదిగామాత్ర ముపయోగ్యములు. హాస్యరసమున నిట్టివి యున్న బాగు. వీని వ్రాయుటయందు తాళము వేయవలసినచో సంస్కృతవిశ్రామమువలె బదవిచ్ఛిత్తియున్న సర్గగ్రహణమునకు సాయమగు. ఇఁక నీపాటలకు మెట్లు నెందుండి గ్రహించినను భావప్రకటనమున కాటంక మొనర్చునట్లుండఁగూడదు.

4. భావములు నీతిదాయకములుగా నుండవలయునా? కొందఱు కుయుక్తులు, నీచోక్తులు నాటకమందు బనికిరావందురు. నాటకమునకు, నీతిబోధనమునకు బదరీబాదరాయణ సంబంధము. అట్లగుట పాత్రానుకూలముగ సందర్భానుసారముగ నుండవలయును గాని నీతిబోధనమునకై మాత్రము నాటకమందు భావము లుండరాదు. ఇదియే సహజముగా దోచుచున్నది. నీతిబోధనమునకై నాటకమును వ్రాసిన నయ్యది రసవంతముగా నుండదు. నీచో

త్తులు, కవియుక్తు లుచితస్థానముల బ్రయోగార్హములైనను నశ్లీలమునకుఁగాని రసాభాసమునకుఁగాని చోటియ్యఁగూడదు.

## ఇతివృత్తమందలి చర్చనీయాంశములు.

1. ఇతివృత్త మెట్టిదిగా నుండవలయును? అయ్యది పురాణము నుండి, దేశచరిత్రమునుండి మాత్రము గ్రహింపబడవలయునా? లేక కల్పితముగాఁగూడ నుండవగునా? లేక మిశ్రమముగా నుండవచ్చునా? మన నాటకముల నితివృత్త మిన్ని తెఱఁగుల నుపయోగింపఁబడియున్నది. ఇదెచ్చటనుండి గ్రహింపబడినను సహజముగా నుండవలయును. మానవలోకమున జరుగదగినదిగా నుండవలయును. నాటకవస్తువు లోకమున నసామాన్యమైనను దుస్సాధ్యముగా నుండఁగూడదు. కొన్నియెడల నిజమే కల్లకంటె విచిత్రకరముగ నున్నను నసాధ్యమగు విషయముల నిందు బొందుపఱచుట తగదు. ఇయ్యది పౌరాణిక గాథలలోఁ జక్కఁగా వర్తింపదు. అందుఁగూడ దేవతలు, భూత ప్రేత పిశాచములు పాత్రములుగా నున్నను వారలకు మన నాటకకారకులు మానవులకు సహజమైన గుణదోషములఁ గల్పించి చేతలయందు మాత్రము భేదముఁజూపిరి. ఇట్లొనర్చినను నయ్యదోకలోప మగుచున్నది. అయిన నియ్యది ప్రతిదేశనాటకమునకును బ్రథమావస్థ. మన నాటకము లీయవస్థదాటి రెండవయవస్థను బొందుచున్నవి. ఇదియే మనకు గ్రామ్యము. ఏలయన మొన్న మొన్న నే యాంధ్రోద్యమబీజము మొలకలెత్తఁజొచ్చె. దానిని బెంచి శాఖోపశాఖల నాంధ్రమండలంబంతియు విస్తరింపజేయుటకు నాంధ్రచారిత్రక సాంఘిక నాటకముల రచింపఁబూనుకొందురుగాక!

2. ఇతివృత్తమునకు గాలనిర్ణయము కలదా? గ్రీకు నాటకములలో నాటకప్రదర్శన కెంత కాలము పట్టునో కథాక్రమణమునకు నంతియ యుండెడిది. ఈనియమము సంస్కృతాంగ్ల నాటకములఁ బాటింపబడలేదు. నాటక కథాక్రమణము నెలమొదలనేకవత్సరములదాఁక వ్యాపించఁబడియున్నది.

అయిన నాయకాభిప్రాయమున నయ్యది మనుజుని జీవితమున నొక్కదశకంటె నెక్కుడుగా నుండఁగూడదు. అయినను నిది యంత ముఖ్యముగాదు. ఏలయన ప్రతికళయందును గొన్ని సాంకేతికములుండవలయు. నాటకమందు నట్లే రంగస్థలము, పాత్రాభివృద్ధి, కాలాతిక్రమణము, పద్యభాషణము మున్నగునవి సాంకేతికములగు. కావున ముఖ్యాంశ మెద్దియన నాటకము ప్రదర్శనమున 3, 4 గంటలకంటె నెక్కుడు కాలము పట్టఁగూడదు. ఇతివృత్త మెక్కుడున్న రెండు మూడు నాటకములుఁ జేయనగును.

3. రంగస్థలముల నెయ్యది ప్రదర్శనీయము? సంస్కృతనాటకముల రణమరణాదులఁ బరింటఁ బ్రదర్శించుట లక్షణవేత్తల యిష్టానుసారము గ వదలివేసిరి. ఆంగ్లమున నట్టినియమమును బాటింపరైరి. ఇదియే సమంజసముగ నున్నది. ఏలయన మనము చూచినది విన్నదానికంటె నూరురెట్లు హృదయంగమముగా నుండు. అట్టిచో నేవిషయప్రదర్శనమైన నిషేధింపఁబడినచో నయ్యది తెరలసంభాషణమూలమున గ్రహింపఁబడవలసివచ్చును. అట్టిచో రసలోప మొదవును. అయిన మానవజీవితములలోఁ గొన్ని దర్శనీయములు కొన్ని గోప్యములు గలవు. దర్శనీయము లన్నియుఁ బ్రదర్శనీయములు. గోప్యము లూహ్యములుగాని ప్రదర్శనీయములు కావు. కావున నిట్లు కలుపుదీసియే మానవజీవితముల రంగస్థలములఁ బ్రదర్శింపవలయు. మఱియు దుర్నీతికి దురభ్యాసములకు నెడముగలుగఁజేయు నంశములఁ జూపకుండుట శ్రేయోదాయకము.

4. ఇతివృత్తము ప్రమోదాంతముగా మాత్రమే యుండవలయునా? అక్కఱలేదు. ఏలయన లోకానుభవము కొంచెమున్నను మనకు బ్రకృతియందు ప్రమోదవిషాదములు రెండును దుష్టులకు శిష్టులకు సమముగా నెల్లమగునని తెల్లమగు. కావున విషాదాంతనాటకముల వ్రాయుటయు సహజమగు. మఱియుఁ గొన్ని విషాదాంతనాటకములు దుష్టశిక్షణము శిష్టరక్షణమును నిరూపించుటకై వ్రాయబడినవి. ఇయ్యది కవితాన్యాయమే (Poetic Justice) కాని పూర్తిగా లోకానుభవము కాదు. కావున విషాదాంతనాట

కములఁగూడ వ్రాయవచ్చును. అయిన నియ్యది కష్టతరము. దీనికి ప్రాధాన్యము భావగాంభీర్యమే.

5. కథకు సృష్టిస్థితిలయము లుండవలయు. ప్రథమాంకముననే నాటకబీజము విత్తఁబడవలయు. తర్వాత నయ్యది యంకురించి, విస్తరించి, పల్లవించి, పుష్పించి ఫలింపవలయు. ఇట్లు కథనల్లిన హృదయంగమముగా నుండును. సహజముగా నుండును. అట్లుగాక యాద్యంతములు లేక, కార్యకారణసమన్వితముగాక కథ వ్రాయబడఁగూడదు.

6. ఇతివృత్తము నెట్లు భాగింపవలయును? అంకవిభజన చాలునా? రంగవిభజనగూడ వలయునా? ఒక పెద్దకథను నాలుగైదంకములలో నిముడ్చవచ్చునుగాని దానికై విష్కంభప్రవేశకములు కొన్నియేని యావశ్యకము లం కినిలో నెవరో వచ్చి కథాభాగమును చెప్పుదురుగాన రసపోషణమునకు భంగమగు. ఈలోపము రంగముల నుంచుటవలన మాయమగుచున్నది. కావున రంగవిభజన మవసరము. ఇంక నాటకమున కిన్ని యంకములనిగాని యిన్ని రంగములనికాని నిర్ణయించుట కష్టము. చెట్టున కెన్నికొమ్మలు, కొమ్మ కెన్నియాకు లుండవలయునో నిర్ణయించుట యెట్లు? అయిన నెన్నియున్నను నయ్యవి సజీవములై చిత్తాకర్షణీయములై నియమితకాలములోపల బ్రదర్శనీయములై యుండవలయు. ఏరంగము వదలినను కథకు భంగము గునంత జిగిబిగిగా రంగములు గలిసియుండవలయు. రంగములే యననేల! ప్రతివాక్యము కథ కవసరమై కథను పెంచుచు, పాత్రగుణముల బ్రకటించుచుండవలయు.

7. ఒకరు వ్రాసినకథను వేరొకరు వ్రాయవచ్చునా? అందుల కభ్యంతర మెవ్వరు చెప్పగలరు? కొందఱితరు లాకథను నాటకరూపమున వ్రాసిరని యెఱుఁగక వ్రాసినను, కొందఱు మాత్రము మొదటిగ్రంథమును మించునట్లు వ్రాయబూనెదరు. అందుచే మనకు లాభముకాని నష్టముకలుగదు. ఇయ్యది ముఖ్యముగా పౌరాణికగాథలలో గన్పట్టుచున్నది. అయిన మంచినాటకముల విషయమున నిట్లు పాడినదే పాడకుండుట మేలు.

8. పౌరాణిక చారిత్రకగాథలఁ గైకొని రూపు డెంతవఱకు మార్పుల నొనర్పవచ్చును? మూలమునందలి ముఖ్యాంశముల మార్పకయుండుట బాగు. ఇతరవిషయముల కొన్నియేని మార్పులుండవచ్చును. అయిన ప్రతిమార్పును పాత్రగుణోన్మీలనమున కైనను, గాథామాధుర్యాశయమున కైనను తోడ్పడవలయు. లేనిచో నామార్పు గ్రాహ్యముకాదు. చరిత్రనాటకములలో గాలము మార్పక కాలోచితములగు మతసాంఘికగార్హ్యాంగవిషయముల నెఱింగి వ్రాయవలయు.

ఇక భాషలో జర్చనీయాంశము లెవ్వియన:

1. భాష పాత్రోచితముగా నుండవలయునా? ఇందు రెండు వివాదాంశము లున్నవి. అందు మొదటిది ఏజాతిపాత్రమున కాజాతిభాష వలయునా? ఇది స్వాభావికమయినను దిదృక్షువులకు గ్రాహ్యముగాదు. కావున రసాభాసము. మఱియు నట్లు వ్రాసినచో నానాటకము నాంధ్రనాటకమని పిలువనక్కఱలేదు. ఆంధ్రనాటకమున నాంధ్రమే వలయు. అయిన నితరజాతివారు మనభాష నుచ్చరించినపుడు విచిత్రముగా మాటాడెదరు. మన కందఱకు తురకతెనుగు, అరవతెనుగు, దొరలతెనుగు, బంగాళీతెనుగు విశదములే! కావున నన్యజాతీయుల భాషయం దీవిచిత్రముల నుంచి మ. రా. రా. వేదము వేంకటరాయశాస్త్రిగారు ప్రతాపరుద్రీయమున తురకపాత్రములకు వ్రాసినట్లు వ్రాయుటుచితము. ఇందు పద్యము లుండగూడదు. రెండవది పాత్రలందఱు భాష నొక్కటే శైలిలో వ్యాకరణయుక్తముగా మాటాడవలయునా? నలుగురు మాటాడుచో శైలిభేదము గోచరమగు. కావున నించుక శైలిభేదము ప్రతిపాత్ర భాషయందు నుండిన సహజముగా నుండును. వ్యాకరణయుక్తముగు భాష నాటకముల బ్రయోగార్హమాయను చర్చ యెంతజరిగినను ప్రయోజనము గానరాకున్నది. గ్రామ్య, గ్రాంథిక భాషావాదులు శాస్త్రములు తమపక్షమున బలుకుచున్నవని నుడువుచున్నారు. అదెట్లున్నను నీచపాత్రములకు సంస్కృతమునందువలె గ్రామ్యము బ్రయోగించుట బాగుగా నున్నది.

ముఖ్యపాత్రములకుమాత్రము వ్యాకరణబద్ధమగు భాషయే మంచిది. ఏలయన విద్యాధికుని భాషకును విద్యాంధునిభాషకును భేదముండును. ఇట్లొనర్చిన వేషమునకుఁ దగినభాషయొప్పును. ముఖ్యపాత్రములన నాయికానాయకులు, వారిబంధువులు. నీచపాత్రములన తదనుచరులు. ప్రహసనముల గ్రామ్యమే ప్రయోగార్హము.

2. భాషాశైలి యెట్లుండవలయును? కొందఱు ప్రబంధశైలిని వ్రాసియున్నారు. కొందఱు సహజముగా మనము మాటాడురీతిని వ్రాసియున్నారు. ప్రబంధశైలి నాటకముల బూర్తిగా నగ్రాహ్యము. ఏలయన నయ్యది సంస్కృతపదజటిలమగుటచే సులభగ్రాహ్యము కాదు. అర్థగ్రహణముగామిచే రసగ్రహణముగూడ శూన్యమగు. మఱియు మనము మాటాడురీతిని వ్రాసిన ప్రహసనముల నొప్పుఁగాని యితరత్ర నయ్యది సొంపునింపదు. కావున నీరెంటికి మధ్యస్థముగనుండు ద్రాక్షాపాకముననే బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులవలె వ్రాయుటయే సమంజసము. ప్రతిమాటయు సులభగ్రాహ్యముగాను, సమయోచితముగాను, యుక్తియుక్తముగాను నుండవలయును. మఱియు గొందఱు క్రోధభీభత్సరసముల సంస్కృతపదగుంఫనము వలయునని దీర్ఘసంస్కృతసమాసముల బ్రయోగించియున్నారు. ఇట్లొనర్చుట స్వరము భావమును బ్రతిఫలింపవలెనను (sound echoing the sense) భ్రమచేఁ గాబోలు. దీనిచే రసపోషణ మలవడదు. పాత్ర ఉచ్చారణచేతను నభినయముచేతను రసమొప్పవలయుఁగాని దీర్ఘసంస్కృతసమాసములచేతఁ గాదు.

3. కవిత్వ మెట్లుండవలయును? ఇక్కాలమునఁ గొంత ఛందోజ్ఞానము లభ్యమైనదిమొదలు కవిత్వము నెల్లరు చెప్ప సాహసించుచున్నారు. అట్టిచో నయ్యది చాలవఱకు నీరసమైనదని యీకాలపు గొన్నినాటకములఁ జదివిన తేటపడును. "చీపరపాపరతీగెలఁ జేపలబుట్టల్లినట్లు" గాక కవిత్వము సరళముగా ధారాళముగా నుండవలయును. వృత్తములు నానావిధములై పాత్రా

త్రగఁ గన్నులఁగట్టినట్లు భావమును బ్రకటింపవలయు. చిత్రకారుఁడు కొన్ని గీతలచే నేవస్తువునైన దృగ్గోచరం బొనర్చునట్లు కవి కొన్నిమాటలచేఁ నెట్టి భావమునైన మనమునకు గోచరమొనర్పవలయు. ఇందులకు భావనాశక్తియే సమగ్రము, ప్రాధాన్యము. ఇదియే మనపాత్రల బ్రత్యక్షముగ నవతారమెత్తి నట్లొనర్చునది. ఇట్టిదియే కవిత్వము. మఱియు బ్రతిపద్యమును మంచిశైలిలో వ్రాయబడవలయు. అట్లనిన నెట్లారంభింప బాగగునో యెట్లంతమొందింప రసవంతమగునో, సులభగ్రాహ్యమగునో, యోజించి యట్లే యొనర్పవలయు. అట్లుగాక యిష్టానుసారముగ వ్రాసి వ్యర్థపదములచే బూరించి వ్రాయుట రసాభాసమున కాదికారణము. మఱియు నేరసము జెప్పఁబూనిన నారస మాలించు వాని నలరింపవలయు. లేనిచో నీరసపు గవిత్వమగు. ఇంకను శ్లేష, ద్వ్యర్థిపద్యము, బంధకవిత్వముగూడ త్యాజ్యములు.

4. నాటకములం దలంకారము లెంతవఱకు గ్రాహ్యములు? కొందఱు తమపాండిత్యప్రకర్షకై కాబోలు, నాటకముల నలంకారభూయిష్ఠముగ నొనర్చియున్నారు. ఆయలంకారములైన నూతనములు గాక పూర్వకవిప్రయోగములగుట వారిదర్య చర్వితచర్వణ మగుచున్నది. కొంద ఱలంకారములే వలదందురు. ఇదియు నాచరణీయముగాదు. అలంకారములు నాటకలక్ష్మికి నిసర్గవముగా నలంకారములై యుండవలయు. అందులకై యవి కొలదిగాను భావముల జక్కగా విశదీకరించునవిగాను, క్రొత్తవిగాను నుండవలయు. అలంకారములలో నిందులకై ముఖ్యముగా నుపమ, స్వభావోక్తి, అర్థాంతరన్యాసము, పరికరాంకురము బ్రయోగార్హములు. ప్రతియలంకారమును పుష్పమువలె తనంతటతాను సుఖ మొనగూర్పవలయు. మఱియు సందర్భ పద ర్భానుసారముగ లోకోక్తులఁ గొన్నింటి బొందుపరచుట యుక్తము.

నాటకముల జర్చనీయాంశములని నాకుదోచిన యంశము లింతియ- వానిగుఱించి కడుసాహసించి నాబుద్ధికి గోచరమగునటు లభిప్రాయ మొసంగితిని. పైన వ్రాసినయంశముల కుదాహరణముల నుద్గ్రంథములనుండి

షమకూర్చిన బాగుగా నుండియుండును. కాని యంత విపులముగా బత్రికయందు వ్రాసిన స్థలము చాలదనుభీతిచే నింతటితో విరమించుచున్నాడ.

గుణదోషౌ బుధోగృహ్ణ | న్నిందుక్ష్వేళావివేశ్వరః |
శిరసా శ్లాఘతే పూర్వం | పరంకంఠే నియచ్ఛతి ||

—* పురాణం సూరిశాస్త్రిగారు బి. ఏ. *—

గతసంచికలో ఆంధ్రనాటకరచనముగూర్చియు, ప్రదర్శనాధికుల గూర్చియు బ్రహ్మశ్రీ కోలాచలము శ్రీనివాసరావుగారు చేసిన యుపదేశ వాక్యములను ప్రచురించి జనోపకారము గావించియుంటిరి. శ్రీనివాసరావుగారు చిరకాలము నాటకసూత్రధారులుగ నుంటయేగాక, ఆంధ్రనాటకములలో చరిత్రాంశములు గూర్చియు, పాత్రస్వభావప్రకటనము గూర్చియు నాటకకవులలో మార్గదర్శి "మహర్షి" యన నొప్పియున్నారు. వీరు నాటకకవులకును, పాత్రములుగా నుండువారికిని పంపిన "విజ్ఞప్తి" వాస్తవమున ననుభవసారమైన స్మృతివాక్యముగ గారవింపదగి యున్నది. నాటకకవులు (7) (11) నెంబరు ఉపదేశములను, నాటకులు 1, 2, 3, 4, 5, 6, 9, 10, 13, 16, 17, నెంబరు నియమములను కంఠగతముచేసి దినదినము యోచించుచు, నడచుచుండిన మేలు.

ఇంతచక్కని ఉపదేశములలోకూడ కొన్ని వివాదాంశము లున్నవి. నాటకములు స్వాభావికములా (natural, realistic)? లేక సాంకేతికములా (conventional and intellectual)? పాత్రముల భాష స్వాభావికముగ నుండవలయునా? లేక రావుగారి నాటకభాషయా? ఛందోబద్ధమైన పద్యములు, కీర్తనలు భావప్రకటనమునకు అడ్డమువచ్చునా? రసాభాసముచేయునా? లేక రావుగారు దలచునట్లు బహురాగముల నేర్వవచ్చునా? ఇత్యాది యంశములందును, ఇంకనుకొన్ని నియమములందును రావువారి యనుభవవిజ్ఞానములు కడు

గొప్పవయ్యును, వీనినిగూర్చి నిశ్చితాభిప్రాయము లున్నట్లు పొడగట్టదు. వారి వాక్యములలో కొన్నిటికి పరస్పరవిరోధము గానవచ్చుచున్నది.

నాటకరచనాకుశలులును, కోలాచలాన్వయ సాహిత్యచక్రవర్తులును, కవితామార్గదర్శనులునగు శ్రీనివాసరావుగారి వాక్యముల విమర్శించుటకు దగిన శాస్త్రజ్ఞానముగాని, నాటకప్రదర్శనానుభవముగాని నాకులేదు. వృథాదర్పమున చేజాచు నడవడి నాకులేదు. నాకు గలిగినది యొకటే. రసానుభవమునకు మూలకారణమగు ప్రపంచజ్ఞానమే. నేను వీధులతిరుగుచు పిల్లలయేడుపు, పెద్దల పోరాటములు మొదలు సమస్తమానవవ్యాపారములను కడుజాగరూకతతో చూచుచుందును. అనేక సంగతిసందర్భములలో మనుష్యులెట్టి రీతిగా ప్రవర్తించునది, దేశకాలభేదములవలన యొకని మనోవృత్తియు అంతఃకరణము నేయేవిపర్యయముల బొందునదియు, నట్టివేళల మనుజుల ముఖవిలాసము లేరీతిగ మారునదియు జూచుచుందును. ఈరంగములన్నియు చక్కగ చిత్రితములై ధారణాకోశమున భావస్థిరములై యుండును. వీనిపోలికనే పాత్రములయల్లిక, చిత్తరువులతీరుపు, నాటకులయాట మొదలగువాని విమర్శింతును. ఇదియే సరియగుమార్గమని పెద్దలు చెప్పియున్నారు.

సాహితీవాఙ్మయమునకు "రతియే" పరమావధి. నాటకములు నవలలు, కథలు, పాటలు, ప్రబంధములు మొదలగు వాఙ్మయము, సుహృద్భావమున నుపదేశముల జేసినను, జేయకున్నను చదువరులకును, చూపరులకును మిక్కుటమగు సంతసము కలిగింపుచుండును. ఆనందము," "రతి" ఇవియే నాటకలక్షణములు. ఇవియే శిల్పచిత్రముల లక్షణములు. ఈయానందము స్వాభావికముగ నుంటవలన హృదయమునకును, సంకేతముగ నుంటచె మానసమునకును గలుగుచున్నది. భాగవతములు, హిందూశిల్పములు, William merris చిత్రములును సాంకేతికములు. ఇవిభావమందు ప్రకృతి ననుసరించును కాని రూపమందును, బాహ్యవ్యాపారములందును ననుగమించవు. నాటకములు కేవలము స్వాభావికములు. ఇందు ప్రకృతిలో మనుజులకు గలుగు

సుఖదుఃఖములు, లాభనష్టములు, జయాపజయములు హేతుయుక్తముగా జూపబడును. కుక్కను చూచుటకన్న కుక్కబొమ్మను చూచిన నెక్కుడు ఆనందము గలుగుపోల్కి, మనజీవితనాటకముల యల్పప్రతిమలను నేపథ్య సహాయమున జూచునపుడు ప్రకృతిలోని రాగద్వేషముల వదలి నిర్మలబుద్ధితో మానవచర్యల విమర్శించుచు రతిని పొందుచుందుము. ఈ అనుభవమునకు ప్రపంచజ్ఞానమే కావలయును. నాటకములలో జెప్పునవి ప్రాపంచికవిషయములే.

నాటకులకు జెప్పిన 15, 19 నెంబరు నియమములవలన శ్రీనివాసరావు గారు, నాటకములే స్వభావేతరములనియు, అందలి నేపథ్యములు, పాత్రములు, మాటలు, నడతలు ప్రకృతివిరుద్ధములనియు జెప్పియున్నారు. నేపథ్యమునుగూర్చి వీరికిగల యభిప్రాయమే షేక్స్పియర్ మహాకవికిదోచి "can this cockpit hold the mighty fields of France?" అని ప్రశ్నించియున్నాడు. ప్రస్తుతము నాటకప్రదర్శనములందు బయస్కోపు, విద్యుచ్ఛక్తి, నేపథ్యయంత్రములు, విరివిగా నుపయోగించి చూపరుల భ్రమింపజేయుచు ఎండ వాన చలులచే గలుగు బాధలనైనను దదృక్షువుల ననుభవింపజేయుచున్నారు. ఏమైనను నేపథ్య మెన్నటికి ప్రకృతిని బోలనేరదు. దేశపరిమితియే దీని ముఖ్యబాధకము.

కాని నేపథ్యము ప్రకృతికి భిన్నముగా నున్నదని మిషచే రంగమునవచ్చి నటించుపాత్రలను, వారిమాటలను స్వభావేతరముగ నొనర్చుట సమంజసముగాదు. మనము ప్రకృతిని ఎన్నటికిని పూర్తిగా ప్రతిబింబింపజాలము. Shakespeare, Victor Hugo, భవభూతి, బంకించాటర్జి, వీరేశలింగము వంటి కవివర్యులుకూడ ప్రకృతిరూపములను సమీపింతురే కాని వాని నైక్యము కానేరరు. కాలేముగదాయని స్వభావేతరములయిన కల్పనలను బోవుటతప్పు. యథార్థములేనిచో, నాటకాంతర్గతమైన యుపదేశములను అంతఃకరణపరిశుద్ధి జనించదు. అవి ఫలించి జనోపయోగములు కానేరవు. నాటకరచనయందును, పాత్రౌచిత్యమందును మనము నేయు పొరపాటులను

పొరపాటుబడగ భావింపక, నాటకలక్షణముగ నెంచుట ప్రమాదము. ఈరో జులలో నాటకపాత్రములను తా మూహించుచు పురుషులవలె జేయునుపా యము లనేకము లేర్పడినవి. శ్రీనివాసరావుగారి 20 వ నియమము ననుస రించి రాముడో, కృష్ణుడో, శివాజీయో, రుస్తుమో యెవరిప్రతిమకు సరిపోవు ఒడ్డును పొడుగును ఉన్న నాటకుల నేరవచ్చును. 18 వ నియమము ననుసరించి యాయాదేశకాలపాత్రముల దుస్తులను విమర్శించి అట్టివానిని తయారు చేయ వచ్చును. మనకువలయు పాత్రపు ఫొటోగ్రాపుపంపి రబ్బరు ముఖము (mask) తెప్పించవచ్చును. ఆ మాస్కులు కొద్దిఖరీదుకు వచ్చును. ఈజాగ్రత్తలతో వేష ముధరించినవాడు తా నభినయించుపాత్రమే అయియుండును. ఇదిగాక పాత్ర గుణములను ఆనాటకమే కాక ఇతర వాఙ్మయమునుండి చక్కగ గ్రహించి వానినడవడి, ఆచారములు, చేష్టలు, వానిచరిత్ర, స్వభావము తెలిసికొనినచో ఈనాటకమందు వాడు సరిగ ఆడునట్లే సామాన్యనకు అభినయమగును. రూపము, దుస్తులు, ముఖము, అభిప్రాయభావములు వీనియందు మనము కల్పించి సరిగా ప్రకృతి ననుసరింపవచ్చును, ఇక రసము ప్రకృతిలోవలె ననుభవిం చుచు రసప్రకటన చేయనగునా? అను ప్రశ్నకు ఆంధ్రదేశములో పేరువడిన నాటకులచర్యలే తగినజవాబు. విశ్వనాథరావు ప్రహ్లాదుడు; కృష్ణస్వామి వరూధిని; దొరస్వామిఅయ్యంగారు దుష్యంతుడు; ప్రసాదరావు హరిశ్చ ంద్రుడు; అంకరాజు గామారావు నలుడు; గోవిందశాస్త్రి శ్రీకృష్ణయోగీశ్వ రుడు; ముంజులూరి కృష్ణారావు లాకికృష్ణుడు; చెట్టి నరసింహం శృంగార లీలాకృష్ణుడు; పెదన రామయ్య అశ్వత్థామ, లక్ష్మణస్వామి రుస్తుమ్; సుమి రింగు విశ్వామిత్రుడు; సంజీవరావు మోహిని; జగ్గరాజు చంద్రమతీ దమ యంతులు: వీ రీపాత్రలు ఆడునపుడు ప్రకృతిలో వారివారికి తగిన లక్షణము లబ్బుటయే గాక, యాయాకథలగూర్చి ఇదివఱకు తెలుగున వ్రాయబడిన ప్రబంధములకును, నాటకములకును వీరియాట వ్యాఖ్యానమై తనరుచున్నది. రావుగారు తలచినట్లు "ఖవడో" శ్రీరాముని భూమిక ధరించెనని యను

కానవలసిన పనిలేదు. ఆడు నేర్పుగల నటకునకు, పాత్రముల సంప్రదాయములను చక్కగా నేర్చి, వారికి తగిన భూమిక లొనగూర్చినచో నాటకములు తప్పక స్వాభావికములుగనే యుండును.

నాటకములు స్వాభావికములుగ నుండ నేరకనుటకు రావుగారు మరియొక కారణము నుడివియున్నారు. నాటకమాడు కొలది కాలములో అనేకయుగముల కాలపరిమితి పైతము జూపబడుచున్నదని ఇక్కడకూడ నాటకకవులు లక్షణముగ భావించినారు. ఇట్టి కాలవిస్తరణము పౌరాణిక నాటకములలో నున్నది. ప్రహ్లాదచరిత్రను ప్రదర్శించునెడ నెల్లూరు కృష్ణగాన సభవారు జయవిజయులు శాపముబొందుటకు పూర్వము మొదలిడి నృసింహావతారమావిర్భవించు వరకుగల యావృత్తాంతము చూపియున్నారు. ఇది నాటకము కాదు. మొదటనుండి చివరవరకును పాడగల తోలుబొమ్మలేకాని నాటకలక్షణము లిందులేవు. దీనిని pageantry అందురు. ఇంగ్లీషుచరిత్ర, ఫ్రాన్సుచరిత్ర (American Civil War; Balkan War) వీనిని pageantry రూపముగా ఆడినారు. సంపూర్ణరామాయణము, సంపూర్ణభారతము అట్టివే. నాటకలక్షణము లందులేవు.

నాటకములలో ముఖ్యపాత్రముల అంతఃకరణప్రవృత్తులకును మనోగతులకును, ఆదర్శములకును విరోధము కల్గును. ఇట్టి మానససమరమందు కొందరు ఇంద్రియప్రేరితమైన మనోవ్యాపారముల నవలంబింతురు. కొందరు వీనిజంపి యాదర్శముల రక్షించుకొందురు. కొందరు తీర్పును చేయజాలక భ్రష్టులై Hamlet వలె నశించెదరు. శ్రీరాముని సమస్య ఇది. అగ్నిగుండమున పవిత్రురాలని నిశ్చయింపబడి తన్ను విడనాడనని విన్నవించి సీతను అడవులకుపంపుట, ప్రజలకోరిక నెరవేర్చుకుండుట. ఇక్కడనే రామనాటకపు రక్తిపట్టు. తాను ప్రేమించి పెండ్లాడవచ్చిన దమయంతిని స్వవాక్యపరిపాలనమునకై దేవతల ననుగ్రహింపుమని వేడు తరుణమే నలనాటకపు ప్రాణస్థానము. హరి

శ్చంద్రలో "దేవబ్రాహ్మణ మాన్యములే విడచి" అనేపద్యమునొద్దను చంద్రమతిని అమ్ము వేళను రెండు పర్యాయములు నాటకలక్షణము బయలిడును. శాకుంతలలోని రక్తి దొంగతనముగా ఆశ్రమములోని పిల్లను ముద్దాడి పోవుటలో లేదు. 5వ అంకమున శకుంతల వచ్చినప్పుడు దుష్యంతునకు గల్గిన సమస్య: "కడుపుతోనున్న నాభార్యను విడచుట మంచిదా? ఇతరుని భార్యను గ్రహించుట మంచిదా?" ఇక్కడనుండియే శాకుంతలలోని నాటక రక్తి ప్రారంభమగును. రక్తిస్థానము (climax) కథాంతమునకు (dissolution) చేరుకొలది కథలోని చమత్కృతి జడివిన హెచ్చుచుండును. Victor Hugo నాటకములలోను రక్తిస్థానము, కథాంతము ఒకటిగనే యుండును. అందు మరియు నద్భుతము. ముద్రారాక్షసములోకూడ ఇటులనే జరిగినది. నాటకములో ఇట్టి మానససమరమును మననటులను తమపరివర్తనము నందు నిర్దేశించినచో మననాటకములుకూడ సంస్కృతాంగ్లేయ నాటకముల వలె వన్నెకెక్కియుండును. ఇట్టిమనోసమరమునకు వలయుకాలము కొన్ని మాసములకన్న మించియుండదు. ఉండినను విపరీతముగ దోచదు. ఎటులైన నాటకములు కాలవిషయములో ప్రకృతికి తగ్గిపోవును. దానిని చాలవఱకు తగ్గించి దోషరహితముగ జేయవచ్చును.

నాటకకవుల నియమములో 9వ దానియందు కొన్నిరంగముల తీసి వేసినను కథ తెగకుండునటుల వ్రాయుమని రావుగారు చెప్పుచున్నారు. ప్రమదాగ్రంథములయం దీపద్ధతి గానరాదు. శాకుంతలములో నిద్ది తీయవలయునో కనుపించదు. జార్జి ఎలియటునావలులందు, షేక్స్పియరందు యేనాలుగు పేజీలు తీయ వీలుకాదు. John Stuart Mill కావ్యలక్షణమును నిర్దేశించుచు, దేనినుండి యొకపదమునుగాని, వాక్యమునుగాని, రంగమును గాని త్రోసివైచినను, మరియొక దానిచే పూరించినను రసభంగము, కథానష్టము కలుగునో అదే కావ్యమనియు, అదే నాటకమనియు చెప్పియున్నాడు. పెద్దనాటకముల వ్రాసి వానిని స్టేజికై పలురీతుల చిరచుటకన్న మూడు నాలుగు గంటలలో ప్రదర్శింపదగు నాటకములను వ్రాయుటయే మేలు.

